# చతుర

ఫిబ్రవరి 2002

రూ.7/-



రెడ్డి స్వరాజ్యలక్ష్మి

## రాక్షసనీడ

# చతుర ప్రపంచం

## కథలతో ప్రశాంతత! భద్రత!

అనగనగా... అంటూ కథ మొదలుపెడితే మరి ఇక అక్కడ్నించీ కదలాలన్పించదు. చిన్నా పెద్దా వయసుతో తారతమ్యం లేకుండా కథలు వినాలని ఉత్సాహపడతారు. ముఖ్యంగా రాత్రిపూట తల్లిదండ్రుల పక్కన పడుకుని వారు చెప్పే కథలు వింటూ నిద్రలోకి జారుకోవడం ఎంత చక్కని అనుభూతి!

ఇదివరలో ఉమ్మడి కుటుంబాలలో అమ్మమ్మ, నాయనమ్మ, తాతయ్యలో, మేనమామలో ఈ బాధ్యత తమమీద వేసుకునేవారు. ఇక పిల్లలు కథలు వింటూ ఊహలలో విహరించేవారు. మరుసటి రోజు స్కూల్లో పిల్లలముందు గొప్పగా చెప్పుకోవడానికి ఈ కథలు పనికివచ్చేవి.

ఇలా కథలు చెప్పడంవల్ల ఏవైనా ఉపయోగాలున్నాయా అంటే, అబ్బో బోలెడన్ని ప్రయోజనాలున్నాయని పరిశోధకులు అంటున్నారు. కథలు వినడంవల్ల పిల్లల్లో జ్ఞాపకశక్తి, ఊహాశక్తి కూడా మెరుగవుతాయట. రామాయణ, మహాభారతాలనుంచి జీవితానికి సంబంధించిన పాఠాలు నేర్చుకునే అవకాశం ఉందిట. ఇక జానపద కథల ద్వారా సాహస ప్రవృత్తి, ఆపదలో ఉన్నవారిని ఆదుకోవాలనే తత్వం వృద్ధిపొందితే పంచతంత్రం వంటి కథలవల్ల ప్రకృతితోను, పశుపక్ష్యాదులతోను పరిచయం ఏర్పడుతుంది. ఇవికాక దేశభక్తుల గాథలు, స్వాతంత్ర్య పోరాటాలకు సంబంధించిన కథలు చెప్తే పిల్లల్లో దేశభక్తి పెంపొందుతుంది.

మరి ఇన్ని ప్రయోజనాలున్నాయి కాబట్టి రాత్రివేళ పడుకునేముందు పిల్లలకి కథలు



చెప్పాలని పరిశోధకులు అంటున్నారు. దీనివల్ల పిల్లలకీ, పెద్దలకీ మధ్య అను బంధం దృఢమవుతుందని, పిల్లలు ప్రశాంతంగా నిద్రపోగలుగుతారని ముఖ్యంగా వారి మనసులో కదలాడే ఆలోచనలు తెలుసుకోవచ్చన్నది కూడా వీరి పరిశోధనల సారాంశం. ప్రయత్నించి చూడండి.

---

## ప్రేమ దేవాలయం

అనగానే తాజ్‌మహల్ గుర్తొస్తుంది చాలామందికి. కానీ ఇప్పుడు చెప్పబోయేది తాజ్‌మహల్ గురించి కాదు. ఆఫ్రొడైట్ దేవాలయం గురించి. ప్రేమ గురించి తెలిసిన వారందరికీ ఆఫ్రొడైట్ గ్రీకుల ప్రేమ దేవతని తెలుసు. మరి దేవతంటూ నిర్ధారించాక ఆవిడకి ఓ దేవాలయం ఉండాలికదా!




దీనికి గ్రీకు చరిత్రకారులు ఆఫ్రొడైట్‌కు దేవాలయం ఎందుకు లేదు లక్షణంగా ఉంది అని వెంటనే ముక్తాయింపుగా ఎక్కడుందని మాత్రం అడగకండి. ఆ ప్రశ్నకి మా దగ్గర సమాధానం లేదు అని అనేవారు. ఎందుకంటే వారంతా ఎంతగా శోధించినా దేవాలయం కనుగొనలేకపోయారు మరి.

అయితే ఓ అమెరికన్ పురావస్తు శాస్త్రజ్ఞుడు మాత్రం పట్టువదలని విక్రమార్కుడిలా అన్వేషించి చివరకు ఎలాగైతేనేం ఓ శుభముహుర్తాన అఫ్రొడైట్ దేవాలయాన్ని తవ్వకాలలోంచి వెలికితీశాడు. దాంతో గ్రీకు చరిత్రకారులు 'చూశారా! మేం చెప్పింది నిజమైంది' అంటూ ఆ దేవాలయాన్ని మరమత్తులు చేసేందుకు పూనుకున్నారు. పనిలో పనిగా తమ పరువు కాపాడినందుకు ఆ అమెరికన్ పురావస్తు శాస్త్రజ్ఞుడికి బ్రహ్మరథం కూడా పట్టారనుకోండి.

ఇంతకీ ఆ శాస్త్రజ్ఞుడి పేరేంటో తెలుసా 'ఐరిస్ లవ్'. పేరులో ప్రేమ ఉంది కాబట్టి ప్రేమ దేవాలయాన్ని కనిపెట్టగలిగాడంటారా! సరే ఆమాటే అనుకుందాం.

# అక్కడ ఏనుగుదంతం చెట్లపై పెరుగుతుంది...

దక్షిణ అమెరికాలోని ఉత్తరభాగంలో పెరిగిపోయే వృక్షజాతి విత్తనాలు టాగ్వా. ఏనుగు దంతాలకు ప్రత్యామ్నాయంగా వీటిని ఉపయోగించవచ్చని తెలుస్తోంది.

ఈ చెట్ల ఆకులు చాలా నిదానంగా పెరుగుతాయి. వీటిమట్టలు నేలనుండి పొడుచుకువచ్చినట్లుగా ఉంటాయి. మట్టలకింద పెద్దపెద్ద గెలలు పెరుగుతాయి. ఒక్కోగెల బరువు సుమారు పదికిలోలు. వీటికి కాసే పండ్లు చెక్కలాగ ఉంటాయి. ఒక్కోపండులోను నాలుగునుంచి తొమ్మిదివరకు విత్తనాలు మనకి కన్పిస్తాయి. ఇవి కోడిగుడ్డు ఆకారంలో ఉంటాయి.

ఈ విత్తనాల పెరుగుదల మొదటి దశలో లోపల కమ్మని పానీయం ఉంటుంది. ఇది కొబ్బరినీళ్ళలా ఉంటుంది. రెండవదానిలో ఈ పానీయం తీయని జిగురవుతుంది. అనంతరం గట్టిపడి ఏనుగు దంతాన్ని తలపిస్తుంది.

ఏనుగు దంతాలవలే ఈ టాగ్వా విత్తనాలు గట్టిగా ఉంటాయి కాబట్టి ప్రత్యామ్నాయంగా ఉపయోగించవచ్చు. వీటిని పాలిష్ చేయడం, రంగులు వేయడంకూడా చాలా సులభం.

మొదట టాగ్వా విత్తనాలు ఎండబెట్టాలి. ఒకటినుంచి మూడునెలలపాటు వీటిని ఎండపెడితే విత్తనాలలోని నీటిశాతం ఆవిరవుతుంది. అప్పుడిక మనకు నచ్చిన వస్తువులు తయారుచేసుకోవచ్చు. గుండీలు, బొమ్మలు, చదరంగం పావులు, హ్యాండిల్స్ ఇలా ఎన్నో...

టాగ్వా విత్తనాలతో వస్తువులు తయారు చేసే సమయంలో రాలే పొడి జంతువులకి ఆహారంగా ఉపయోగపడుతుంది. ఈ చెట్ల ఆకులు ఇంటి పైకప్పుగా వాడుకోవచ్చు.

ఏనుగులను ఏనుగుదంతాలకోసం వేటాడేబదులు టాగ్వా చెట్ల పెంపకంపై దృష్టి నిలిపితే మంచిదికదా! ★



# 'గడప' పై సమీక్షలు

డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన హోతా పద్మినీదేవి నవల 'గడప' పై మాకందిన ఉత్తమ సమీక్షలు.



## కనువిప్పు

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

'ఆడపిల్లను తల్లిదండ్రులు కాలు తడవ కుండా కడలినైనా దాటింతురు కానీ కన్ను తడవకుండా గడపనైనా దాటింపలేరుకదా!' అన్నారో కవిగారు. ఇది అతిశయోక్తి కాదు. భారతీయ సంస్కృతిలో, హైందవ సమాజంలో స్త్రీకి గణనీయమైన చరిత్ర ఉన్నప్పటికీ, ఆమె కష్టాల చరిత్ర కూడా అంతే వుంది. ఆడపిల్ల తమ ఇంట్లోకన్నా సుఖంగా ఉండాలని, తమకంటే స్థితిపరునికిచ్చి పెళ్ళి చేయాలని కన్నవారు తాపత్రయపడతారు. ఆ తాపత్రయంలోనే తప్పులు చేస్తూ వుంటారు. అవి సగటు ఆడపిల్లకు గుదిబండలై కూర్చుంటాయి. అత్తింటి ఆరళ్ళూ, వారి గొంతెమ్మ కోర్కెలూ తీర్చలేక ఆడపిల్ల తల్లిదండ్రులు పడే అవస్థలు నేడు సర్వసామాన్యం.

ఈ ఇతివృత్తాన్నే హోతా పద్మినీదేవిగారు నవలగా చిత్రీకరించారు. కథ, కథనం పాతదే! అయినప్పటికీ, పరిష్కారం కొత్తదైతే అది చతురంగా ఉంటుంది. ప్రాచీన సమస్యకు ఆధునిక పరిష్కారం నేటి స్త్రీలకు మార్గదర్శకమవుతుంది. 'గడప'లో త్రిపురాంబ, ఆమె కూతురు వరలక్ష్మి, వారి పెంపకంలో పెరిగిన వర్ష, వాళ్ళందరికీ ఏమాత్రం తీసిపోని మహేశ్వరి, కల్పన వంటి స్త్రీల బారిన పడిన స్రవంతీ, రాజేశ్వరమ్మ బారినపడ్డ శ్వేత వంటి సగటు ఆడపిల్లలు కొంత విప్లవ దృక్పథంతో ఆలోచించినప్పటికీ మామూలు ఆడపిల్లలుగానే మిగిలిపోయి, మార్గదర్శకులు కాలేకపోయారు. నవలలో కథానాయికత్వం లోపించింది. తన భార్యలో మార్పు తీసుకువస్తుందనే ఆశతో స్రవంతిని కోడలుగా చేసుకున్న మాధవరావు, తన ఆశ తీరక, తానే భార్యకి, కొడుక్కి, అనామక లేఖలు రాయవలసివచ్చింది. మారవలసింది వ్యవస్థ. మార్చవలసింది యువత. వీటిపైనే ఆధారపడి వుంది స్త్రీల వైవాహిక భవిత. రవిలాంటి సగటు యువకులూ, మోహన్‌లాంటి ఆడంగి పురుషులూ ఉన్నంతకాలం అనేకమంది శ్వేతల, స్రవంతుల భవిత కూడా గడప దాటకుండానే వుంటుంది.

'గడప' నవల కాలక్షేపాత్మకంగానే నడిచి స్త్రీకి స్త్రీయే శత్రువనే నానుడిని గుర్తుచేస్తూ, తమ స్థాయిని మరిచి వివాహాలు చేసే ఆడపిల్ల తల్లిదండ్రులకు కనువిప్పు కలిగిస్తుంది. వివిధ వ్యక్తుల, వ్యక్తిత్వాలపట్ల రచయిత్రికున్న అవగాహన వ్యక్తమవుతుంది.

–జి.వి. మురళీమోహన్
పలాస - 532 221

## సినీ క్లైమాక్స్

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

హోతా పద్మినీదేవిగారి గడప నవల 'కానుకలు సంతోషంతో ఇవ్వాలి, పీడించి తీసుకోకూడదు' అనే విషయాన్ని సబ్జెక్టుగా తీసుకొని రాసినా చివరికి సరైన పరిష్కారాన్ని చూపించలేదనే చెప్పాలి. ఎక్కువ పాత్రలతో వచ్చిన సన్నివేశమే మళ్ళీ మళ్ళీ వస్తూ పాఠకులకు విసుగు తెప్పించింది. ఈర్ష్య అసూయలతో రగిలిపోయే పాత్రలు కొన్నయితే చదువుకుని కూడా 'నిస్సహాయంగా చూస్తుండే పాత్రలు కొన్ని. బాధని వ్యక్తం చేయడానికి చాలా భావాలుండగా ప్రతిదానికీ 'కళ్ళల్లో నీళ్ళూరాయి' అనే పదాన్నే పట్టుకుని వేళ్ళాడ్డం చదివేవారి సహనాన్ని పరీక్షించినట్లయింది. స్రవంతి అత్త, ఆడపడుచులే కాక తోడికోడలు కూడా మానసికంగా హింసిస్తున్నా, భర్త 'పట్టించుకోకపోయినా, కనీసం మంచివాడైన మామగారైనా కొడుక్కి చీవాట్లు పెట్టి వారి కాపురాన్ని చక్కదిద్దితే బాగుండేది. తన కళ్ళముందే స్రవంతిని మానసికంగా క్షోభ పెడుతున్నా కొడుకు అడ్డదార్లు తొక్కుతున్నా నోరు మెదపని తండ్రి మాధవరావు పెద్దకొడుక్కు ప్రాణాల మీదకి వచ్చి చిన్నకోడలు వెళ్ళిపోయిన తర్వాత చివరికి విజృంభించడం 'నేనూ ఉన్నానని' గుర్తు చేసినట్లుంది. లెటర్స్‌ద్వారా మార్పు తేవాలనుకోవడం అతని అసమర్థతను సూచిస్తుంది. స్రవంతి ఇంటినుంచి వెళ్ళిపోతున్నప్పుడు ఆగమని చెప్పని మాధవరావు ఆమె వెళ్ళిన తర్వాత కొడుకుతో 'వెళ్ళి నీ భార్యని తీసుకురా' అని చెప్పటం సినిమాలలో క్లైమాక్స్‌ను కాపీ కొట్టినట్లుగా ఉంది. భర్త కిడ్నీ అమ్మి డబ్బు పంపించాడని తెలిసినా వర్షలో కనీసం పశ్చాత్తాపం అయినా కలగకపోవడం వింతగా ఉంది. మొత్తం నవలంతా ఒకసారి విశ్లేషిస్తే ఏ పాత్రా కూడా పరిపూర్ణ వ్యక్తిత్వాన్ని కలిగి ఉండలేదని విశదమవుతుంది.

–కె. దుర్గాభవాని,
విజయవాడ -10

## ఆవేదనా ప్రతిబింబం

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

స్త్రీల మనోభావాలను కళ్ళకు కట్టినట్లు చూపడంలో తనది అందెవేసిన చేయి అని 'గడప' నవలద్వారా హోతాపద్మినీదేవి నిరూపించుకున్నారు.

మానవజీవితం అంటే కేవలం డబ్బు, ఆడంబరాలు కావు. ఆత్మీయత- అనుబంధాలు కలగలసినపుడే జన్మకు సార్థకత. నేటి సమాజంలో ఆడవారి విలువలు ఎంతగా దిగజారిపోతున్నాయోనని కొందరిని చూస్తే జాలి కలుగుతుంది. మధ్యతరగతి తల్లిదండ్రులు ఆడపిల్లకు పెళ్ళిచేసి అత్తవారింటికి పంపించినా కొంత మొత్తం కానుక రూపంలో కట్నంగా ఇచ్చినా ఇంకా డబ్బు కావాలనే వియ్యంకుల డిమాండ్లకు ఎలా తల్లడిల్లిపోతున్నాడో అర్థమౌతుంది. కొందరు మహిళలు పెళ్ళి అయిన తరువాత మెట్టింటివారి కోర్కెలు తీర్చలేక, ఇటు పుట్టింటివారిని ఇబ్బందిపెట్టలేక మానసికంగా ఎంత ఘర్షణ పడుతున్నారో, వారి మనో వ్యధలకు అక్షరరూపం ఈ నవల. 'అత్త కూడా ఒకింటి కోడలే' అన్న సంగతి మరిచిన కొందరు 'కొత్త' అత్తలు కేవలం డబ్బు కోసమే పెళ్ళి అనుకుని అమాయకులైన కోడళ్ళను వేధిస్తూ వారి తల్లిదండ్రులను ఎలా హింసిస్తూ తమ కోర్కెలను తీర్చుకుంటున్నారో పరోక్షంగా తెలియచేశారు. మనుషులమధ్య ఉండాల్సింది మమతలు, ఆప్యాయత, అనురాగాలే కానీ మనుషులమధ్య దూరం పెంచే డబ్బుకాదని వివరించిన తీరు చాలాబాగుంది. కని పెంచిన తల్లిదండ్రులను డబ్బుతో తృప్తి పరచాలనుకోవడం ఎంత మూర్ఖత్వమో ఇప్పటికైనా మగవాళ్ళు అర్థం చేసుకోగలగాలి. మానవ సంబంధాలను పెంపొందించే ఇలాంటి రచనలు ఇంకా రావాలి. ఆడవారికి పుట్టింటి 'గడప' ముఖ్యమా, మెట్టింటి 'గడప' ముఖ్యమా అని మథనపడే ఆవేదనలకు ప్రతిరూపమే ఈ నవల.

–ముంగర వెంకటేశ్వర్లు,
చెన్నూరు - 524 406

## అసంపూర్ణం

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

కొన్ని సంపన్న కుటుంబాల అహంకార ధోరణికి దర్పణం పట్టిన నవల 'గడప'.

ఆదర్శ మహిళామణులెందరో పుట్టిన మనదేశంలో గడప నవలలోని పాత్రలు త్రిపురాంబ, రాజేశ్వరమ్మ, వరలక్ష్మి, వర్ష వంటి అహంకారులు, ధన పిపాసులు కూడా జన్మిస్తున్నారన్నది సత్యం.

"ఓ గుమస్తాగాడి కూతుర్ని ఈ ఇంటి కోడలిగా చెయ్యాలనుకుంటున్నారా? నాకు ఇష్టంలేదు. మనకాళ్ళ దగ్గర నిలబడడానికి కూడా అర్హతలేని వాళ్ళతో మనం వియ్యమందాలా?" అంటూ అహంకారాన్ని, ఆడంబరాన్ని ప్రదర్శించే త్రిపురాంబ పాత్రచిత్రణ వర్తమాన సామాజిక పరిస్థితుల్ని ప్రతిబింబిస్తూ ఉంది.

మరోవైపు రాజేశ్వరమ్మ, ఆమె భర్త శంకరం, కొడుకు మోహన్, ముగ్గురూ నయవంచనకీ, స్వార్థానికీ ప్రతిరూపంగా నిలిచిన పాత్రలు. ఆ పాత్రల చిత్రీకరణలో రచయిత్రి పద్మినీదేవిగారు చూపిన నేర్పు ప్రశంసనీయం.

మనం రోజూ పత్రికల్లో చూసే వరకట్నపు వేధింపులు, తరుణ వయస్కులైన యువతుల దారుణ మరణాలు, ఇలాంటి ధనాశాపరులవల్లే జరుగుతున్నాయి.

సాధారణ కుటుంబాలలోని ఉత్తమ కన్య సంపన్నుల ఇంటికోడలుగా వస్తే, ఆ కోడలు ఉమ్మడి కుటుంబంలో వుండాల్సివస్తే, సంభ

వించే సాధకబాధకాల్ని స్రవంతి పాత్రద్వారా చక్కగా ఎత్తిచూపిందీ నవల.

మరోవైపు సంపన్నుల అమ్మాయిలకోసం వెంపర్లాడి, ఆస్తిమీద ఆశతో అబద్ధాలాడి, సంబంధాలందుకుంటే జరిగేదేమిటో ధీరజ్‌కి జరిగిన అవమానం తెలియచేస్తుంది.

"నీ బతుకే అబద్ధం! నీకసలు నన్ను పెళ్ళి చేసుకునే అర్హతుందా? నీ ముఖానికి వేలకి వేలు ఖరీదు చేసే కానుకలు కావాల్సివచ్చాయా? నువ్వు గొప్పవాడిలా నటించి నన్ను పెళ్ళి చేసుకున్నావు. అందుకే నువ్వంటే నాకు అసహ్యం" అనిపించుకున్నాడు ధీరజ్.

కానీ నవల ముగింపు అస్పష్టంగా, అసంపూర్ణంగా వుంది.

ఒకదానితో ఒకటి సంబంధంలేని రెండు కుటుంబాల కథలు నవలలో వున్నాయి. గడప నవల ఒక్కటే! కథలు రెండు, స్రవంతి కథ, శ్వేత కథ.

ఓర్పు, నేర్పుగల ఉత్తమ యువతి శ్వేత. తెగేదాకా లాగిన అత్త, మామ, భర్తల కుటిల బుద్ధుల్ని, స్వార్థాన్ని అసహ్యించుకుని తెగతెంపులు చేసుకుంది. ఇది సముచితంగా వుంది.

"డబ్బుకోసం చేసే కాపురాన్ని కాపురం అనరు. వ్యభిచారం అంటారు. మీరు నా దృష్టిలో మేల్ ప్రాస్టిట్యూట్ కంటే హీనులు" అని ఆ నరకంనుండి బయటపడిన శ్వేత ఈ తరం యువతకు ఆదర్శం.

–ఎన్. యామిని

హైదరాబాద్ - 500 044

## మార్పు

***(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)***

**బాంధవ్యం** కన్నా డబ్బే ప్రధానం అన్నట్లున్న ఈనాటి సమస్యలు ప్రతీ కుటుంబ జీవితాన్ని పట్టిపీడిస్తున్నాయన్నది సత్యం. ఇవి అందరికీ సుపరిచితాలే. వరకట్నం ఎన్నో అనర్థాలకు మూలమైన దురాచారం కూడా. అయినా యీ చక్రంలోనుంచి ఎవరూ బయటపడలేకపోవడం విస్మరించలేనిది. ఈ కోణాలన్నింటినీ స్పృశిస్తూ 'గడప' నవలలో రెండు కుటుంబ జీవితాల నడక సాగింది. ఇది మనకు సంబంధించింది కాదు అని ఎవరూ అనుకోలేని విధంగా ఇంచుమించు ప్రతీ వివాహాన్ని అల్లుకున్న సాలెగూడులాంటి ఈ కథాంశం అందరికీ వర్తింపచేస్తుందనేది అతిశయోక్తికాదు. చిత్రం ఏమంటే ఇందులో హింసపెట్టేదీ, హింసకు గురి అవుతున్నదీ స్త్రీయే! అది చాలా సహజంగా చూపబడింది. నిజానికి కొందరు మగవాళ్ళు, అనుచితంగా దుర్మార్గంగా ప్రవర్తించినా దానికి కూడా కారణం స్త్రీల ప్రోద్బలమే. ఏ రకంగా చూసినా మార్పు రావలసింది స్త్రీలలోనే. అత్తా ఒకింటి కోడలే అనీ, కూతురూ, కోడలూ ఒకటేననీ గుర్తించవలసింది కూడా స్త్రీలే. అంతవరకూ ఈ హింసా, వేదనా తప్పవు. అయితే సమస్యను చాలా వివరంగా చూపిన నవలలో కొన్ని విషయాలలో సరైన పరిష్కారాలు చూపలేదనిపించింది. అలాగే రవి తండ్రి రాఘవరావు పాత్ర తీరు చాలా బలహీనంగా వుంది. సంఘటనలూ, సంభాషణలూ సాధారణంగా సాగాయి. వర్ష పాత్రను ఎలా అర్థం చేసుకోవాలో తెలియలేదు. బాధింపబడే స్త్రీలకు ఎన్నో సహాయమార్గాలు, రక్షణలూ వున్నాయని అనుకుంటున్నా అవి సరిగా అందడంలేదని చెప్పవచ్చు. ఆడపిల్లకి అత్తింటి రక్షణ లేనప్పుడు పుట్టింటివాళ్ళు ఆ భద్రతను కలిగించాలి అనే సందేశాన్ని ఈ నవల అందిస్తోంది. మానవ జీవితాలలో అన్నిరకాల మార్పులనూ ఇముడ్చుకుంటున్న సమాజం ఈ విషయంలో కూడా మార్పును తీసుకురావాలి.

–ఏ. లక్ష్మి,

హైదరాబాద్ - 500 076

★

చతుర సంపుటి: 25 సంచిక: 1 ఫిబ్రవరి: 2002

289 వ సంచిక

అర్ధరాత్రి పన్నెండయింది. ఎవరో తలుపు తట్టారు. ఆ రూమ్‌లో ఒంటరిగా వుంటున్న ఆ అందమైన అమ్మాయి... బెదురుతూనే తలుపు తీసింది. ఎదుటి వ్యక్తిని చూసి స్థిమితపడి... లోపలికి రానిచ్చింది. కానీ వచ్చినతను ఆయాసపడుతూ, భయపడుతూ, తడబడుతూ... లైటార్పేసి... బెడ్‌లైటు వెలుగులోనే ఆమె చేతిలో ఓ వస్తువు పెట్టాడు. దాన్ని ఆమెకిచ్చిన విషయం ఎవరికీ, ఎప్పుడూ చెప్పొద్దన్నాడు. బతికుంటే మర్నాడు కలుస్తానన్నాడు. ఉలిక్కిపడిందామె. తన ఒంటరి జీవితానికి ఆలంబననిచ్చి తనని ఒక సోదరిలా చూసి ఆప్యాయత పంచిన అతడు... ఏదో ప్రమాదావస్థలో వున్నాడని గ్రహించింది. తనింట్లోనే వుండిపొమ్మంది. కాదు, వద్దు, ప్రమాదం... అంటూ అతడు హడావిడిగా ఆ చీకట్లో కలిసిపోయాడు. అటుపైన ఏం జరిగింది? అతడు ఆమెకిచ్చిన వస్తువేమిటి? అది ఆమెను ఎలాంటి సమస్యలకు గురిచేసింది? అతడేమయ్యాడు?

ఉత్కంఠతో చదివించే **రెడ్డి స్వరాజ్యలక్ష్మి** పరిశోధనాత్మక రచన

# "రాక్షసనీడ"

ఈనెల 'చతుర' సమగ్ర నవల.



కాలింగ్‌బజర్ నొక్కగానే లోపల్నుండి "ఆ వస్తున్నా" అంటూ ఓ కేక విన్పించడం, మరునిమిషంలో తలుపు తెరుచుకోవటం జరిగింది. తలుపు తెరిచిన నడివయసు దాటిన వ్యక్తి గుమ్మంలో నిలబడ్డ యువకుని వైపు అనుమానంగా చూస్తూ, "ఎవరు కావాలి?" అని అడిగాడు.

"మీరు... మిష్టర్ జయరాం అనుకుంటాను"

"అవును నేనే జయరాం, మీరెవరు?"

"నా పేరు సిద్ధార్థ. కేమ్ ఫ్రమ్ ఇంటెలిజెన్స్. చిన్న ఇన్ఫర్మేషన్ కావలసి వచ్చాను. లోపలికి రావచ్చునా" అడిగాడు.

"సారీ, రండి లోపలకు" అంటూ డ్రాయింగ్‌రూమ్‌కు వెంటబెట్టుకెళ్లి "అలా కూర్చోండి" సోఫా చూపాడు జయరాం.

"థ్యాంక్యూ"

సిద్ధార్థ కెదురుగా కూర్చుంటూ "అడగండి మీరేం అడగదల్చుకున్నారో" అన్నాడు జయరాం.

"నెల్లాళ్ల కిందట మీ ఔట్‌హౌస్‌లో ఓ హత్య జరిగిందిగా..."

సిద్ధార్థ మాట్లాడ్డం పూర్తికాకముందే జయరాం ఎర్రబడ్డ ముఖంతో "సారీ, మీరనుకున్నట్టు అది మర్డర్ కాదు. సూయిసైడ్" అన్నాడు.

"అది మర్డర్ కాదని మీరెలా చెప్పగలరు?"

"అలా చెప్పింది నేను కాదు. డెడ్‌బాడీ ఉన్న తీరునుబట్టి పోలీసులే అతనిది సూయిసైడ్ అని నిర్ధారించారు. ఆ విషయంలో నాకెటువంటి అపోహలూ లేవు"

"ఐసీ! వాళ్ళన్నట్టు అది ఆత్మహత్య కాకుండా హత్య అయ్యే అవకాశమే లేదంటారా?"

"అది నేనెలా చెప్పగలను?"

"మీరే చెప్పగలరు. హతుడు..."

"మేఘశ్యామ్"

"అవే అతడు మీ ఇంట్లో మూడేళ్ళుగా ఉంటున్నాడని తెలిసింది. అతడి పర్సనల్ లైఫ్ గురించీ మీకు తప్పకుండా తెలిసేవుంటుంది. అతడి మిత్రులు, బంధువులు, విరోధులు వీళ్ళందరి గురించి మీకు తెలిసిందేదయినా చెప్పడానికి అభ్యంతరం లేదనుకుంటాను"

"అభ్యంతరం మాట పక్కన పెడితే శ్యామ్ గురించి నాకు తెలిసింది చాలా తక్కువ. ఆ వివరాలు మీకేవిధంగానూ ఉపకరించవనే నా అభిప్రాయం. అయినా ఓ వ్యక్తి ఆత్మహత్య చేసుకుంటే దాన్ని హత్యగా వక్రీకరించి ఇన్వెష్టిగేషన్ పేరుతో మమ్మల్ని ఇబ్బంది పెట్టడం అవసరమంటారా?"

సిద్ధార్థ చిన్నగా నవ్వాడు. "సారీ, మిమ్మల్ని ఇబ్బంది పెట్టాలన్న ఉద్దేశం నాకు లేదు. శ్యామ్ మరణం వెనుక మా డిపార్ట్‌మెంట్ కెన్నో సందేహాలున్నాయి. అతడు చెప్పినట్టే ఆత్మహత్య చేసుకునుంటే సానుభూతిగా ఓ నిట్టూర్పు వదిలి విషయాన్ని అంతటితో వదిలెయ్యొచ్చు కాని... ఎవరో అతడ్ని మర్డర్ చేసి అది సూయిసైడ్‌గా భ్రమింపచేసి చట్టాన్ని మోసగించి ఉంటే ఆ వాస్తవాన్ని వెలికితీసి నేరస్తుల్ని పట్టుకుని శిక్షించాల్సిన అవసరం ఎంతయినా ఉందని అంగీకరిస్తారుగా"

"నిజమే" జయరాం ఒప్పుకున్నాడు.

"ఇక ఇప్పుడు శ్యామ్ గురించిన వివరాలు చెప్పి మాకు సహకరించండి"

"చెప్పేంత గొప్ప విషయాలేం లేవు. అతడిది గాలిపాటు జీవితం. మూడేళ్లనుండీ మా ఔట్‌హవుస్‌లో ఉంటున్నా నా అన్నవారెవరూ అతడింటికి రావడం చూడలేదు. అతడెవరింటికీ వెళ్ళింది లేదు"

"వెరీ ఇంట్రస్టింగ్. అతడెవరూ లేని ఒంటరివాడన్నమాట"

"ఒంటరివాడన్న జాలితో పండుగకు, పబ్బానికి అతడిని మా ఇంటికి భోజనానికి ఆహ్వానించేవాళ్లం. చాలా మొహమాటస్తుడు. మొదట్లో భోజనానికి రావటానికి ఇష్టపడేవాడు కాదు. కాస్త పరిచయం పెరి

గాక వస్తూపోతున్నా చాలా పెద్ద మనిషి తరహాగా వ్యవహరిస్తుండేవాడు. ఒక్క విషయంలో మాత్రం అతడి పద్ధతి నాకు నచ్చేది కాదు"

"ఏవిటా విషయం? "

"తరుచు అర్ధరాత్రి దాటాకే ఇంటికొస్తుండేవాడు. "ఏమిటయ్యా ఇదీ" అని అడిగితే చిన్నగా నవ్వేసి, "నా ప్రొఫెషనలాంటిది. మీకు అసౌకర్యం కల్గిస్తున్నందుకు మన్నించండి" అనేవాడు. రేపట్నుంచీ ఇలా జరగడానికి వీల్లేదని హెచ్చరించేవాడిని. అయినా మూడోనాడు మామూలే"

"మీకు నచ్చని వ్యవహారంతో అంత తేలిగ్గా ఎలా రాజీపడగలిగారు. అతడ్ని ఇల్లు ఖాళీ చేయించాలన్న ఆలోచన రాలేదా? " అడిగాడు సిద్ధార్థ.

"లేదు. అతడి రాకపోకలవల్ల మాకెలాంటి ఇబ్బంది లేనప్పుడు అలా చెప్పడానికి మనసెలా వస్తుంది. పైగా ఫస్ట్ తారీఖున అద్దె ఠంచనుగా తెచ్చిచ్చేవాడు. ఒక్కోసారి అతడు అద్దె ఇస్తున్నప్పుడు ఆరోజు ఒకటో తారీఖని నేను గుర్తు తెచ్చుకోవాల్సొచ్చేది. అటువంటి వ్యక్తిని వదులుకోవాలని ఏ గృహస్థుకుంటుంది చెప్పండి" అన్నాడు జయరాం.

"నిజమే. హి ఈజ్ ఎ జెంటిల్మెన్. వృత్తిరీత్యా ఆలస్యంగా ఇంటికి రావటం తప్పడం లేదని చెప్పాడన్నారే అసలతని ప్రొఫెషనేమిటి? " అడిగాడు సిద్ధార్థ.

"అతడు మంచి ఫొటోగ్రాఫర్. పైగా చిత్రకారుడు. అతడు కుంచెపడితే గీసే బొమ్మలకు జీవం వస్తున్నట్టే ఉంటాయి. అతడు వేసిన చిత్రాలకు చాలా బహుమతులొచ్చాయి. కిందటి సంవత్సరం జాతీయస్థాయిలో నిర్వహించిన పోటీల్లో శ్యామ్ వేసిన చిత్రానికి ప్రథమ బహుమతి లభించింది. ఆరోజు మా అందరికీ స్వీట్స్ తెచ్చి పంచాడు. ఆరోజు అతడి కళ్లల్లో మెరిసిన తృప్తిని మాటల్లో వివరించలేను" చెప్పాడు జయరాం.

"నా ప్రశ్నకు జవాబు లభించలేదు. అతడు ఫొటోలు తియ్యటానికి, బాగా పొద్దుపోయి రావటానికి ఉన్న లింకేమిటో అర్థం కాలేదు" అన్నాడు సిద్ధార్థ.

"సారీ అంతకుమించి నాకూ తెలియదు. ఇక మీకేం చెప్పగలను"

"పోనివ్వండి మూడేళ్ళలో అతడి కోసం ఒక్క స్నేహితుడైనా, స్నేహితురాలైనా ఈ ఇంటికి రావటం జరగలేదా? "

"స్నేహితురాలంటే గుర్తొచ్చింది. శ్యామ్ కోసం తరుచు ఇద్దరమ్మాయిలొస్తుండేవారు. ఇద్దరిలో ఒకమ్మాయి అతడితో చాలా చనువుగా ఉండేది"

"దయచేసి ఆ ఇద్దరమ్మాయిల గురించి మీకు తెలిసిన పూర్తి వివరాలు చెప్పండి"

"ఒకమ్మాయి పుష్టిగా, పొట్టిగా చామనఛాయ రంగులో ఉంటుంది. ఆమె పేరు మంగళ. ఈ అమ్మాయి ఎప్పుడో ఉదయమనగా వచ్చి రాత్రి పొద్దుపోయాక ఇంటికి వెడుతుండేది. శ్యామ్ ఆమెకు తోడుగా వెళ్ళి ఇంటి దగ్గర దిగబెట్టి వచ్చేవాడు. వాళ్ళిద్దరూ మంచి ప్రేమికులని మాకర్థమయ్యేది. పెళ్ళి చేసుకోమని శ్యామ్‌కు సలహా ఇస్తే 'అప్పుడే కాదని' దాటవేసేవాడు. 'పెళ్లంటూ చేసుకోవటం జరిగితే ఆమెనే చేసుకుంటానని' దృఢంగా చెప్పేవాడు. అందుకే మంగళ రాకపోకలు మేమంతగా పట్టించుకునేవాళ్ళం కాదు"

"మరి ఆ రెండో అమ్మాయి..."

"రెండో అమ్మాయితో శ్యామ్‌కున్న పరిచయం ఆర్నెల్లు మాత్రమే. ఆ అమ్మాయి సన్నగా చువ్వలా, తెల్లగా జాజిమొగ్గలా ఉండేది. ఆమె సౌందర్యమంతా ఆమె సోగకళ్లలోనే దాగిఉందంటే అతిశయోక్తి కాదు. చాలా చలాకీగా ఉండేది. నిజానికి ఆమె తీరుతెన్నులు చూస్తే మంచి మోడల్‌గా రాణించే అవకాశముందనిపించేది. పేరు సరిగా తెలియదు"

"ఈ రెండో అమ్మాయి కూడా శ్యామ్‌తో రోజంతా గడిపేదా? " అడిగాడు సిద్ధార్థ.

"లేదు. ఒక్కోసారి ఉదయం, ఒక్కోరోజు సాయంత్రం వస్తుండేది. ఎప్పుడొచ్చినా రెండు మూడుగంటలు మించి ఉండేది కాదు. శ్యామ్ రెండు రోజులకు చనిపోతాడనగా ఆరోజు సాయంత్రం కూడా ఆ అమ్మాయి వచ్చింది. రాత్రి ఏడింటివరకూ అతడి రూమ్‌లోనే ఉంది. ఆ అమ్మాయి వెళ్ళే సమయానికి నేను కారిడార్లోనే కూర్చున్నాను. ఎప్పుడూ లేనిది వెడుతూ, "బయట చాలా చలిగా ఉంది. మీ ఆరోగ్యానికి ఈ గాలి మంచిది కాదు. లోపలికి వెళ్ళండంకుల్" అని కూడా చెప్పింది.

"మీరేమనుకోనంటే నాదో ప్రశ్న. ముందు చెప్పిన అమ్మాయిలానే ఈ అమ్మాయి కూడా శ్యామ్‌తో సన్నిహితంగా ఉండేదంటారా? "

"మీ ప్రశ్నకు నేను జవాబు చెప్పలేను. ఈ అమ్మాయి గదిలో ఉన్నంతసేపు తలుపులు బంధించే ఉండేవి. ఆ గదిలో ఇద్దరూ ఏకాంతంగా ఉండి ఏం చేస్తున్నారన్నది చెడుగా నేనెప్పుడూ ఊహించలేదు" జయరాం చెప్పాడు.

"అదే ఎందుకు ఊహించలేకపోయారో చెప్పండి"

"మంగళ వచ్చినప్పుడు ఆ ఇంట్లోనుండి చాలా సందడి విన్పించేది. నవ్వులు కేరింతల్తో ఇల్లంతా ఒకటే సందడి చేసేది. మధ్యమధ్యలో మా ఇంట్లోకి వచ్చి అందరితో సరదాగా మాట్లాడేది. ఈ అమ్మాయి అలా కాదు. ఆమె వచ్చినా అసలు మనుషులున్నారన్న అలికిడే విన్పించేది కాదు. ఆ ప్రశాంతతే నాలో చెడు ఊహకు తావియ్యలేదు" జయరాం మాటల్లో నిజాయితీ సిద్ధార్థకు మరో ప్రశ్నకు అవకాశం ఇవ్వలేదు.

"ఐసీ! శ్యామ్ పోయాక ఈ నెలరోజుల్లో ఆ అమ్మాయిలిద్దరూ ఎప్పుడైనా ఈ ఇంటికొచ్చేరా? " అడిగాడు.

"శ్యామ్ చనిపోయాడన్న సంగతి ఆ ఉదయం ఎనిమిదింటికి మా అందరికీ తెలిసింది"

"ఎలా తెలిసింది? "

"చెప్తాను. శ్యామ్ ముందురోజు రాత్రి బాగా పొద్దుపోయాక వచ్చాడు..."

"అంటే సుమారుగా ఎన్ని గంటలకు వచ్చుంటాడో మీకేమన్నా ఐడియా ఉందా" మధ్యలోనే అడ్డుతగిలాడు సిద్ధార్థ.

"పన్నెండున్నరయ్యుంటుంది. అతడొచ్చేసరికి నేను మెలకువగానే ఉన్నాను. అసలా రాత్రి నాకెందుకో నిద్రపట్టలేదు. వివేకానందుని జీవితచరిత్ర చదువుతూ హాల్లోనే కూర్చున్నాను. గేటు తెరిచిన అలికిడికి కారిడార్లోకి వెళ్ళాను. శ్యామ్ గేటు తెరిచి లోపలికొచ్చి మళ్ళీ గేటు వేస్తున్నాడు. ఆలస్యంగా వచ్చినందుకు శ్యామ్‌ని మందలించి పంపేశాను. శ్యామ్ తలొంచుకుని మవునంగా వెళ్ళిపోయాడు. బయట్నుండి వచ్చాక ఓ గంటవరకు శ్యామ్‌గదిలో లైటు వెలుగుతూనే ఉండేది. కాని ఆ రోజు రాత్రి మాత్రం తాళంతీసి లోపలికి వెళ్ళి లైటన్నా వేసుకోకుండానే పడుకున్నాడు. ఆ విషయాన్ని నేను పెద్దగా పట్టించుకోలేదు. ఓ పావుగంట నిలబడి చూసి నేను లోపలికొచ్చేశాను" చెప్పాడు జయరాం.

"శ్యామ్ రాగానే చివాట్లేశానని చెప్పారు గదా! మీరు చూసినప్పుడు, మాట్లాడినప్పుడు శ్యామ్ మామూలుగానే ఉన్నాడా? "

"అంటే... మీ సందేహం నాకర్థంకాలేదు"

"అంటే... ఐమీన్ శ్యామ్ ఆ క్షణంలో దేని గురించో భయపడుతున్నవాడిలానో, పరుగెత్తి అలిసినవాడిలానో ఉన్నాడా అన్నది నా సందేహం. సరిగా గుర్తుచేసుకుని చెప్పండి"

"లేదు. అతడిలో నాకలాంటి మార్పేమీ కన్పించలేదు. ఎంత ఆలస్యంగా వచ్చినా ఉదయం ఆరింటికే లేచి దైనందిన కార్యక్రమాలు చూసుకునేవాడు. ఆరోజు ఎనిమిద



యినా లేవకపోయేసరికి మా ఆవిడ కాఫీ, టిఫిన్ పనిమనిషి చేత పంపించి అతడిని నిద్రలేపమని చెప్పింది. అదిగో పనిమనిషి వెళ్ళాకే తెలిసింది. శ్యామ్ ఉరిపోసుకుని మరణించిన సంగతి. వెంటనే పోలీసులకు ఫోన్ చేశాను. అరగంటలోనే వాళ్ళంతా ఇక్కడున్నారు. పోస్ట్‌మార్టమ్‌కు డెడ్‌బాడీని తీసుకెళ్ళారు. ఫార్మాలిటీస్ పూర్తయ్యేసరికి సాయంత్రమయింది. అతడికి దహన సంస్కారాలు నేనే జరిపించాను. ఏదో రుణానుబంధం ఉండి ఉంటుంది. ఈ జన్మలో ఇలా తీర్చుకోవాల్సివచ్చుంటుంది. ఇప్పటికీ అతడెందుకు ఆత్మహత్య చేసుకున్నాడో నాకర్థం కాలేదు" జయరాం నిట్టూర్పు విడిచాడు.

"అడిగిన వెంటనే విషయాలు ఇంత వివరంగా చెప్పినందుకు మెనీ మెనీ థ్యాంక్స్. ఆ తరువాత ఆ అమ్మాయిలిద్దరూ ఈ ఇంటికొచ్చారో లేదో చెప్పలేదు" గుర్తుచేశాడు సిద్ధార్థ.

"శ్యామ్ చనిపోయిన రెండు రోజులకనుకుంటాను. ఆ రెండో పిల్ల వచ్చింది. శ్యామ్ మరణవార్త మా ఆవిడ చెప్పగానే షాక్ తిన్నట్టు నిలబడిపోయింది. బాగా డీలాపడ్డట్టు కన్పించింది. మీరు చెప్తున్నది నిజమేనా అని కూడా అడిగింది. ఓ అరగంట వరకు ఈ వరండాలోనే కూర్చుని వెళ్ళింది"

"ఆ అమ్మాయి ఎక్కడుంటుందో ఆ వివరాలు తెలుసా?"

"తెలియదు. మంగళ గురించి మాత్రం మాటల్లో శ్యామ్ చెప్పిన గుర్తుంది"

"మంగళ ఎక్కడుంటుంది?"

"టూటౌన్ పోలీస్‌స్టేషన్ దాటాక మసీదు వెనుక ఉన్న సందులో ఎక్కడో ఉన్నట్టుగా చెప్పాడు"

"మెనీమెనీ థ్యాంక్స్. ఒక్కసారి శ్యామ్ ఉండే ఔట్‌హౌస్‌ను కూడా చూసేందుకు

పర్మిషన్ ఇవ్వండి" సిద్ధార్థ లేచి నిలబడ్డాడు.

"మీరు చూస్తానంటే నేనభ్యంతరం చెప్పను. మా ఆవిడకు సెంటిమెంట్స్ ఎక్కువ. ఆర్నెల్లవరకూ ఆ గది ముఖం చూడకూడదని తాళాలు పెట్టించింది. కీస్ ఇస్తాను. మీరు వెళ్ళి చూడండి" అంటూ లోపలికెళ్ళి తాళాలు తెచ్చిచ్చాడు.

తాళాలు తీసుకుని ఔట్‌హౌస్‌వైపు వెళ్ళాడు సిద్ధార్థ. విశాలమైన ఆ కాంపస్‌లో ఔట్‌హౌస్ ఓ మూలకు విసిరేసినట్టుంది. దాని పక్కనే ఉన్న వేపచెట్టు కొమ్మలు కాంపౌండ్‌వాల్ మీదనుండి అటువైపు కూడా విస్తరించి ఉండడం అతడి దృష్టిని తాకింది. ఒక్కక్షణం కాంపౌండ్‌వాల్ ఎత్తును, అటునుండి గోడమీదుగా చెట్టెక్కి లోపలికి రాగల అవకాశాలు గురించి పరిశీలించి చూసి తల పంకించాడు.

ఔట్‌హౌస్ తాళం తెరిచి లోపలికెళ్ళాడు. లోపల కిటికీ తలుపులు సయితం వేసి ఉండడంవల్ల అదోలాంటి మాగు వాసన ఒక్కసారి ముక్కుకు సోకి ఉక్కిరిబిక్కిరి చేసింది.

బయట శుభ్రమైన గాలి లోపలికొచ్చి అక్కడి వాతావరణం సర్దుబాటవటానికి ఐదునిమిషాలు పట్టింది.

ముక్కుకు అడ్డం పెట్టుకున్న కర్చీఫ్ తిరిగి జేబులో పెట్టుకుని లోపలికెళ్ళాడు. ముందున్న హాలు దాటి వెడితే బెడ్‌రూమ్. ఆ రూమ్‌లో పెద్దగా ఫర్నిచరేం లేదు. ఓ టేబుల్, నాలుగు కుర్చీలు, సింగిల్‌కాట్, పైన సీలింగ్ ఫ్యాన్, చిన్న డ్రెస్సింగ్ టేబుల్, డ్రాయింగ్ బోర్డ్, స్టాండు ఉన్నాయి.

కప్‌బోర్డులో ఓ అరనిండా అతడికొచ్చిన షీల్డులు, బహుమతులు వరుసగా పేర్చి ఉన్నాయి.

ఆరోజు రాత్రి పడకమీద నలిగిన దుప్పటి, పక్కకు జరిగిన దిండ్లు అలాగే ఉన్నాయి. వాటినెవరూ ముట్టుకున్న జాడ లేదు.

టేబుల్‌మీద కొన్ని ఇంగ్లీషు, తెలుగు మాగజైనులు కన్పించాయి. వాటిమీద పేరుకున్న ధూళిని విదిల్చి వాటిని అటూ, ఇటూ తిరగేసి చూశాడు.

కప్‌బోర్డ్‌లో అడుగు అరలో పాత డైలీ పేపర్లు కట్టకట్టి ఉన్నాయి. చుట్టూ గోడలకు అతడు పెయింట్ చేసినవే నాలుగు వైపులా నాలుగు చిత్రాలు వేలాడదీసి ఉన్నాయి. పెయింటింగ్స్ కింద 'మేఘ' అని అందంగా పెయింట్ చేసివుంది.

ఆ చిత్రాలవైపు పరిశీలనగా చూశాడు. మనిషి జీవితంలో నాలుగుదశలను ప్రతిబింబిస్తున్నాయవి.

అన్నిదశల్లో కూడా ఒకే పోలికలున్న స్త్రీమూర్తి రూపాన్ని చిత్రీకరించగల్గడం మేఘశ్యామ్‌లోని చిత్రకారుని ప్రత్యేకత. మళ్ళీ మళ్ళీ చూస్తే 'ఫెంటాస్టిక్' అని అనుకోకుండా ఉండలేరు.

సిద్ధార్థ కూడా పదేపదే ఆ చిత్రాలను చూస్తూ మైమరిచిపోయాడు. మేఘశ్యామ్‌ను మనసులోనే అభినందించాడు. అంతటి గొప్ప చిత్రకారుని చెయ్యి నిర్జీవమైనందుకు మథనపడ్డాడు.

"నో ఎండ్ టు ది ఆర్ట్" ఆ మాటలతని పెదవులు సన్నగా ఉచ్చరించాయి.

మంచంమీద చెదిరిన దిళ్లను, దుప్పటిని సరిచెయ్యబోతుంటే చిన్న పుస్తకం దిండుకిందనుండి జారిపడింది. పుస్తకం తెరిచి చూసి రెండు మూడు వాక్యాలు చదివేసరికి అతడి కళ్లు ఆనందంతో మెరిశాయి. దాన్ని జేబులో పెట్టుకుని మరోసారి ఇల్లంతా పరిశీలించి బయటికొచ్చాడు.

సిద్ధార్థనుండి తాళాలందుకుంటూ, "మీరాశించినట్టు ఏమన్నా ఆధారాలు లభించాయా? " అని అడిగాడు జయరాం.

"లేదు. ఇంతవరకూ మీరు ఓపిగ్గా నాతో

సహకరించినందుకు కృతజ్ఞుడిని. వస్తాను" నమస్కరించి వెళ్ళిపోయాడు సిద్ధార్థ.



మేడ మెట్లు దిగివస్తున్న యజమానిని చూసి వినయంగా పక్కకు తప్పుకుంది ఆయా.

"ఆయా! చిన్నీ ఇంట్లోనే ఉన్నాడా? " అడిగాడు శివప్రకాష్.

"ఉన్నారండి"

"ఎనిమిదవగానే వాడిని పిల్చి భోజనం పెట్టు. నువ్వు జ్ఞాపకం చెయ్యకపోతే వాడికి తిండి ధ్యాస కూడా ఉండదు" హెచ్చరించాడు.

"అలాగే బాబూ"

ప్రకాష్ నేరుగా చిన్నీ గదిలోకి వెళ్ళాడు. చిన్నీ మంచం మీద పడుకుని టేబుల్ లాంప్ వెల్తురులో ఏదో పుస్తకాన్ని దీక్షగా చదువుతున్నాడు.

"చిన్నా! కేసులు, గొడవలు ఎప్పుడూ ఉండేవే. అవి నీకు ముఖ్యమయితే నీ ఆరోగ్యం నాకు ముఖ్యమని మర్చిపోవద్దు"

"మీరా అంకుల్. ఈవేళప్పుడు ఎక్కడకు బయల్దేరారు? " చదువుతున్న పుస్తకం మడిచి అడిగాడు.

"ఈరోజు మేయరుగారింట్లో డిన్నరుందని చెప్పానుగా. నువ్వు ఎనిమిదవగానే భోంచెయ్యి"

"అలాగే. మీరు వెళ్ళిరండి" పడకమీద నుండి లేచి శివప్రకాష్ వెనుకే కారిడార్ వరకు వచ్చాడు చిన్నీ.

కారు మేయర్ గారింటిముందు ఆపి లోపలికి వెళ్ళాడు శివప్రకాష్. అప్పటికే చాలామంది అతిథులు వచ్చారు. తనను ఆహ్వానించటానికొచ్చిన మేయర్ రంగనాథంతో కరచాలనం చేస్తూ, "సారీ నేను లేటయినట్టున్నాను" అన్నాడు.

"ఫరవాలేదు లోపలికి రండి" శివప్రకాష్‌ను వెంటబెట్టుకు వెడుతుండగా కాస్త సన్నగా, బొద్దు మీసాల్తో ఉన్న వ్యక్తి ఎదురుగా వస్తూ, "ఇక నాకు సెలవిప్పించండి" అన్నాడు రంగనాథంతో.

"డిన్నరు తీసుకోకుండా వెడతానంటే నేనెలా ఒప్పుకుంటాననుకున్నారు. మరో అరగంట నా కోసం స్పేర్ చెయ్యక తప్పదు" చనువుగా అతడి భుజంమీద చెయ్యేసి అంటున్నాడు రంగనాథం.

"కానివ్వండి. మీ ఇంటికి రానంతవరకే మా ఇష్టం. ఆ తరువాత మీ ఇష్టంలా ఉందే" నవ్వుతూ అంటూ శివప్రకాష్ ముఖంలోకి చూశాడు అతడు.

శివప్రకాష్ కూడా అప్పుడే అతడి ముఖంలోకి చూసి ఉలిక్కిపడ్డాడు. సూదంటురాయిలా ఆ కళ్ళల్లో దాగి ఉన్న శక్తి ప్రకాష్ ఒంట్లో రక్తాన్ని ఇగిర్చింది.

"ఈయన మిష్టర్ శివప్రకాష్. వీరు మిష్టర్ అమరేంద్ర. ఈయన పేరు మీరు వినే ఉంటారు" అంటూ ఇద్దరినీ ఒకరినొకరికి పరిచయం చేశాడు రంగనాథం.

"నమస్కారం" చేతులు జోడించాడు శివప్రకాష్.

అమరేంద్ర ప్రతి నమస్కారం చేశాడు.

సరిగా అప్పుడే "వెళ్ళిపోదామన్నారుగా. ఇంకా ఇక్కడే నిలబడ్డారెందుకు? " అంటూ

ఒకామె వచ్చి అమరేంద్ర సమీపంలో నిలబడింది.

ఆమె గొంతు వినగానే శివప్రకాష్ మనసు వశం తప్పింది. కోటి వీణలు మోగినట్టుండే ఆ కంఠధ్వని నిశ్చయంగా తనెరుగున్నదే. ఒకప్పుడు ఆ స్వరమాధురికి చలించి ఉన్మాదిలా జీవితాన్నే ఆమె పాదాక్రాంతం చేశాడు. ఆ రోజులు తన జీవితంలో శరత్కాల వెన్నెలను కురిపించిన రోజులు. 'చీకటంటే తెలియని తన్మయావస్థలో మునిగిన తను ఆ స్వప్న సౌధంనుండి బలవంతంగా నెట్టెయ్యబడ్డాడు. తన జీవితచిత్రమే ఆ దెబ్బతో తునాతునకలయ్యింది. ఆ తరువాత తనకు మిగిలిందేమిటి? కటికచీకటి.

తను కోల్పోయిందేమిటి? మనశ్శాంతి. ఆ గాయం మాయనిది. ఆ అనలం ఆరనిది. ఈ ఆవేదన తీరనిది.

చూడకూడదనుకున్నా శివప్రకాష్ చూపులు ఆమెమీదకే దాడిచేశాయి. ఆమె కూడా అప్పుడే అతడివైపు చూసింది. మొదటి చూపులోనే ఆమె ముఖం రక్తం లేనట్టు పాలిపోయింది. తనలో కలిగిన తడబాటును, ఉద్వేగాన్ని కప్పిపుచ్చుకోటానికి శతవిధాలా ప్రయత్నించింది.

సందేహంలేదు. ఆమె... ఒకప్పుడు తన హృదయాన్నేలిన మహారాజ్ఞి వింధ్య.

అమరేంద్ర భార్య ముఖంలోకి చూసి నవ్వాడు. ఆ నవ్వు వింధ్య హృదయంలో చలిపిడుగులు కురిపించింది.

"ఈయన మిష్టర్ శివప్రకాష్. ఇప్పుడే నాకు పరిచయమయ్యారు" అని భార్యకు పరిచయంచేసి "ఆ మిష్టర్ ప్రకాష్ ఈమె నా భార్య. పేరు వింధ్య" అంటూ పరస్పరం పరిచయం చేశాడు అమరేంద్ర.

నమస్కార ప్రతినమస్కారాలయ్యాక "వెడదామా? " అంది వింధ్య భర్తతో.

"డిన్నరు తీసుకుని వెడదాం" చెప్పి భార్యను తీసుకుని ఖాళీగా ఉన్న ఛెయిర్స్ వైపు వెళ్ళిపోయాడు అమరేంద్ర.

శివప్రకాష్‌కు పారే సెలయేటిలో బండరాయి వేస్తే కలకలం రేగినట్టే వింధ్యను చూసిన క్షణంనుండి మనసంతా అల్లకల్లోలమయింది. కావాలనే అందరికీ వెనగ్గా ఓ మూలగా ఉన్న కుర్చీ వద్దకు వెళ్ళి కూర్చున్నాడు.

వద్దు వద్దనుకున్నా మనసు వింధ్యవైపే పరుగులు తీస్తోంది. వింధ్యలో పెరిగిన వయసు పెద్దగా మార్పు తేనేలేదు. సౌందర్యాన్ని కాపాడుకోటంలో ఆమెకున్న శ్రద్ధను తప్పక అభినందించాలి.

అప్పట్లో ఎంత స్లిమ్‌గా ఉండేదో ఇన్నేళ్ళయినా అలాగే కన్పిస్తోంది. అప్పటికంటే మరింత రంగుతేలి ముట్టుకుంటే మాసిపోతుందా అనే పాలరాతి శిల్పంలా ఉంది. ఆ అందమే ఒకప్పుడు తనను మత్తెక్కించి పిచ్చివాడ్ని చేసింది.

ఆలోచనల్నుండి తేరుకున్న శివప్రకాష్ బఫే మొదలవటంతో అందరితోపాటు తనూ లేచివెళ్ళి టేబుల్ మీదున్న ప్లేటు తీసుకుని ఐటమ్స్ ఉన్న టేబుల్ వైపొచ్చాడు. అట్నుండి అప్పుడే వింధ్య కూడా దగ్గరగా రావటం అతడు గమనించనేలేదు.

"ఎలా ఉన్నారు? " వంగి స్వీటును తన ప్లేటులో వేసుకుంటూ మెల్లగా అడిగింది.

"చంద్రోదయం లేని ఆకాశంలా" ఆమె వైపు చూడకుండానే అదే స్థాయిలో జవాబిచ్చాడు,

"మీతో మాటాడాలి. మీ అడ్రసివ్వండి" భర్త ఎక్కడున్నాడో చూశాక అతడు తనను గమనించడంలేదని నిర్ధారించుకున్నాకే అడిగింది.

తనెక్కడుంటున్నదీ వివరంగా చెప్పాడు. అంతా విన్నాక తన ప్లేటు తీసుకుని దూరంగా వెళ్ళిపోయింది వింధ్య.

డిన్నరు తీసుకున్నాక వింధ్య అమరేంద్రతో కలిసి వెళ్ళిపోయింది. వెళ్లేముందు శివప్రకాష్ వైపు చూసి కళ్లతోనే సెలవు తీసుకుంది.

ఆమె నిష్క్రమణతో కురిసిన వెన్నెల కరిగినట్టయింది. మరో అరగంటకు రంగనాథంతో చెప్పి ఇంటికి వెళ్ళిపోయాడు.

కారులో వింధ్య భర్త పక్కనే కూర్చుంది. అమరేంద్ర ఏదో ఆలోచిస్తున్నవాడిలా కారు నిదానంగా డ్రైవ్ చేస్తున్నాడు. అతడంత నెమ్మదిగా డ్రైవ్ చేస్తున్నాడంటే ఆ నిశ్శబ్దం తనకు ఎదురవబోయే తుఫానుకు నాంది అని వింధ్యకు తెలుసు.

అమరేంద్ర అసాధ్యుడన్నది ఆమె ఎరిగున్నదే. మనసు మూలల్లో దాగిన చీకటికోణాలను ఇట్టే పసిగట్టగలడు. ఏ చూపులకు ఏ అర్థముంటుందో చెప్పగలడు. ఎదుటివారి మనసు అతడి ముందు తెరిచి ఉన్న పుస్తకంలాంటిది.

ఆ తుఫానును ఢీకొనడానికి సన్నద్ధురాలయింది వింధ్య. ప్రత్యర్థి శక్తిసామర్థ్యాలు ఎరిగున్నదే కాబట్టి అతడి దాడినెదుర్కొనేందుకు మానసికంగా తనను తాను సమాయత్తం చేసుకుంటోంది వింధ్య.

"అతడు ఇతడేకదూ" బాంబులాంటి ప్రశ్న విసిరాడు అమరేంద్ర.

"కాదు"

"నువ్వబద్ధం చెప్తున్నావని నాకు తెలుసు"

"అబద్ధం చెప్పాల్సిన అవసరమేముంది? అన్నీ తెలిసే నన్ను పెళ్లి చేసుకున్నారు. ఇక దాపరికం దేనికి? "

"అంటే శివప్రకాష్ ఎవరో నీకసలు తెలియదని నన్ను నమ్మమంటావు" వ్యంగ్యంగా అన్నాడు.

"తెలియదని చెప్పలేదే"

"ఇంకేం బాగా కావలసినవాడేనన్నమాట"

"అలా అని కూడా నేననడంలేదు"

"షటప్. నా కళ్లే మసగేశాయని చెప్పకు. అతడు టేబుల్ దగ్గరకు వెళ్ళినప్పుడు కావాలని వీలు కల్పించుకుని వెళ్ళి అతడితో చెవులు కొరకడం అబద్ధమంటావా? "

"మాట్లాడేను. మాట్లాడ్డమే మీరు చూశారు. నేనేం మాట్లాడానన్నది మీరు చెప్పలేరు. ఇంతకుముందు అతడినెక్కడో చూసినట్టనిపించింది. అదే విషయం అతడినడిగాను"

"అతడేం చెప్పాడు? "

"మీరెవరో నాకు గుర్తురావడం లేదని మర్యాదగా చెప్పాడు"

"స్టూపిట్! ఆడవాళ్లు అబద్ధాన్ని అందంగా అతికినట్టు చెప్పటంలో సిద్ధహస్తులని తెలుసు. కానీ నన్ను మభ్యపెట్టలేవు. అతడ్ని చూడగానే తత్తరపడ్డావు. నానుండి నీ మనసు దాచుకోటానికి విశ్వప్రయత్నం చేసి విఫలమయ్యేవు. నీ ముఖంలో అంతర్లీనంగా దాచుకోలేని సంతోషం చూశాను. నీ చూపులు అతడ్ని వేటాడ్డం గమనించాను. అతడితో మాట్లాడాలన్న తపన, అందుకు నువ్వు కల్పించుకున్న వీలు అన్నీ అన్నీ చూశాను. ఇంకా నన్ను మోసగించాలని భ్రమపడకు" అమరేంద్ర మాటలకు వింధ్య మవునంగా ఉండిపోయింది.

ఆపై అతడు కూడా మాట్లాడలేదు. ఐదు నిమిషాల్లో కారు స్పీడుగా పోనిచ్చి ఇంటి ముందాపేడు. కారుడోర్ తీసుకొని దిగి అతడి వెనుకే లోపలికొచ్చింది వింధ్య. డ్రెస్సింగ్‌రూమ్‌కు వెళ్లబోతుంటే వెనుక నుండి అమరేంద్ర కంఠం ఖంగుమంది.

"రేపురాత్రికి ఫామ్ హవుస్‌కు వెళ్లాలి. సిద్ధంగా ఉండు" ఆజ్ఞాపించాడు.

వింధ్య మంచుముద్దలామారింది. ఒంట్లో రక్తం గడ్డకట్టినట్టయింది.

"ఆరోజు జరిగింది మీరు మర్చిపోయినట్టున్నారు. ఆషాక్ నుండి నేనింకా తేరుకోలేదు. ఏ క్షణంలో ఉరమకుండా మీద పిడుగు పడుతుందోనని భయంతో బతుకుతున్నాను. ఈ పరిస్థితిలో నేను మానసికంగా ప్రిపేర్‌కాలేను. క్షమించండి" అంది ప్రాధేయపడుతూ.

"నీకాభయం అక్కర్లేదు. నిశ్శబ్దం ఎప్పుడూ గొంతు విప్పలేదు. రాబందుల రెక్కల చప్పుడు నిశ్శబ్దాన్ని జాగృతం

చెయ్యాలనుకున్నా ఈ అమరేంద్ర దానిరెక్కలు విరిచి గొంతును తన ఇనుప పాదాలకింద నొక్కిపట్టి ఉంచి మూగదాన్ని చేస్తాడు. నీ భర్త శక్తిని తక్కువగా అంచనా వెయ్యకు. అది నాకిష్టముండదు"

"మీకు మీరనుకున్నదేగాని నా మనసు అక్కర్లేదన్నమాట" నిస్సహాయంగా అంది వింధ్య.

"నువ్వు చెప్పబోయేది నాకు తెలుసు. 'నాకీ జీవితం వద్దు... పరమపతివ్రతలా మీ పాదసేవ చేసుకోవాలనుకుంటున్నాను' ఇదేగా నువ్వు చెప్పేది. ఆ అవకాశం నువ్వు పదిహేడేళ్ల వయసులోనే మిస్సయ్యేవు వింధ్యా"

"కానీ అది ఏమీ ఎరుగని బాల్యం. ఆ తప్పును అర్థం చేసుకుని క్షమించలేరా"

"ఆడపిల్లను పెళ్లికానంతవరకు మిస్ వింధ్యా అనో, మిస్ మాధవీ అనో పేరుకు ముందు మిస్ చేర్చి ఎందుకు పిలుస్తారో తెలుసా? స్వీట్ సిక్స్టీన్ దాటేక ఆ స్వీట్‌ను తొందరపడి మిస్ చేసుకోవద్దని పదేపదే గుర్తుచేయటానికి. పెళ్లికాని ఆడపిల్ల జాజి మొగ్గలాంటిది. ఆ సున్నితత్వం చెడితే మిగిలేది పరిమళం కోల్పోయిన కాగితం పువ్వు మాత్రమే. బురదలో ఒకసారి జారిపడ్డాక ఎన్నిసార్లుపడ్డా తప్పులేదు. రేపు రాత్రి విషయం మాత్రం గుర్తుంచుకో" చెప్పి మేడ మీదకు వెళ్లిపోయాడు అమరేంద్ర.

యంత్రంలా నడిచి లోపలికి వెళ్లింది వింధ్య. బట్టలు మార్చాలనిపించలేదు. నిస్సత్తువగా పడకమీద వాలిపోయింది. మనసు తీరా ఏడ్వాలనిపించిన కోర్కెకు ఆమె అడ్డు కట్టవెయ్యలేదు. చాలాసేపు దిండు తడిసేక ఆమె కన్నీరు ఇంకిపోయింది. దుఃఖం ఆగిపోయింది.

అమరేంద్ర అధికారం తన మనసును మండించి మసిచేసినప్పుడల్లా ఆ రాత్రి తనకు రోదనే మిగుల్తుంది. కష్టసుఖాలు పంచుకోవాల్సిన భర్త రాక్షసుడిలా మారితే ఆ స్త్రీకి ఓదార్పు లభించేదెక్కడ?

★ ★ ★

సరిగ్గా ఎనిమిదయ్యేసరికి చిన్నీ గదికొచ్చి భోజనానికి రమ్మని పిల్చింది ఆయా.

భోజనంచేసి గదిలోకి రాగానే మళ్లీ టేబుల్ లాంప్ వెలిగించి మేఘశ్యామ్ రూమ్‌నుండి తెచ్చిన పుస్తకాన్ని తెరిచాడు.

"పర్సనల్ మెమొరాండం" అని ఉన్న పేజీలో అతడి పేరు, బ్లడ్‌గ్రూప్, ఇతర వివరాలన్నీ రాసున్నాయి.

అవన్నీ పైనుండి కిందివరకు ఓసారి చదివి లోపల పేజీలు తిరగేశాడు.

"పెద్దపెద్దవాళ్లు, మేధావులు రాసుకున్న ఆత్మకథలు పుస్తకాలుగా అచ్చయి వస్తాయి. ఒక్కోసారి అవే విద్యార్థుల చేతుల్లో పాఠ్యపుస్తకాలుగా కూడా అలంకరించుకుంటాయి. కానీ నాలాంటి ఓ అనాథ కథ మాత్రం కాలచక్రం కిందపడి నలిగిపోతుంది. వారి కథలు శిలాక్షరాలయితే నాలాంటివాడి కథ సిరాక్షరాల్లానే మిగిలిపోతుంది.

"నాకు కాస్త ఊహ తెలిసేసరికే నాకోసం తపించేవాళ్లెవరూ ఈ విశాల ప్రపంచంలో లేరని అర్థమయింది. ఏ తల్లికడుపున పుట్టేనో తెలియదు. ఏ దురదృష్టక్షణాన భూమ్మీద పడి కళ్లు తెరిచానో తెలియదు. నేనున్నది మాత్రం ఓ అనాథాశ్రమంలో.

మొలకగా ఉన్నప్పుడే నన్ను చిదిమెయ్యకుండా రూపురేఖల్ని, రక్తాన్ని పంచి ఈ సృష్టికి అర్పణగా నన్నీలోకంలోకి తెచ్చిన ఆమె నిజంగా దయాంతరంగ.

నిజంగా అమ్మ అంటే నిత్యం పఠించే అర్థవంతమైన ఓ జీవనవేదం. నా చుట్టూ ఉన్న ప్రకృతి అమ్మ మనసులానే ఎంతో ఉదాత్తంగా ఉంటుంది. పచ్చని, మెత్తని తివాచీలాటి గడ్డిమీద పడి మణిదీపాల్లా మెరిసే తుషారబిందువులను చూసినపుడు నా కళ్లల్లో సంతోషం తొణికిసలాడేది. విశాలంగా పెరిగిన అశోకవృక్షాలను చూసినపుడు మనిషిలో వ్యక్తిత్వం ఉన్నతంగా

ఎదగాలని అవి సూచిస్తున్నాయనిపించేది. నా భావోద్వేగమే చిత్రాలరూపంలో ప్రాణం పోసుకునేది. నాలో చెలరేగే ఉద్వేగం, ఆ సున్నితత్వం నన్నో చిత్రకారుడ్ని చేశాయి.

వయసుతో పాటు నాలో చిత్రకారుడు కూడా ఎదుగుతూ వచ్చాడు. రెక్కలు వచ్చేక పిల్ల పక్షిగూడునంటి పెట్టుకోవాలను కోటం స్వార్ధమవుతుంది. అందుకే ఆశ్రమాన్ని వదిలి విశాలప్రపంచంలోకి అడుగు పెట్టేను.

మక్కువతో నేను పెంచుకున్న కళ నాకు తిండిపెట్టే జీవనాధారమైంది. ఎన్నో బహుమతులు, ప్రశంసలు, అభినందనలు నన్ను చుట్టుముట్టినా సమూహంలో కూడా నేను ఒంటరినే. ఈ ఒంటరితనంలో ఎంత వేదన ఉందో, అంత హాయి ఉంది. వారానికి ఓసారి ఆశ్రమానికి వెళ్లడం, నాకు చేతనైనంతలో వారికి ఆర్థిక సాయం చెయ్యటంలో నాకెంతో తృప్తి ఉండేది.

ఈ పరిస్థితుల్లోనే మిస్టర్ ఆర్ విచిత్రమైన స్థితిలో పరిచయమయ్యాడు. నా స్నేహాన్ని అభిలషించాడు. నా సహాయసహకారాలనర్థించాడు. కాదన లేని పరిస్థితి నాది. అయినా నా శ్రమకు అతడు విలువకట్టి ఫలితాన్నందిస్తున్నపుడు నేనెందుకు తిరస్కరించాలి?

పోనుపోను అర్థమయింది. నేనెంతటి సంక్లిష్ట పరిస్థితిలో పడ్డానో. కత్తి అంచు మీద నడుస్తున్నానని అర్థమయింది. అప్పటికే నేను తిరిగి రాలేని అగాధాలు దాటుకొని వెళ్లాను. కిందికి రాలేను. పైకి వెళ్లలేను. ఈ సంఘర్షణలో నలిగిపోతున్నాను. ఇప్పుడు నిజంగా నా ఒంటరితనం నన్ను వెక్కిరిస్తోంది. నన్ను చుట్టుముట్టి భయపెడుతోంది. నాకు తోడు కావాలి. నన్ను సేద తీర్చే స్నేహం కావాలి. దానికోసం అహర్నిశలు తపించిపోయాను.

అదిగో ఆ పరిస్థితిలోనే మంగళతో పరిచయమయ్యింది.

"చిన్నీ నువ్వింకా నిద్రపోలేదా? " డిన్నరు నుండి తిరిగొచ్చిన శివప్రకాష్ పలకరింపుతో పుస్తకం మడిచి "అప్పుడే వచ్చేశారా? " అన్నాడు.

"ఇప్పుడు టయిమెంతయిందో చూశావా? "

"అబ్బో అప్పుడే పదిన్నరయ్యిందా. ఈ పుస్తకం చూస్తుంటే టైమే తెలియలేదు. మీరూ వెళ్లి పడుకోండంకుల్. నేనూ నిద్ర పోతాను" అంటూ లైటార్పేశాడు చిన్నీ.

శివప్రకాష్ నైట్ బల్బ్ వెలిగించి గుడ్‌నైట్ చెప్పి వెళ్లిపోయాడు.

★ ★ ★

సిద్ధార్థ నేరుగా ఎల్.ఐ.సి బ్రాంచి ఆఫీసు ముందు స్కూటరాపి చకచకా లోపలికి వెళ్లాడు.

మేనేజర్ అన్నబోర్డు తగిలించి ఉన్న రూమ్ ముందాగి తలుపు చిన్నగా తట్టి "మే ఐ కమిన్" అన్నాడు.

"యస్ కమిన్" లోపల్నుండి పిలుపురాగానే తలుపు తోసి లోపలికి వెళ్లాడు.

"అలా కూర్చోండి" అంటూ ఎదురుగా ఉన్న కుర్చీ చూపాడు.

"థ్యాంక్స్" అంటూ కుర్చీలో కూర్చున్నాడు.

"చెప్పండి, మీరొచ్చిన పనేంటో" మేనేజర్ వినడానికి ఉద్యుక్తుడయ్యాడు.

"నా విజిటింగ్ కార్డు చూశారనుకుంటాను"

"చూశాను. నావల్ల ఏ సహకారం కావలసినా నిరభ్యంతరంగా మీరు పొందొచ్చు"

"ఈ పాలసీ నెంబరుగల పట్టాలో ఉదహరించిన నామినీ వివరాలు కావాలి. దయచేసి చెప్పగలరా" చిన్న స్లిప్ అందించాడు సిద్ధార్థ.

మేనేజరు వెంటనే మాట్లాడక పోవటం చూసి "మీరీ వివరాలు చెప్పటంవల్ల ఎవరికీ ఎటువంటి హానీ ఉండబోదని నేను హామీ ఇస్తున్నాను" అన్నాడు.

మేనేజరు ఏమనుకున్నాడో సెక్షన్

క్లర్క్‌ను పిల్చి ఆదేశాలిచ్చాడు. ఓ పావుగం టలో సిద్ధార్థకు కావలసిన సమాచారాన్ని అందించాడు క్లర్కు.

నామినీగా మేఘశ్యామ్ ఉదహరించింది ఎవరినోకాదు మంగళనే. క్లర్కు ఇచ్చిన వివ రాలున్న కాగితం జేబులో పెట్టుకుని మేనేజ రుకు మరోసారి థ్యాంక్స్ చెప్పి బయటప డ్డాడు సిద్ధార్థ.

అడ్రసు మరోసారి మననం చేసుకుని స్కూటరును మంగళ ఇంటివైపు పోని చ్చాడు.

మంగళ ఇల్లు కనుక్కోటానికి కాస్త శ్రమ పడాల్సొచ్చింది. అతడు వెళ్లేసరికి మంగళ ఇంటి తలుపులు తెరిచే ఉన్నాయి. ముందు గదిలో ఈజీచైర్లో ఓ అమ్మాయి పడుకుని ఇంటి పైకప్పుకేసే నిశ్చలంగా చూస్తోంది.

అతడు గుమ్మంలో నిలబడ్డా ఆమె పట్టిం చుకునే స్థితిలో లేకపోవటం చూసి తన ఉనికిని తెల్పుతూ చిన్నగా దగ్గాడు.

ఆ శబ్దానికి చివాల్న తల తిప్పి ఆ అప రిచితుడ్ని చూడగానే దిగ్గున లేచి "ఎవరు కావాలి? " అంది.

'మంగళ పొట్టిగా, పుష్టిగా, చామనచా యతో ఉంటుంది' అన్న జయరాం మాటలు గర్తొచ్చి 'నిశ్చయంగా ఈమే మంగళ' అని నిర్ధారణకొచ్చాడు సిద్ధార్థ.

"ఎవరంటే మాటాడరేం" ఆ అమ్మాయి విసుగ్గా అంది.

"సారీ! మంగళంటే మీరే కదూ? "

"అవును నేనే. మీరెవరు? "

"నేనెవరయితేనేం ప్రస్తుతానికి మీ శ్రేయో భిలాషిని. మీకభ్యంతరంలేకుంటే ఇలా ఈ బల్లమీద కూర్చుంటాను" సిద్ధార్థ లోపలికి అడుగువేసి అన్నాడు.

"రండి" మంగళ పిలవగానే సిద్ధార్థ వెళ్లి బల్లమీద కూర్చున్నాడు.

"అమ్మాయ్! ఎవరే ఆ వచ్చింది" ఆ గది నానుకుని ఉన్న చిన్న గదిలోనుండి ఎవ- రిదో స్వరం వణుకుతూ ప్రశ్నించింది.

"పక్కింటివాళ్ళ రమేష్. అన్నీ నీకే కావాలి. మాటాడకుండా పడుకో" విసు క్కుంది మంగళ. ఆ అమ్మాయిలో విసుగు చూస్తుంటే అసలు సహనంలేనట్టే తోచింది సిద్ధార్థకు. లోపలి స్వరం ఏదో గొణగడం సిద్ధార్థకు విన్పిస్తూనే ఉంది.

"ఇప్పుడు మాటాడిందెవరు? " అడిగాడు.

"మా అమ్మ"

"కన్నతల్లిని అలా విసుక్కోటం బావుండ లేదు" అన్నాడు.

"నాకూ తెలుసు. ఆమె అనారోగ్యం మనిషి. నాలుగేళ్ళుగా మంచంమీదనుండి లేవలేని పరిస్థితి. అయినా అన్నీ ఆమెకే కావాలి. ఎదిగిన ఆడపిల్లనని తెగ ఆరాటప డుతుంది. ఏమీ చేయలేని నిస్సహాయస్థి తిలో కూడా ఆమె ఆరాటం చూస్తే నాకు చిరాగ్గా ఉంటుంది. మీరే చెప్పండి ఆమె చాదస్తమేగాని ఆమె నాకోసం ఏం చెయ్యగ లదు? నా గురించి నాకు తెలియదా" అంది మంగళ.

"నిజమేగాని అదే కన్నతల్లి ప్రేమంటే. మీ జీవితం సుఖంగా సాగాలనే ఆమె తాప త్రయం" నచ్చచెప్పాడు సిద్ధార్థ.

"హు! సుఖం... ఇక అది నా జీవితంలో ఎప్పుడూ తొంగిచూడదు" నిస్పృహగా అంది మంగళ.

"సారీ నాకూ తెలిసింది. శ్యామ్ మరణం మిమ్మల్నెంతగా కుంగదీస్తుందో నేనర్థం చేసుకోగలను" సానుభూతిగా అన్నాడు సిద్ధార్థ.

మంగళ ముఖంలో చకచక రంగులు మారాయి. "మీరేం అంటున్నారో నాకర్థంకా వట్లేదు" గంభీరతను తెచ్చిపెట్టుకుంటూ అంది మంగళ.

"నేను చెప్తున్నది మీకు తెలిసిన విష యమే. మేఘశ్యామ్ మీకెంత సన్నిహితుడో, మీ ఇద్దరి పరిచయమెలాంటిదో మీ కథంతా నాకు తెలుసమ్మా. త్వరలోనే నిన్ను పెళ్ళిచే సుకుంటానని కూడా నాతో చెప్పాడు. అంత

లోనే ఈ అఘాయిత్యం జరుగుతుందని ఎవ్వరం అనుకోలేదు"

సిద్ధార్థ మాటలకు మంగళ తెచ్చిపెట్టు కున్న బింకం కరిగిపోయింది. మేఘశ్యామ్‌ను తల్చుకుని దోసిట్లో ముఖముంచి రోదించింది.

ఆమె ఆ దుఃఖాన్నుండి తేరుకునే వరకు మవునంగా కూర్చున్నాడు. కాసేపటికి ఆమె తేరుకుంది.

"శ్యామ్ ఇలా చేస్తాడనుకోలేదు. అతనిలో ఆత్మహత్య చేసుకునేంత పిరికితనం ఉంటుం దనుకోలేదు" అన్నాడతను.

"క్షమించండి. ఆయనకు ఆత్మహత్య చేసు కోవాల్సినంత అవసరంలేదు. అతడు మీర నుకున్నట్టు పిరికివాడుకాదు. ఒకవేళ పరిస్థి తులకు లొంగి చేసుకోవాలనుకున్నా నా మీ దున్న మమకారం ఆయనకు తప్పకుండా సంకెళ్ళు వేస్తుంది. ఆయన సూయిసైడ్ చేసుకున్నారంటే నేనెప్పటికీ నమ్మను" మంగళ దృఢంగా అంది.

"అంటే... మీ ఉద్దేశ్యంలో ఆయన్నెవర యినా... హత్యచేసి ఉంటారంటారా? "

మంగళ ముఖంలో రంగులు మారాయి. "అది నేనెలా చెప్పగలను. నేనెరిగినంతలో ఆయనకెవరూ శత్రువులులేరు. మిత్రులూ తక్కువే. ఆయనదొక ఒంటరి ప్రపంచం. ఫోటోలు తియ్యాల్సొచ్చినప్పుడు బయటకు వెళ్ళడం, లేదంటే గదిలో కూర్చుని బొమ్మలే సుకోటం తప్ప ఇతర ప్రపంచంతో ప్రమే యంలేనట్టే ఉండేవారు. ఏ దిక్కూలేక అనా థాశ్రమంలో పెరిగినా ఆ హృదయం మమత తెలియని బండరాయికాదు. పువ్వు లాంటి సౌకుమార్యంతో నిజమైన కళాపిపా సిలా కన్పించేవారు. అటువంటి సహృద యునికి ప్రాణంతీసే శత్రువులుంటారంటే నాకు నమ్మకం చిక్కడంలేదు" అంది.

"నిజమే మీ నమ్మకాన్ని కాదనలేను. మీ ఇద్దరి మధ్యా ప్రేమానురాగాలు చిగురించాక కూడా పెళ్ళెందుకు చేసుకోలేదు? అభ్యంతరం మీనుండా, శ్యామ్ నుండా" అడిగాడు సిద్ధార్థ.

"శ్యామ్‌కు స్నేహితులమని, నాకు శ్రేయో భిలాషినని చెప్పేరుగా. మీ ప్రశ్నకు జవాబే మిటో మీకు తెలియదా..." మంగళ పదు నుగా అడిగింది.

సిద్ధార్థ ఉలికిపడ్డాడు. చిర్నవ్వు తెచ్చు కుంటూ "మీరు నమ్మినా నమ్మకపోయినా నేను మీ శ్రేయోభిలాషినే. ప్లీజ్ నా ప్రశ్నకు జవాబు చెప్పండి" అన్నాడు.

"కట్నాల సంతలో పెళ్ళికొడుకుని కొని తెచ్చుకోలేని స్థితిలో ఉన్న ఆడపిల్ల పెళ్ళికి అభ్యంతరపెడుతుందా. శ్యామ్ నన్ను మన స్ఫూర్తిగా ప్రేమించాడు. నా కుటుంబ పరి స్థితులు, నేనున్నస్థితి అతడ్ని కలచివేశాయి. నా జీవితాన్ని అతడి చేతిలోకి తీసుకుని నాకు అండగా నిల్చేడు. నా కష్టసుఖాలు పంచుకున్నాడు. లోకుల దృష్టిలో మా అను బంధం పలుచన కాకముందే పెళ్ళి చేసుకొ మ్మని తొందరపెట్టాను. ఎందుకో పెళ్ళి మాటెత్తితే అతడి ముఖం కళ తప్పేది. ఇంకా ఆ క్షణం రాలేదనే వాడు. ఆ మాటతో నేను ముఖం ముడుచుకోటం చూసి "మంగళా నిన్ను అన్యాయం చేస్తా నని భయపడుతున్నావా. నా హృదయాన్ని తాకిన మొదటి ఆడపిల్లవు నువ్వే. నా చివరి ఊపిరివరకు నువ్వే తోడుగా ఉంటావు. నీ పట్ల ఉన్న మమకారం నాకు సున్నితమైన బంధమయితే బిగుసుకోని మరికొన్ని ముడులు నా జీవితానికి సంకెళ్ళ య్యాయి. వాటిని ఛేదించుకుని బయటపడ్డ మరుక్షణం నీ మెళ్లో మూడుముళ్ళు వేస్తాను" అన్న శ్యామ్ మాటల్లో నిజాయితీ నన్ను మూగదాన్ని చేసేది అతడికోసం నా సర్వస్వం అర్పించటానికి నేను వెనుదియ్య లేదు" రుద్ధ కంఠంతో చెప్పింది మంగళ.

సిద్ధార్థ ఆమె మాటలు చాలా శ్రద్ధగా వింటున్నాడు. "బిగుసుకోని మరికొన్ని ముడులు అంటే... ఏవిటో ఆ ముడులు" అతడి మస్తిష్కం తీవ్రంగా ఆలోచిస్తూనే

ఉంది. "మీరు చెప్పిందాన్ని బట్టి చూస్తే అతడి జీవితంలో మీకు కనిపించని మరో చీకటి కోణం దాగి ఉందనిపిస్తుంది"

"నేనలా అనుకోటంలేదు. అతడు నానుండి ఏమీ దాచుకోలేదనే నా నమ్మకం" స్థిరంగా అంది మంగళ.

"పోనివ్వండి. ఇంతకుమించి మీరేం చెప్పలేరని నాకర్థమయింది. మీకో ముఖ్యవిషయం చెప్పాలని వచ్చాను. శ్యామ్ లక్షరూపాయలకు పాలసీ తీసుకున్నాడు. అందులో నామినీగా మీ పేరునే ఉదహరించటంవల్ల ఆ డబ్బు క్లెయిమ్‌చేస్తే మీకే చెందుతుంది" అతడింకా మాటాడుతుండగానే మంగళ మళ్ళీ శోకమూర్తయింది.

"చూసేరా ఆయనకు నాపట్ల ఎంత అనురాగముందో. నన్నే తన సర్వస్వంగా భావించకుంటే నాకింతటి ఉన్నత స్థానాన్నెందుకిస్తారు. అయ్యో శ్యామ్ నేనెంత దురదృష్టవంతురాలిని" ఏడుస్తూ అంది.

"ప్లీజ్ కంట్రోల్ యువర్‌సెల్ఫ్. ముందే మీకో విషయం చెప్పాలి. విషయం విని మీరు నిరాశపడొద్దు"

"చెప్పండి"

"శ్యామ్‌ది సూయిసైడ్ అనే పోలీసులు కేసు క్లోజ్‌చేశారు. ఆత్మహత్య అయినప్పుడు పూర్తిగా డబ్బు పొందటంలో రిస్కుంటుంది"

"లేదు శ్యామ్‌ది ఆత్మహత్యకాదు" ఖండించింది ఆవేశంగా.

"రిలాక్స్. మీమాట నేను నమ్మినా పోలీసులు, న్యాయస్థానాలు నమ్మవు. వాటిక్కావలసినవి సాక్ష్యాధారాలు. వాటిని మనం సంపాదించి అది హత్యేనని నిరూపించగల్గితే మీకు పూర్తి న్యాయం చేకూరుతుంది" సిద్ధార్థ చెప్పాడు. ఆ మాటకు మంగళ ముఖం వివర్ణమయింది.

"అది నాకెలా సాధ్యపడుతుంది" బేలగా అంది.

"శ్యామ్ మీతో ఎప్పుడయినా తను చేసిన పనేంటో, అందులో రిస్క్ ఏమయినా ఉందేమో ఆ వివరాలెప్పుడయినా చెప్పేడేమో గుర్తు చేసుకోండి"

"నాకేమీ చెప్పలేదు. ఫొటోగ్రఫీ, బొమ్మలు వెయ్యటమే అతడి జీవనాధారమని, అంతవరకే తెలుసు" మంగళ చెప్పింది.

ఇక ఎన్నివిధాల టాపిక్ మార్చినా ఆమె నుండి అంతకుమించి సమాచారం లేదని గ్రహించాక సిద్ధార్థ వెళ్ళడానికన్నట్టు లేచి "ఇక నాకు సెలవిప్పించండి" అన్నాడు.

"అప్పుడే వెడుతున్నారా. డబ్బు ఇప్పించే విషయంలో మీరు నాకేమీ సాయం చెయ్యాలేరా? " అడిగింది మంగళ.

"తప్పకుండా చేస్తాను. మీకు సాయపడాలనేగా మిమ్మల్ని వెదుక్కుంటూ వచ్చింది. కాని మీరు తొందరపడకూడదు" అన్నాడు సిద్ధార్థ.

"నాకు తొందర్లేకపోయినా నా ఇంటి పరిస్థితులు నాకు జీవితాన్ని మిగల్చేలాలేవు. శ్యామ్‌తో పరిచయం కాకముందు టాయ్స్ సెంటర్లో సేల్స్‌గాళ్‌గా పనిచేసేదాన్ని. శ్యామ్ ఒత్తిడ చేయటంవల్ల ఆ ఉద్యోగం మానేశాను. ఇప్పుడు మళ్ళీ ఉద్యోగం వెతుక్కోవాలన్నా మానసికంగా నేను ప్రిపేర్‌గా లేను" మనసువిప్పి చెప్పింది మంగళ.

"మీ ఆవేదన అర్థంచేసుకోగలను. శ్యామ్‌ను మర్చిపోయి మీరు మళ్ళీ మామూలు మనిషికాక తప్పదు. ముందు గడపాల్సిన జీవితమెంతో ఉంది" అనునయంగా అన్నాడు సిద్ధార్థ.

"మీకు తెలియదు. నాకు ముందు జీవితమన్నది లేదు. బాహ్యా తంతు లేకపోయినా శ్యామ్ నా భర్త. చిన్న వయసునే విధి నా నుదుట కుంకుమ చెరిపి వైధవ్యాన్ని ప్రసాదించింది" గద్గదకంఠంతో చెప్పింది మంగళ.

సిద్ధార్థ మంగళ మాటలకు చలించిపోయాడు. భారత స్త్రీ వ్యక్తిత్వం ఉదాత్తమయింది.

సిద్ధార్థ ఆమె ఆవేదనను చూడలేనివాడిలా ముఖం తిప్పుకుని జేబులో ఉన్న

మూడొందలు తీసి ఆమె చేతికివ్వబోయాడు.

మంగళ వెనక్కు ఒక్కడుగేసి "సారీ ఏ పరిచయముందని మీ సహాయాన్ని స్వీకరించగలను. నా పరిస్థితులు ఈ సహాయంతో ఒక్కనాటితో తీరేవికావు. మీ సహాయాన్ని అందుకోలేని నా నిస్సహాయతను అర్థంచేసుకోండి" అంది.

"మీ కష్టం ఈ ఎమౌంటుతో తీరిపోతుందని అనను. ఓ పదిరోజులయినా ఇది మీకు ఉపకరించొచ్చు. ఇక ఏ పరిచయంతో తీసుకోవాలన్నది కదా మీ సందేహం. మీ అన్నయ్యే ఇస్తున్నాడని తీసుకోండి" మృదువుగా చెప్పి ఆమె చేతిలో ఆ డబ్బుంచి వెళ్ళిపోయాడు సిద్ధార్థ.

వెడుతున్న సిద్ధార్థను చూసి మంగళ లోలోపలే అనుకుంది... మనుషుల్లో స్వార్థం పెరిగినా మానవత్వం మాత్రం పూర్తిగా చచ్చిపోలేదని.

సిద్ధార్థ మంగళ ఇంటినుండి సందు చివరివరకూ వచ్చి రోడ్‌నానుకుని ఉన్న డ్రైనేజీని దాటబోతుండగా సరిగా అప్పుడే అక్కడకు వచ్చిన అమ్మాయి పక్కకు తప్పుకుని అతడు వెళ్ళేందుకు వీలుగా పక్కకు జరిగింది.

సిద్ధార్థ అవతలివైపుకు వెళ్ళేక పక్కకు తొలగి నిలబడ్డ ఆ అమ్మాయివైపు చూశాడు. సరిగా అప్పుడే ఆ అమ్మాయి కూడా అతడివైపు చూసింది. అరవిందంలాంటి ఆ ముఖంలో విశాలమైన ఆ సోగకళ్ళు అతడిలో నిద్రాణమైన యవ్వనాన్ని చిలిపిగా తట్టింది. ఆ పోలికలుగల అమ్మాయినెక్కడో చూసినట్టనిపించింది. అందమైన ఆ కళ్ళల్లో అంతులేని నిర్లక్ష్యం తొంగిచూసింది.

ఏ ఆడపిల్లనూ పరిశీలించి చూడని సిద్ధార్థను ఆమె సౌందర్యం కట్టివేసింది. ఆపాదమస్తకం పరిశీలించి చూశాడు. ఆమె అందం అసామాన్యంగా తోచింది.

ఆమె కళ్లల్లో కోపం తాలూకు ఎర్ర జీరలు కన్పించగానే చూపులు తిప్పుకుని రెండడుగులేశాడు.

ఆమె డ్రైనేజీని దాటి సందులోకి వెళ్ళింది.

హఠాత్తుగా సిద్ధార్థకు జయరాం మాటలు గుర్తొచ్చాయి. "రెండో అమ్మాయి సన్నగా ఉంటుంది. అందమంతా ఆ సోగకళ్లలోనే దాగి ఉందా అన్పిస్తుంది" గుర్తురాగానే వెనుతిరిగి చూశాడు సిద్ధార్థ. అప్పుడే ఆ అమ్మాయి కూడా వెనుకకు తిరిగి సిద్ధార్థవైపు చూసింది. అతడు తననే చూస్తున్నాడని గ్రహించగానే బారైన జడను ముందుకు విసురుగా లాక్కుని సందుమలుపు తిరిగింది.

★ ★ ★

"శివప్రకాష్‌గారున్నారా? "

"ఉన్నారు. మీ పేరు చెప్తే ఆయనకు చెప్పి పిల్చుకొస్తాను" ఆయా వచ్చినామెవైపు కుతూహలంగా చూస్తూ అంది.

"పేరు చెప్పకపోతే పిలవ్వా" ఆమె నవ్వుతూ అంది. ఆయా ఏమనుకుందో వెనుతిరిగి శివప్రకాష్ కోసం మేడమెట్లెక్కి వెళ్ళబోతుంటే ఆమె కూడా ఆయా వెనుకే వస్తూ "నేను వెడతాన్లే నీ పని చూసుకో" అంటూ చకచక మెట్లెక్కి వెడుతున్న ఆమెను విస్మయంగా చూస్తూ మెట్ల దగ్గరే ఆగిపోయింది ఆయా.

సీలింగ్ ఫాన్ తిరుగుతున్న గదికున్న కర్టెన్ పక్కకు తొలగించి చూసిందామె. లోపల శివప్రకాష్ టేబుల్ ముందు కూర్చుని ఏదో రాసుకుంటున్నాడు.

సమీపంలో గాజుల శబ్దం విని తలతిప్పి చూసి "వింధ్యా నువ్వా! అక్కడే ఆగిపోయావేం లోపలికిరా..." కంగారుగా లేచి ఆహ్వానించాడు.

"లోపలికి వచ్చే అర్హత నాకుందో లేదోనని గృహస్థుగారి పర్మిషన్ తీసుకోటం మంచిదని బయటే నిలబడ్డాను" అంటూ నవ్వుతూ లోపలికొచ్చింది వింధ్య.

"ఈ మొహమాటాలు, కొత్త పద్ధతులు ఎప్పట్నుండి. ఈ ఇంటి తలుపులు నీకోసం ఎప్పుడూ తెరిచే ఉంటాయి వింధ్యా" అంటూ

"ఇలా కూర్చో" కుర్చీ చూపాడు శివప్రకాష్.

ఆమె కూర్చున్నాక "ఇప్పుడే వస్తానుండు" అంటూ బయటకెళ్ళి ఐదు నిమిషాల్లో మళ్ళీ లోపలికొచ్చాడు శివప్రకాష్.

"నీకు పిల్లలెందరు? " అడిగాడు.

"ఇద్దరు... ఓ పాప, బాబు" చెప్పింది వింధ్య.

"వాళ్లెలా ఉంటారు? నీలానా, వాళ్ల నాన్నగారిలానా" అడిగాడు.

"నిజం చెప్పమంటావా? "

"ఏం అబద్ధాలు కూడా చెప్పడం అలవాటయిందా? " నవ్వుతూ అడిగాడు.

"అబద్ధాలొక్కటే కాదు శివా ఈ సమాజంలో స్టేటస్ పెంచుకోటంకోసం చాలా చాలా అలవాటు చేసుకోవాలి"

"అది నీలాంటివారికి వర్తించదు"

"ఏమిటి నా ప్రత్యేకత"

"పేరు ప్రఖ్యాతులున్న వ్యక్తికి ముద్దుల భార్యవు. సిరిసంపదలు ఒడినింపుకున్న మంచి గృహిణివి. నీ సుఖానికి, ఆనందానికి కొదవేముంది" అన్న శివప్రకాష్ మాటలకు వింధ్య పడిపడి నవ్వింది.

నవ్వినవ్వి అలసటతో కన్నీరు చిందిన కళ్లను తుడుచుకుంటూ "శివా నేను పొందే సుఖం; ఆనందం వేటిల్లో చూశావు? నేను ధరించే ఖరీదైన ఈ పట్టుచీరల్లోనా, వెలకట్టలేని ఈ నగల్లోనా, రాజహంసలాంటి మా రోల్స్ రాయిస్ కారులోనా, ఇంద్రభవనం లాంటి మా నివాసగృహంలోనా, వేటిని నేను పొందుతున్న సుఖానికి కొలమానంగా ఎంచుకున్నావు? " అడిగింది వింధ్య.

"అవేవీ నేను చూడలేదు. నీ భర్తను చూసి చెప్తున్నా. కంటికి రెప్పలా నిన్ను చూసుకుంటున్న నీ భర్త అనురాగాన్ని చూసి చెప్పాను. నువ్వు హేపీగా ఉన్నావన్న తృప్తే నాకు చాలు వింధ్యా" శివప్రకాష్ అన్నాడు.

వింధ్య మాటాడలేదు. ఇంతలోనే ఆయా రెండుకప్పుల్తో ఐసీక్రీమ్. మరో రెండు కప్పుల్తో ఫ్రూట్ సలాడ్ ట్రేలో పెట్టి తీసుకొచ్చి వింధ్య ఎదురుగా పెట్టింది.

"వాటిలో నీకేం కావాలో తీసుకో వింధ్యా. ఆ రెండు ఐటమ్స్ నీకిష్టం కాబట్టి అవే తీసుకురమ్మని చెప్పాను" అన్నాడు శివప్రకాష్.

"నా ఇష్టాలేంటో నీకింకా గుర్తున్నాయా శివా"

"మర్చిపోయేంత చిన్న విషయాలు కాదుగా. నీకు మల్లెలన్నా, జాజులన్నా చాలా ఇష్టం. పండువెన్నెల్లో ఆకాశంకేసి చూస్తూ పడుకోటమంటే ఇష్టం. చీకటి రాత్రిలో నక్షత్రాలు లెక్కపెట్టటమంటే చాలా ఇష్టం"

"ప్లీజ్ ఆపు శివా. అవేవీ నాకిప్పుడు ఇష్టం కావు. జడలో పూలు తురుముకోటమంటే అసహ్యం. వెన్నెలను చూస్తే చిరాకుగా ఉంటుంది. చీకటిని భరించలేను. ఇప్పుడు నేనిష్టపడేది ఒక్కటే"

"ఏమిటది? "

"మృత్యువును"

"వింధ్యా" తుళ్లిపడ్డాడు శివప్రకాష్.

"అవును శివా నిజంగా నాకు చచ్చిపోవాలనుంది. బతకాలని లేదు. ఇప్పటికిప్పుడు మృత్యువు నన్ను కరుణించి వెంట తీసుకెడితే నాకు చాలా ఆనందంగా ఉంటుంది. నీ సమక్షంలో మరణించటం నాకు వరమే శివా" శివప్రకాష్ భుజంమీద తలపెట్టి దుఃఖించింది వింధ్య. లాలనగా ఆమె తల నిమురుతూ మరో చేత్తో ఆమె కళ్లు తుడిచాడు.

కాసేపటికి వింధ్య దుఃఖంనుండి తేరుకుంది. కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుని కుర్చీలో కూర్చుంది. ఫ్రూట్ సలాడ్ ఉన్న కప్పు తీసుకుంది.

"వింధ్యా ఎందుకలా ఏడ్చావు. నువ్వు... సుఖంగా జీవించటంలేదు కదూ? "

"సారీ శివా చిన్నపిల్లలా బిహేవ్‌చేసి నిన్ను అనవసరంగా బాధపెట్టేను. సుఖం ఎందులో ఉందో చెప్పటం కష్టం. ఏ మనిషీ సుఖంగా జీవిస్తున్నాడని కూడా చెప్పలేం.

ఎందుకంటే అందరి ఆశయాలు, అభిరుచులు, జీవించే తీరు ఒక్కటిగా ఉండవు. తను పొందలేనిది పొందడంలోనే ఆనందముందని దానికోసం అర్రులుచాచడంలోనే మనిషి జీవితం చిత్రంగా ముగిసిపోతుంది. నేనందుకు భిన్నంకాదు. అదంతా మర్చిపో అన్నట్టు నీ జీవితం ఎలా ఉంది? పిల్లలెందరు? " అడిగింది వింధ్య.

"లేరు"

"అడగటమే మరిచాను, మీ శ్రీమతిని నాకు పరిచయం చెయ్యనేలేదు. నాకు చూపించకూడదనుకున్నావా? " నిష్టూరమాడింది.

"ఆమె నాకు చేరువలో లేదు. అందుకే పరిచయం చెయ్యలేకపోయాను"

"అంటే ఆమె నిన్ను కాదని వెళ్ళిపోయిందా? " అడిగింది.

"అదేంలేదు. నేనసలు పెళ్ళే చేసుకోలేదు"

వింధ్య చేతిలో కప్పు జారిపోయింది. "సారీ చెయ్యి వణికింది" అని చెప్పి పగిలిన ముక్కలు ఏరడానికి వంగబోతుంటే శివ వారించాడు. "అవలా ఉంచు పనిమనిషి తీస్తుందిలే. నీ చీర పాడయ్యిందేమో చూడు" అన్నాడు.

"శివా... ఒంటరిగా ఇన్నేళ్లు జీవితాన్ని నెట్టుకొచ్చావా? ఇదంతా నావల్లే కదూ" అంది ఆర్ద్రంగా.

"ఇందుకు నీ బాధ్యతేం లేదు వింధ్యా. నా మాట నమ్ము"

"నేను నమ్మను. నీ త్యాగం నన్ను వెక్కిరిస్తోంది"

"నేనెవరికోసం త్యాగం చెయ్యాలనుకోలేదు వింధ్యా. నీపట్ల పెంచుకున్న అనురాగం నా మనసును వంచిస్తే విధి నన్ను వంచించింది. మీ ఊర్నుండి బలవంతంగా గెంటెయ్యబడ్డ రెండు సంవత్సరాలకు అమ్మ బలవంతంమీద మామయ్య కూతురితో పెళ్ళి కంగీకరించాను. ముహూర్తం పదిరోజులుందనగా ఆమె డయేరియా వచ్చి పోయింది. అది రెండో ఓటమి. మరో సంవత్సరం పోయాక మళ్లీ ఇంట్లో వాళ్లు పెళ్ళి ప్రయత్నాలు చేశారు. అప్పుడు కూడా నా దురదృష్టం మరోసారి నన్ను ఓడించి వెక్కిరించింది. ఆ దెబ్బతో పెళ్ళి ప్రయత్నమే విరమించుకున్నాను" చెప్పాడు.

"మూడోసారేం జరిగింది? " అడిగింది వింధ్య.

"మా అక్క, బావ వాళ్ళ పిల్లలిద్దర్ని నా దగ్గరొదిలి ఏదో కాన్ఫరెన్సుందని ఢిల్లీ వెళ్లారు. తిరుగుప్రయాణంలో జరిగిన ఎయిర్ క్రాష్‌లో ఇద్దరూ చనిపోయారు. మేనమామను కావటంవల్ల పిల్లలిద్దరికీ నేను గార్డియన్ను కావలసొచ్చింది. వాళ్ళ మంచి చెడులు చూస్తూ వాళ్ళ ఆస్తిని కాపాడుతూ నేను ఒంటరిగానే మిగిలాను"

"అంటే ఆ పిల్లలిద్దరు నీదగ్గరే పెరుగుతున్నారన్నమాట"

"వాళ్లు పెద్దవాళ్ళయ్యారు. అమ్మాయికి నాలుగేళ్ళకిందటే పెళ్ళి కూడా చేశాను. మా మేనల్లుడి చదువు పూర్తయింది గాని ఇంకా పెళ్లిచేసుకోటానికి వాడిష్టపడ్డంలేదు. వాడి బాధ్యత కూడా తీరిపోతే నేను స్వేచ్ఛాజీవిని. ఏ బంధాలూ నన్ను చుట్టుకోనట్టే" చెప్పాడు శివప్రకాష్.

"ఇంతకాలం నేనే దురదృష్టవంతురాలిననుకున్నాను. నువ్వు కూడా నాకు వారసుడివేనన్నమాట. ఇద్దరం విధివంచితులమే" బాధగా నిట్టూర్చింది వింధ్య.

"వింధ్యా నీ మాటలెందుకో నాకు ఆందోళన కల్గిస్తున్నాయి. నీ బాధేవిటో హృదయం విప్పి చెప్పవూ" శివప్రకాష్ అడిగాడు.

"పెనుగాలి ఉధృతిలో కొట్టుకుపోతున్నాను. కార్చిచ్చు మధ్య నిలబడి మండిపోతున్నాను శివా" ఆవేదనగా అంది వింధ్య.

"నా చేయందించటానికి సిద్ధంగా ఉన్నాను. ఓ స్నేహితుడిలా ఆదుకుంటాను. ఆ కష్టాలనుండి బయటపడు"

"అది జరిగే పనికాదు శివా. నేనెంత

పెనుగులాడినా తీరందొరికేది లేదు. ఈ అనలం ఆరేదికాదు"

"ఓహ్! నీ పరిస్థితి నాకు భయాన్ని కల్గిస్తోంది"

"వద్దొద్దు... నాకోసం ఆందోళనపడకు. నాదొక్క కోరికుంది తీరుస్తావా శివా? "

"నీ మాటల్తో నన్ను చిత్రవధ చెయ్యకు. నువ్వింకేమీ చెప్పొద్దు" శివప్రకాష్ ఆపై వినలేక అన్నాడు.

"నన్ను చెప్పనీ శివా. ఇలా నిన్ను మరోసారి కలిసి మాటాడే అవకాశం నాకు రాకపోవచ్చు..." ఆమె మాటలు పూర్తి చేయక ముందే అడ్డొస్తూ "ఎందుకు రాదు మనసుంటే అనేక మార్గాలుంటాయి. కాకితో కబురు పెట్టినా నిన్నాదుకోటానికి నీ ముందు వాల్తాను" ఆవేశంగా అన్నాడు శివప్రకాష్.

"నువ్వు రాలేవు శివా. నేనున్నది ఇంద్రభవనంలో కాదు. ఇనుప పంజరంలో. నీకూ నాకూ మధ్య బేధించలేని అడ్డుగోడలున్నాయి. నాకోసం ఏమార్గంలో రావాలన్నా ఆ దారిలో ముళ్ళ తీగలుంటాయి. నిశ్శబ్దంలో కూడా భావచౌర్యం చేయగల రాక్షస నీడలు నాచుట్టూ ఉంటాయి. ఆకు కదలికలో అడుగుల చప్పుడు వినగల నిశాచరులు నన్ను వెన్నంటుతూ ఉంటారు. మౌనరాగపు తీగలు కదిలినా, అంతరంగపు తెరలు తొలిగినా, ఆవేదనపు గంటలు మోగినా అంధకారం కళ్ళు విప్పి కరాళ నృత్యం చేస్తుంది. ఆ పద ఘట్టనలో ఎన్ని పూలు రేకలు నలిగి తమ అస్థిత్వాన్ని కోల్పోతాయో చెప్పటం కష్టం. అందుకే నా కోర్కెను మన్నించు"

"వింధ్యా... నీ మాటల్తో నా తల పగిలిపోతున్నట్టుంది. నీ మాటలు నాకేమీ అర్థం కాలేదు. నిన్నిలా చూస్తుంటే నేను పాఠాలు నేర్పిన వింధ్యవేనా అని అనుమానంగా ఉంది"

"నా మాటలు నీకర్థంకావు శివా. నువ్వు నేర్పిన పాఠాలు పాఠశాలకే పరిమితం. జీవితం నేర్పిన పాఠాలు చాలా విలువైనవి. అవి చీకటి రాదారిలో వెలుగుచూపే వీధి దీపాలు. మాటల్లో చాలా సమయం గడిచిందన్న సంగతే మర్చిపోయాను. అన్నట్టు నేను నీకు చెప్పాలన్న విషయం చెప్పనే లేదు. పిల్లల గురించి వివరాలు అడిగావుగా నేను పూర్తిగా చెప్పలేదన్న సంగతి జ్ఞాపకం చెయ్యనేలేదు" అంది వింధ్య.

"సారీ నేను నిజంగా మర్చిపోయాను. ఇప్పుడు చెప్పు వాళ్ళిద్దరూ ఎలా ఉంటారు? "

"పాప నా అందాన్ని, నీ హృదయాన్ని కలబోసుకుని పుట్టింది. బాబెలా ఉంటాడో చిన్ననాటి ఫోటోలో చూడ్డం తప్ప నాకు తెలియదు. వాడిని చూసి పదేళ్ళయింది" ఆ మాట చెప్తున్నపుడు వింధ్య గొంతు వణికింది.

"పదేళ్ళా... అంటే బాబు నీదగ్గరుండడం లేదా? "

"లేదు. పిల్లలిద్దరూ నా దగ్గరలేరు. కావాలని ఒకరిని దూరం చేసుకున్నాను. కావాలనే ఒకరిని నానుండి దూరం చేశారు"

"ఎవరు? "

"నన్నంటి పెట్టుకున్న నా దురదృష్టం"

"ఓహ్! నిజంగా నువ్వో పజిల్లా ఉన్నావు. నీ మాటలేవీ నాకర్థంకావడంలేదు. నా తల తిరిగిపోతోంది. వివరంగా చెప్పు వింధ్యా" శివప్రకాష్ అడిగాడు.

"చెప్తాను. ఇప్పుడు కాదు... మరోసారి వస్తాను" మరో మాటకు అవకాశమివ్వకుండా బేగ్ తీసుకుని హడావుడిగా వెళ్ళిపోయింది వింధ్య.

వెడుతున్న వింధ్యను నిస్తేజంగా చూస్తుండిపోయాడు శివప్రకాష్.

★ ★ ★

సిద్ధార్థ వచ్చి వెళ్ళాక ఈజీ ఛెయిర్లో వాలి కళ్ళు మూసుకుంది మంగళ. చేతిలో నోట్లు నలిగిపోతున్నాయన్న స్పృహలేని మంగళను, ఆ నోట్లను మార్చిమార్చి చూస్తోందా

అమ్మాయి. మంగళ తన రాకను పట్టించుకునే స్థితిలో లేదని గ్రహించాక "మంగళా" పిల్చింది.

"నువ్వా మిన్నూ రా ఇలా వచ్చి కూర్చో" కళ్లు విప్పి ఆహ్వానించింది మంగళ.

"అతడెవరు?" అడిగింది మిన్ను

"నువ్వా అతడ్ని చూశావా?"

"చూశాను"

"అతడెవరో నాకూ తెలియదు. శ్యామ్‌కు స్నేహితుడనని చెప్పాడు"

"ఎందుకొచ్చాడో చెప్పాడా?"

"చెప్పాడు. శ్యామ్‌ది సూయిసైడ్ కాదని, మర్డర్ అని నిరూపించగల్గితే శ్యామ్ కట్టిన ఎల్.ఐ.సి పాలసీవల్ల నాకు లక్ష రూపాయలొస్తాయని చెప్పాడు"

"ఓహో ఆ మాటలు నువ్వు నిజమని నమ్ముతున్నావా?" మిన్ను హేళనగా అడిగింది.

"నమ్మినా నమ్మకపోయినా నాకొచ్చే లాభమూలేదు పోయేదీలేదు" మంగళ పొడిగా అంది.

"ఆ డబ్బు అతడే ఇచ్చాడా?" నోట్లవంక చూస్తూ అడిగింది మిన్ను.

"నేనెంతవద్దంటున్నా 'అన్నయ్యిస్తున్నాడు తీసుకోమ్మా' అంటూ తనే బలవంతంగా చేతిలో పెట్టాడు"

"అదిగో ఆ సెంటిమెంటుతోనే బ్లడీ రాస్కెల్స్ మనని బుట్టలో వేసుకోచూస్తారు. లోకంలో సొంత చెల్లెలికే అన్నలు ఓ రూపాయి మల్లెపూలకివ్వడానికి ముఖం దాటేస్తుంటే ఈ అన్నయ్య ఎక్కడ్నుండి ఊడిపడ్డాడు. నీవా మాటలు నమ్మావా మంగళా"

"అతడ్ని చూస్తే చెడుగా ఊహించాలనిపించదు. మాటల్లో ఎంతో మంచితనముంది" మంగళ అంది.

"అయ్యో నీకెలా చెప్పటం? పరిస్థితులు ఎదురు తిరిగితే మనమెంత ప్రమాదంలో చిక్కుకుంటామో నువ్వర్థంచేసుకోలేకపోతున్నావు" మిన్ను ఆందోళన చెందుతూ అంది.

"మాటల్తో భయపెట్టడం తప్ప నువ్వేదీ సరిగా చెప్పడంలేదు. ప్రమాదంలో ఇరుక్కోటానికి మనం ఎవరికి ఏ అపకారం చేశామని" మంగళ చిరాగ్గా అంది.

"నీకు తెలియదు మంగళా. నేనేదీ విడమరిచి చెప్పేస్థితిలో కూడా లేను. కానీ ఓ విషయం నీకూ తెలుసుగా"

"ఏమిటా విషయం?"

"శ్యామ్‌ను ఎవరో కావాలనే చంపేసి ఆత్మహత్యగా చూపే ప్రయత్నం చేసిన సంగతి"

"తెలుసులే. అదీ నువ్వే చెప్పావు. లేకపోతే పోలీసులు నిర్ధారించినట్టుగానే శ్యామ్ కావాలనే సూయిసైడ్ చేసుకున్నాడని అపార్థం చేసుకునేదాన్ని"

"అవును కదా. శ్యామ్ ఎంత మంచివాడో మనకు తెలుసు. కాని అతడెవరికి ఏ అపకారం చేశాడని చంపేశారంటావ్?"

"ఏమో"

"శ్యామ్ విషయంలో నాకో సందేహముంది. మనకు తెలియకుండా శ్యామ్ ఏవో చిక్కుల్లో ఇరుక్కొని వాళ్ళ చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకున్నాడేమోననిపిస్తుంది"

"కావచ్చు"

"ప్రాణాలు తీసే కసాయివాళ్ళకు అమాయకులు, ఆడవాళ్ళు అనే భేదం ఉండదు. ఇటువంటి పరిస్థితుల్లో మనం తెలివిగా వ్యవహరించకపోతే ఎలా? ఏ రిస్క్‌నయినా ఢీకొనే సత్తా మనకెక్కడిది"

మిన్ను చెప్తుంటే మంగళ మవునంగా వింది. "ఇంతకీ అతగాడేం అడిగాడో, నువ్వేం చెప్పావో. నువ్వసలే అమాయకురాలివి" మిన్ను గాభరాపడ్డం చూసి "చాల్లే, మహా ఆరిందావయినట్టు మాట్లాడుతున్నావు. పట్టుమని పదిహేడేళ్ళయినా ఉన్నాయో లేవో" కసురుకుంది మంగళ.

"పెరగాల్సింది వయసు కాదు మంగళా. బుద్ధి పెరగాలి. ఇంతకీ అతడేం చెప్పాడు" అడిగింది.

"శ్యామ్‌కెవరయినా శత్రువులున్నారా? అని అడిగాడు. అతడు చేస్తున్న పనేంటో చెప్పమన్నాడు. ముందు తనే 'ఆత్మహత్య ఎందుకు చేసుకున్నాడంటారు' అని అడిగాడు. అది ఆత్మహత్యకాదని నేనంటే' మర్డరేనంటారా" అని గుచ్చిగుచ్చి అడిగాడు.

"చూశావా ఎంత తెలివిగా నిన్ను టాకిల్ చేశాడో. ఈ ఒక్కసారితో అయిపోదు. మళ్లీ మళ్లీ నీ దగ్గరకు కుశల ప్రశ్నలు అడగడానికన్నట్టు వస్తూనే ఉంటాడు. వందో రెండు వందలో తీసుకో చెల్లెమ్మా అంటూ ఇచ్చి గుట్టుమట్టులాగడానికి ప్రయత్నిస్తాడు. ఈసారిస్తే నువ్వేమీ మాట్లాడకు. గట్టిగా ఏదన్నా అనబోతాడేమో సరైన బుద్ధి చెప్పు" మిన్ను సలహా ఇచ్చింది.

"అతడిముఖం చూస్తే మంచివాడిలానే ఉన్నాడు మిన్నూ. స్నేహపూర్వకంగా మాటాడే వారితో తగవుపడ్డం మంచిది కాదు" అంది మంగళ.

"ఖర్మ... అందర్నీ నమ్మేయటం నీకున్న బలహీనతనుకుంటాను. నువ్వతడితో గొడవ పడనక్కర్లేదుగాని అతడేం అడిగినా నాకు తెలియదని జవాబు చెప్పు. ఆఖరికి ఎప్పుడయినా వచ్చి నా గురించి వివరాలడిగినా నీకేం తెలియదని చెప్పు" హెచ్చరించింది.

"నీ గురించి కూడా అడుగుతాడంటావా? " మంగళ అనుమానంగా అంది.

"ఎందుకడగడు? ఇప్పుడు నేను రావటం చూశాడుగా. అడిగినా అడగొచ్చు"

"ఇంకేమీ చెప్పనులే"

"అన్నట్టు నువ్వు భోంచేశావా లేదా? "

"లేదు"

"నీ ముఖం చూస్తేనే తెలుస్తోందిలే. పద అన్నం కలిపి పెడతాను" మంగళ చెయ్యి పట్టి బలవంతంగా లేవదియ్యబోతుంటే "నాకాకలిగాలేదు మిన్నూ కాసేపున్నాక తింటాలే" అంది.



"అదేం కుదరదు... పద" అంటూ బలవంతంగా లోపలికి తీసుకెళ్లి ప్లేటులో అన్నం వడ్డించి కూర కలపబోతుంటే "నే తింటాలే ప్లేటిలా ఇవ్వు" మిన్నునుండి ప్లేటందుకున్నాక "మిన్నూ! ఈ పరిస్థితుల్లో నీ సహకారమే లేకుంటే ఈ మంగళ ఇలా జీవించి ఉండేదికాదు" చమర్చిన కళ్లతో అంది.

"నోర్ముయ్యి అవేం మాటలు. ఒకరికొకరం కష్టాల్లో ఆదుకోకపోతే మనిషి అన్నమాటకే అర్థంలేదు. అయినా మనకున్న ఆస్తిపాస్తులు కష్టాలు, కన్నీళ్లేగా. ఆలోచనలాపి ముందు భోజనం చెయ్యి" అంది మిన్ను.

మంగళ భోజనం చేసేవరకు అక్కడే ఉండి "నేనిక వెడతాను. చెప్పింది గుర్తుందిగా" అంది మిన్ను.

"ఉందిలే, నువ్వు జాగ్రత్తగా వెళ్లు" మంగళ గుమ్మం వరకూ వచ్చి వీడ్కోలు చెప్పింది.

మిన్ను ఏదో ఆలోచిస్తూ వెడుతున్నదల్లా వీధి చివర పార్కుచేసి ఉన్న స్కూటర్ను చూసి ఉలిక్కిపడి ఆగిపోయింది. నెంబరు ప్లేటు చూడగానే ఇందాక చూసిన అతడిదే ఈ స్కూటర్ అని అర్థమయింది.

ఒక్కక్షణం ఆగి చురుగ్గా చుట్టూ చూసింది. ఎడమవైపు వరుసలో ఉన్న పాన్ షాపు దగ్గర నిలబడి తదేకదీక్షతో పేపరులో ముఖం దాచి చదువుతున్న గ్రేకలర్ ప్యాంట్‌వాలాని ఇట్టే గుర్తుపట్టేసింది మిన్ను.

అతడినక్కడలా చూడగానే ఆమె ముఖం రక్తం లేనట్టు పాలిపోయింది. సందేహం లేదు. ఇతడు నిశ్చయంగా ఆ ముఠాకు సంబంధించిన వ్యక్తే అయ్యుంటాడు. ఎవరి కోసమో వేట సాగిస్తున్నాడు. కొంపదీసి అది నేనే కాదుగదా!" ఆ ఊహకే ఆమె ఒళ్లు జలదరించింది.

ఇక అక్కడ నిలబడలేనట్టు వేగంగా అడుగులేస్తూ కనీసం వెనుతిరిగయినా చూడకుండా వెళ్లిపోయింది మిన్ను.

ఆమె వీధి మలుపు తిరిగి వెళ్లే వరకు

గమనించి పేపరు మడిచి షాపతనికి ఇచ్చేసి మళ్లీ మంగళ ఇంటికి వెళ్లాడు సిద్ధార్థ.

మళ్లీ వచ్చిన సిద్ధార్థను చూసి కలవరపడింది మంగళ. "మళ్లీ ఎందుకొచ్చారు? " అడిగింది.

"చిన్న ఇన్ఫర్మేషన్ అడగాలని వచ్చాను"

"ఇంతకుముందే నాకు తెలిసిందంతా చెప్పానుగా. అంతకుమించి నా దగ్గరే సమాచారమూలేదు. దయచేసి వెళ్లిపొండి" అంది సీరియస్‌గా.

"ఇప్పుడడగాలనుకుంటున్నది శ్యామ్ గురించి కాదు. ఇంతకుముందు మీ ఇంటికో అమ్మాయి వచ్చి వెళ్లిందే ఆమె గురించి" సిద్ధార్థ సౌమ్యంగా అన్నాడు.

"మా ఇంటికా! మా ఇంటికే అమ్మాయీ రాలేదు" అంది మంగళ.

"సరిగా గుర్తు చేసుకు చెప్పండి. ఓ అమ్మాయి మీ ఇంటికి రావటం నేను చూశాను" పరిసరాలను చురుగ్గా పరికిస్తూ అన్నాడు.

"లేదు, మీరు పొరబడ్డారు. మా ఇంటికి ఎవరూ రాలేదు" మొండిగా అంది.

హఠాత్తుగా సిద్ధార్థ పెదవులు చిర్నవ్వుతో విచ్చుకున్నాయి. "మీరబద్ధం చెప్తున్నారని నాకు తెలుసు. నిజం చెప్పడం ఎందుకిష్టం లేదని మిమ్మల్ని ప్రశ్నించను. అది మీ పర్సనల్ మేటర్. కాని అబద్ధాలాడేవారంటే నాకు గౌరవముండదు" అన్నాడు.

"నేనబద్ధమాడానని ఎలా చెప్తున్నారు? మీ అభియోగాన్ని నేను తిరస్కరిస్తున్నాను" మంగళ ఎరుపెక్కిన ముఖంతో అంది.

"ఇది చూశాక కూడా మీరు నా మాటను తిరస్కరించగలరా!" తలుపు పక్కగా పడి ఉన్న వైలెట్ కలర్లో ఉన్న చేమంతి పువ్వును తీసి చూపుతూ అన్నాడు. మంగళ ముఖం వివర్ణమయ్యింది. మాటరానట్టు నేల చూపులు చూస్తుండిపోయింది.

"ప్లీజ్ లీవిట్! ఆ అమ్మాయెవరో ఆమె గురించి మీకు తెలిసింది చెప్పండి చాలు" మృదువుగా అన్నాడు సిద్ధార్థ.

"ఆ అమ్మాయి పేరు మిన్ను"

"మిన్నూ అంటే అది ముద్దుపేరా? "

"ఏమో నాకు తెలియదు. ఆమెను మేమలాగే పిలుస్తాం"

"ఆమెతో మీ పరిచయమెలాటిది? మీ బాల్యస్నేహితురాలా? " అడిగాడు.

"కాదు, శ్యామ్‌ద్వారా పరిచయమయింది. మాది ఆరు నెలల స్నేహమంతే. శ్యామ్ పోయిన తరువాతే మేము మరింత దగ్గరయ్యాం"

"మీరు మరోలా అనుకోకుంటే శ్యామ్‌తో ఆమెకున్న పరిచయం ఎలాంటిది? "అడిగాడు సిద్ధార్థ.

"శ్యామ్ ఆమెనో సోదరిలా భావించేవాడు. శ్యామ్ చిత్రాలకు ఆమె మోడల్‌గా పనిచేసేది. శ్యామ్ ఇచ్చే రెమ్యూనరేషన్ తోనే మిన్ను జీవితం గడిపేది. శ్యామ్ మరణంతో మా ఇరువురి పరిస్థితి ఒక్కసారే తల్లకిందులయింది" మంగళ బాధగా చెప్పింది.

"ఆమెకెవరూ లేరా? "

"లేరు... ఆమె ఒంటరిగానే ఉంటోంది"

మంగళ చెప్పిన తరువాత ఆమెనెక్కడ చూసిందీ గుర్తొచ్చింది సిద్ధార్థకు. శ్యామ్ ఇంట్లో చూసిన నాలుగు చిత్రాల్లో ప్రతిబింబించిన పోలికలు ఈమెవే. మంగళ మాటల్లో నిజమున్నట్టు గ్రహించాడు. "ఆమె ఎక్కడుంటున్నదీ అడ్రసు చెప్తారా? " అడిగాడు.

"నాకు తెలియదు. ఆమె ఇంటికెళ్లే పరిస్థితి నాకెప్పుడూ ఎదురవలేదు. అందుకే ఆ వివరాలేవీ నేనడగలేదు. వారంలో రెండు సార్లు ఆమె నన్ను చూడ్డానికి మా ఇంటికి వస్తుంటుంది" చెప్పింది మంగళ.

"ప్రస్తుతం ఏ ఆధారంలేకుండా ఆమెలా బతుకుతోంది? " అడిగాడు.

"ఉద్యోగాలు చేసేందుకయినా డిగ్రీలేం లేవు. ఏదో కొద్దిగా చదువుకుంది. అలా

అని ఆమె తెలివితక్కువదనుకోటానికి వీల్లేదు. వయసుకు చిన్నదయినా ఆ బుర్రలో బతకటానిక్కావలసిన అన్ని తెలివి తేటలూ ఉన్నాయి. వాటితోనే నెట్టుకొస్తుంద నుకుంటున్నాను" అంది మంగళ.

"సారీ మీకు చాలా శ్రమ కల్గించాను. వస్తాను..." సెలవు తీసుకుని వెళ్లిపోయాడు సిద్ధార్థ.



"ఆయా... మామయ్యా భోజనం చేశారా?" డైనింగ్ టేబుల్ ముందు కూర్చుంటూ అడిగాడు చిన్నీ.

"లేదు"

"లేదా! ఇప్పుడు టయిమెంతయిందో చూశావుగా మామయ్యనెందుకు పిలవలేదు"

"బావుంది. ఆయన భోంచెయ్యలేదన్నాను గాని నేను పిలవలేదన్నానా. అరడజను సార్లు పిలిచి పిలిచి ఊరుకున్నాను. ఆయన్ను ఇక ఈరోజుకు భోజనానికి పిల వడం నావల్లకాదు. మీకేమన్నా ఓపికుంటే ప్రయత్నించండి" అంది ఆయా.

"ఆయనెక్కడున్నారు?"

"మేడమీద ఆయన గదిలో ఉన్నారు"

"ఏంచేస్తున్నారు? ఏదయినా చదువుకుం టున్నారా?" అడిగాడు ఆరాగా.

"ఊహు! కిటికీ దగ్గర కూర్చుని గార్డెన్ లోకి చూస్తున్నారు. నాకు తెలియకడుగుతు న్నాను రోజూ చూసే పూలతోటేగా ఈరోజు అంత పరిశీలనగా, గంటల తరబడి చూడ్డా నికి అక్కడ వింతేముంది" అంది ఆయా.

"నేను బయటికెళ్లాక ఆయనెక్కడకైనా వెళ్లారా?"

"లేదు"

"పోనీ ఎవరయినా ఆయన్ని కలవడానికి వచ్చారా?"

"ఆ! జ్ఞాపకమొచ్చింది. ఈరోజు ఓ వింత జరిగింది చినబాబు"

"ఏవిటా వింత"

"మీరు బయటికి వెళ్లిన ఓ అరగంటకు ఓ పాలరాతి బొమ్మ మనింటికొచ్చింది" అంది.

"పాలరాతి బొమ్మా! వివరణలు మాని విషయం చెబుదూ" విసుక్కున్నాడు చిన్నీ.

"నేను చెప్తున్నది అసలు విషయమే బాబూ. నిజంగానే ఆవిడ ముట్టుకుంటే మాసిపోతుందా అన్నంత అందంగా పసిడి బొమ్మలాగుంది. ఆమె వస్తూనే "శివప్రకాష్ గారున్నారా?" అని అడిగింది. నేను జవాబు చెప్పేలోపల దూసుకుంటూ మేడమెట్లెక్కి అయ్యగారి గదిలోకి వెళ్లింది. ఓ గంటకు పైగా ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ మేడ మీద గదిలోనే కూర్చున్నారు. ఆమెగారు ఎంత హడావుడిగా వచ్చిందో అంత హడావు డిగానూ వెళ్లిపోయాక నేను మేడెక్కి చూద్దు నుగదా అయ్యగారసలు మనలోకంలో లేనే లేరు. ప్రాణాలన్నీ ఆ యమ్మతోనే పంపేసి నట్టు డీలాపడి కూర్చున్నారు" ఆయా తన సహజధోరణిలో చెప్పుకుపోయింది.

"ఆమె వయసెంతుంటుంది?" అడిగాడు సందేహంగా.

"లెక్కకట్టి చెప్పటం చాలాకష్టం చిన బాబూ" ఆయా పెదవి విరిచింది.

"ఎవరికయినా కష్టం కావచ్చుగాని నీకు కష్టమంటే నేను నమ్మను" చిన్నీ నవ్వుతూ

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతవ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ *ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.*

★ *సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.*

★ **ప్రతి నవలకు అందజేసే రు: *3000/–* పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదని, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

**ఫిబ్రవరి చతుర నవల 'రాక్షసనీడ'**

సమీక్షకుని పేరు : ........................................................................

చిరునామా : ........................................................................

........................................................................

........................................................................

........................................................................

అన్నాడు.

"అదే కదా నా బాధంతా. ఆమెలో ఉండే ప్రత్యేకత అదే బాబూ. ముఖాన్ని చూసి ఆమె వయసును లెక్కవెయ్యాలని ప్రయత్నించటం వృధాప్రయాస. సన్నగా, పొందిగ్గా ఆరోగ్యంగా ఉంది. నడుస్తుంటే మెరుపు తీగకు నడకొచ్చిందా అన్పిస్తుంది. ఏమైనా ఆమె ప్రౌఢేకానీ పాపకాదు"

ఆయా చెప్పే తీరుకు చిన్నీ నవ్వకుండా ఉండలేకపోయాడు. "సరే... మామయ్యను పిల్చుకొస్తాను. ఆయనొచ్చేక ఏకంగా మా ఇద్దరికీ వడ్డించెయ్యి" చెప్పి మేడమీదకు వెళ్లాడు చిన్నీ.

చిన్నీ వెళ్లేసరికి శివప్రకాష్ కుర్చీలో వెనక్కు వాలి కళ్లు మూసుకుని ఉన్నాడు.

ముడుచుకున్న భ్రుకుటిని చూస్తే ఆయనేదో తీవ్రంగా ఆలోచిస్తున్నవాడిలా కన్పించాడు. "మామయ్యా" పిల్చాడు చిన్నీ.

శివప్రకాష్ ఉలికిపడుతూ కళ్లు తెరిచాడు. "ఇంకా భోంచెయ్యలేదటగా. కిందకు రండి భోంచేద్దాం" అన్నాడు.

"పదవస్తున్నా" మరో మాటకు తావియ్యకుండా లేచాడు శివప్రకాష్.

"అక్కను రమ్మని ఫోన్ చెయ్యనా మామయ్యా" డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నాక అడిగాడు చిన్నీ.

"అక్క వచ్చి వెళ్లి రెండు నెల్లేగా అయ్యింది. అప్పుడే అక్కమీద మనసుపోతోందా" శివప్రకాష్ అడిగాడు.

"అక్కను పిలవాలనుకుంటున్నది నా గురించి కాదు మీకోసమే. అక్క, పిల్లలు ఉంటే మీకు ఒంటరితనం ఉండదు"

"నేనేం ఒంటరితనం ఫీలవటంలేదు చిన్నీ. నాకోసం అక్కను ఇబ్బందిపెట్టకు"

"మీరేం చెప్పినా వినదల్చుకోలేదు. మిమ్మల్ని చూస్తుంటే కనీసం ఓ నెల్లాళ్లయినా అక్క మీ దగ్గరుండడం అవసరం అన్పిస్తోంది" అన్నాడు చిన్నీ.

"వద్దొద్దు అలాంటి పిచ్చి పనులేవీ చెయ్యకు. ఇప్పుడు నాకేం కాలేదు. ఐయామ్ సో హేపీ" నవ్వుతూ తేల్చెయ్యబోయాడు శివప్రకాష్.

"మీరెంత ప్రయత్నించినా నానుండి మీ మనసును దాచలేరు మామయ్యా! మీ మనసు ఎంత కలవరపడుతోందో ఎంతగా కలత చెందిందో ఊహించగలను. నన్ను మభ్యపెట్టాలని చూడకండి"

"నా ఒంటరితనం దూరం కావాలంటే పిలవాల్సింది, నిక్షేపంగా కాపురం చేసుకుంటున్న అక్కను కాదు"

"మరి"

"నేను చెప్పిన అమ్మాయి మెళ్లో తాళికట్టావంటే నాకు చక్కటి కాలక్షేపం ఉన్నట్టే"

చిన్నీకి నవ్వు రాలేదు సరికదా ముఖం మరింత ముడుచుకుపోయింది.

"మీరు చూపించిన అమ్మాయి మెళ్లో తాళి కట్టాలంటే కుదిరేదికాదు. నాకు నచ్చిన అమ్మాయితోనే అంటే అప్పుడాలోచిస్తాను" అన్నాడు.

చిన్నీ మాటలకు శివప్రకాష్ కలవరపడ్డాడు. "చిన్నీ నేను సలహా ఇచ్చేంత పసి వయసు కాదు నీది. ఈ వయసులో నువ్వు వేసే అడుగు నీ జీవితాన్ని బురదలోకి నెట్టేది కాకూడదు. మనిషికి, మనసుకు తప్ప మరిదేనికీ ప్రాధాన్యత నివ్వక్కర్లేదని నువ్వు అనుకోవచ్చు నీ వయసు అలాంటిది. నా జీవితం నాకు నేర్పిన పాఠాన్ని ఉదాహరణగా తీసుకుని నువ్వు నడుచుకుంటే మంచిది" అన్నాడు.

చిన్నీ మవునంగా భోజనం ముగించి తన గదికి వెళ్లిపోయాడు. శ్యామ్ ఇంటినుండి తెచ్చిన పుస్తకం సగమే చదివిన విషయం గుర్తురాగానే షెల్ఫ్ ఆ పుస్తకం తెచ్చి పడక మీద వాలాడు. ముందురోజు చదవగా మిగిలిన పేజీలను చదవసాగాడు.

"ఆరోజు నాకు బాగా గుర్తు. జయరాం గారి మనవడి బర్త్‌డేకేదన్నా గిఫ్ట్ ప్రజంట్ చెయ్యాలన్న ఉద్దేశంతో టాయ్ సెంటర్‌కి

వెళ్ళాను. గిఫ్ట్ ఎలాంటిది కొంటే బావుంటుందో తేల్చుకోలేక సతమతమవుతుంటే అక్కడే సేల్స్‌గాళ్‌గా పనిచేస్తున్న మంగళ ఎంతో చనువుగా నాకు సహకరించింది. మనిషి పెద్ద అందగత్తె కాకపోయినా ఆ ముఖంలో మెరిసే చిర్నవ్వు ఆమెకు అలంకారంగా తోచింది. పసిపాప ముఖంలో కన్పించే నైర్మల్యం, కొంచెం అమాయకత నిండిన ఆమె ఆ తరువాత చాలాసార్లు గుర్తుకొచ్చేది. ఆమెను చూడ్డంకోసమే ఆటవస్తువులు కొనే సాకుతో రెండు మూడుసార్లు ఆ షాపుకెళ్లాను. నన్ను కూడా ఆమె మర్చిపోలేనట్టుంది. చూడగానే "హలో బావున్నారా?" అంటూ నవ్వుతూ పలకరించేది. నన్ను పలుకరించే తీరు చూస్తే కేవలం ఆమె చేస్తున్న డ్యూటీ పరిధిలోనే ఆ ఆప్యాయతను ప్రదర్శిస్తోందని అనుకోలేకపోయాను.

పోనుపోను నెలలో రెండుసార్లయినా మంగళ కోసమే ఆ షాపుకు తప్పకుండా వెళ్ళేవాడిని. "ఇదేమిటండీ బాబూ మీ సంపాదనంతా ఇలా బహుమతులు కొనివ్వటానికే సరిపోయేటట్టుందే" అనేది నవ్వుతూ. అదే... ఆ నవ్వుకోసమే... ఆ పలకరింపు కోసమే ఇంత డబ్బు వెచ్చిస్తున్నానని ఎలా చెప్పటం? చెప్తే అర్థం చేసుకునే సహృదయం ఆమె కుంటుందో లేదో? ఆ నవ్వు నా పాలిట పూలజల్లని, మంచువానని, వెన్నెలవాకని నేను చెప్పలేకపోయాను.

పనుల ఒత్తిడివల్ల, ఊళ్లో లేకపోవటంవల్ల నేను చాలారోజులు ఆమెను చూడ్డానికి వెళ్లలేకపోయాను. ఓరోజు తీరిక చేసుకుని వెళ్ళేసరికి మంగళ షాపులోనే ఉంది. నన్ను చూస్తూనే ఆమె కళ్లల్లో మెరిసిన సంతోషం, ఆ వెలుగు నన్ను చకితుడిని చేసింది. నేనాశించిన ప్రతిస్పందన ఆమెలో ద్యోతకం కావడం నాకు పూలతేరు నెక్కినంత సంబరంగా అన్పించింది.

"ఇంతకాలం ఏమయిపోయారండీ బాబూ?" అంది ఎదురొస్తూ.

దగ్గరగా వెళ్ళి చిన్నగా అన్నాను. "మీరు నా కోసం నిజంగా ఎదురుచూశారా?"

ఆ మాటకు ఆమెలో కన్పించిన తడబాటు, కలవరం చూసి నాకు చాలా హాయనిపించింది. జవాబు చెప్పలేనట్టు తలొంచుకుంది.

"రేపు ఆదివారం సెలవేగా. నా కోసం స్పేర్ చెయ్యగలరా?" ఈసారి ధైర్యంగా అడిగేశాను.

మంగళ నా కళ్లలోకి అదోలా చూసింది. "సారీ మీరు మరోలా భావించటంలేదుగదా. ఎందుకో మిమ్మల్ని చూస్తే నాకు స్నేహం చెయ్యాలన్పించింది. అందుకే... ఓ స్నేహితుడిగా నన్ను భావించలేరా!" అడిగాను.

అప్పుడు నా కళ్లల్లో ప్రస్ఫుటించిన భావాలు ఆమెను చలింపచేశాయి. "తప్పకుండా వస్తాను. ఎక్కడ కలుసుకోమంటారు" అడిగింది.

నేను చెప్పాను. ఆమెకోసం ఎదురుచూస్తానని కూడా చెప్పాను.

మంగళ స్నేహవల్లరి నా ఒంటరితనాన్ని, హృదయంలోని వెల్తిని దూరం చేసింది. ఆమె గలగలపారే సెలయేరులా కబుర్లు చెప్తుంటే నేను నిశ్శబ్దంగా కూర్చునేవాడిని.

"నువ్వేం మాటాడవేం శ్యామ్?" అంటూ భుజంమీద గిచ్చేది.

"నువ్వు మాటాడితే వినడమే నాకిష్టం" అన్న నా సమాధానానికి మూతి ముడుచుకునేది. ముడుచుకున్న పెదవులమీద ముద్దు పెట్టుకోవాలన్న కోర్కెను బలవంతంగా నిగ్రహించుకునేవాడిని.

మంగళ ఇంటి పరిస్థితులు నన్ను కలచివేశాయి. ఆమెను ఆదుకోవాలని ఉంది. కాని ఆమె ఏమనుకుంటుందోనన్న వెరపుతో ఆగిపోవలసివచ్చింది. ఆమెకోసం ఏదన్నా చెయ్యాలన్న నిర్ణయానికొచ్చాను.

ఈరోజు నాకు చాలా ఆనందంగా ఉంది. నా జీవిత పుటల్లో ఎర్రని సిరాతో రాసుకో

వాల్సిన మధురమైన రోజిది. నీరెండలో తళతళ, జలపాతాల సవ్వడి, మకరందంలో మధురిమ నా చేతికందినరోజు. నదీ, సాగర సంగమానంతరం కాస్తంత అలజడి చెలరేగినట్టే నా ఎదమీద వాలిన మంగళ కన్నీటివాన నన్ను తడిపి నాలో అలజడిని సృష్టించింది. "మనం తప్పు చేశామని బాధ పడుతున్నావా? " పశ్చాత్తాపంతో రగిలి పోతూ అడిగాను.

"లేదు... లేదు. నేను నీనుండి కావాలని కోరుకున్న అనుభూతిని నా సొంతం చేసు కున్నాను. ఈ క్షణంనుండి నువ్వు నావాడి వన్న భావన నాకీ ప్రపంచాన్ని జయించిన తృప్తినిస్తుంది" అంది.

"మరెందుకీ కన్నీరు? " అడిగాను.

"ఆనందానికి, దుఃఖానికి కూడా కన్నీరే సాక్ష్యంగా మిగుల్తుంది. మనస్ఫూర్తిగా నన్ను నీకు అర్పించుకున్నాను కాబట్టి కాలం నాకు కన్నీరు మిగిల్చినా నిన్ను తప్పు పట్టను. నీమీద విశ్వాసంకంటే నీతో కలిసి జీవించడమే నేను కోరుకుంటాను కాబట్టి ఆ వరాన్ని నాకు ప్రసాదించు" అంది మంగళ.

ఆమె మాటలు నా హృదయాన్ని తాకాయి.

"మంగళా, నేను పుట్టింది, పెరిగింది ఏకా కిగానే. మధ్యలో నువ్వు కలిశావు. నీనుండి నేను పొందే సాంత్వన, తృప్తిని దూరంచేసు కునే అవివేకిని కాను. చివరి ఊపిరి వరకు నీ తోడిదే నా జీవితం" ఆ మాటలు నా హృదయపు లోతుల్నుండి వచ్చాయి.

మంగళ మరోసారి నన్ను హత్తుకుపో యింది.

మంగళ నమ్మకాన్ని ఎప్పటికీ వమ్ము చేయకూడదని నాలో నేనే దృఢంగా అనుకు న్నాను.

ఆ తరువాత కాలం ఇట్టే కరిగిపోతున్నట్టు తోచింది. మంగళను ఉద్యోగం మాన్పించే శాను. ఆమె సంసారభారాన్ని నా భుజాల మీద వేసుకున్నాను. భౌతికమైన తాళి బంధం లాంటి ముడులు మా మధ్య పెన వేసుకోకపోయినా మంగళ నా జీవితంలో అచ్చమైన ఇల్లాలిగా ముద్రవేసుకుంది. నాపట్ల ఆమెకు శ్రద్ధెక్కువయింది. సిగరెట్లు కాల్చవద్దంటుంది. అర్ధరాత్రివరకు బయట తిరగొద్దని హెచ్చరిస్తుంటుంది. నేనామా టలు పట్టించుకోకపోటం చూసి ఉడుకుమో త్తనంతో నా ముందే కంటతడిపెట్టుకునేది.

"అబ్బో! ఏం ఆడవాళ్లు. పురుషాధిక్యత అంటారుగాని మగాళ్ల జీవితంమీద వాళ్లు చేసే పెత్తనం వివరించలేనిదనుకుంటాను. శారీరకంగా పురుషుడు బలవంతుడయినా మానసికంగా స్త్రీ శక్తిముందు చాలా బలహీ నుడనిపిస్తుంది.

పెళ్లి గురించి మంగళ తొందరపెడుతోంది. మంగళ చెప్తున్న మాటల్లో నాకూ వాస్తవము న్నట్టే తోచినా 'పెళ్లి' అన్న పదమే నన్ను ఉలి క్కిపడేలా చేస్తోంది. ముందు నా చుట్టూ పేరుకున్న చీకటినుండి బయటపడాలి. ఈ కూపంనుండి బయటపడ్డాకే జీవితానికి స్వేచ్ఛ లభిస్తుంది. బతుకుమీద తీపి పెరుగుతుంది. విముక్తి లభించేవరకు ఏ బంధంలోనూ ఇరు క్కోకూడదన్న నా నిర్ణయమే మంగళ కోర్కెను తిరస్కరించేలా చేసింది. ఇప్పటికే ఆ అమాయకురాలి జీవితం నా చేతుల్లోకి తీసుకున్నాను. అగాధపు అంచున నడుస్తున్నా నని తెలిసీ ఆమె ఆనందాన్ని, సౌభాగ్యాన్ని హరించే హక్కు నాకు లేదు. ముందీ ఊబి నుండి బయటపడాలి. అందుకోసమే ఈ పెనుగులాట. విధి నన్నోడిస్తుందో, గెలుపును ప్రసాదిస్తుందో కాలమే చెప్పాలి.

ఈరోజు నా జీవితంలో మరో మరపు రాని సంఘటన ఎదురయింది. ఎన్నడూ చూడని అద్భుత సౌందర్యాన్ని చూశాను. "అన్నయ్యా" అని నోరారా పిలిచిన ఆ పిలుపు నన్ను మరో బంధంలో కూరుకుపో యేట్టు చేసింది. వికారమైన బొమ్మలు చేసి చేసి విసుగెత్తిన విధాత రిలాక్స్‌గా కూర్చుని ఈ బొమ్మను ప్రత్యేకంగా స్కెచ్ గీశాడా

అన్పించింది. మెరుపుతీగకు రూపమే ఇస్తే ఇంతకంటే సుందరంగా ఉండదు. నా కుంచెకు ప్రాణంపోసి ఆ అందాన్ని బంధించాలనిపించింది. ఆమె... మిన్ను. భగవంతుడు నా ఒంటరిజీవితంలో పెనవేసిన మరో బంధం"

అక్కడివరకు చదివి చిన్నీ పుస్తకం మడిచి, దిండుకింద దాచాడు. బద్ధకంగా పక్కకు ఒత్తిగిల్లి కళ్లు మూసుకున్నాడు.

★ ★ ★

మిన్ను బద్ధకంగా కళ్లు తెరిచి చూసింది. జైలు గోడలకుండే కిటికీలా ఎత్తుగా ఉన్న ఆ చిన్న కిటికీలోనుండి సూర్యుడు తొంగిచూడ్డానికి నానా యాతన పడుతున్నాడు.

"విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్య భవత్ప్రభుః
భూతకృద్భూత బృద్భావో భూతాత్మా భూతభావనః"

ఎప్పుడూ ఉషోదయాన్నే అలవాటుగా విన్పించే ఆ కంఠధ్వని మస్తిష్కపు పొరల నుండి హృదయ కుహరంలో ప్రతిధ్వనిస్తోంది. ఆ సహస్ర నామావళిని మననం చేసుకుంటూ కళ్లు మూసుకుంది.

"మిన్నూ... మిన్నూ" బయట్నుండి ఎవరో పిలుస్తున్నారు.

"వచ్చాడు మహానుభావుడు" మూలుక్కుంటూ "ఆ! వస్తున్నా" అంటూ లేచి వెళ్ళి తలుపు తీసింది. ఎదురుగా గుమ్మంలో ఆనంద్ నిలబడి ఉన్నాడు.

"ఎందుకలా తలుపులు విరిగేలా తట్టి మరీ లేపావు. ఇంత ఉదయాన్నే ఏం కొంపలు మునిగాయి? " ముఖం చిట్లిస్తూ అడిగింది.

"ఎప్పుడూ నాకంటే ముందుగా లేచేదానివిగా. ఈరోజు లేవకపోతే ఏమయిందోనని భయపడ్డాను. నీకు విన్పించేలా నా గదిలో గిన్నెలు, గరిట్లు ఎంత చప్పుడు చేసినా లాభం లేకపోయిందె. అందుకే..."

'ఏడవలేకపోయావు' మనసులోనే తిట్టుకుని, "నువ్వు చేస్తున్న హడావుడంతా వింటూనే ఉన్నాలే. నాకేమీ కాలేదుగాని పోయి నీ పని చూసుకో" అంటూ జవాబు ఆశించకుండానే లోపలికెళ్ళి గోడకున్న చిన్న స్టాండులోనుండి టూత్‌పౌడరు తీసి చేతిలోకి వంపుకుని బ్రష్‌తో బయటికొచ్చింది మిన్ను.

మిన్ను అరుగు చివర నిలబడి బ్రష్ చేసుకుంటుంటే ఆనంద్ తన గదికెదురుగా స్తంభం దగ్గర నిలబడి మిన్నువైపే చూస్తున్నాడు. దంతధావనం పూర్తయ్యేసరికి మనసు వేడివేడి కాఫీకోసం కొట్టుకోవటం ప్రారంభించింది. "నందూ పాలమనిషి వచ్చిందా? " అడిగింది.

ఏయే సమయాల్లో మిన్ను అంత ముద్దుగా పిలుస్తుందో ఆనందుకు తెలిసినా ఆ ముద్దు పెదవులు తన పేరు పలుకుతుంటే తన అదృష్టానికి మురిసిపోవటం అతడికున్న బలహీనత.

"ఎప్పుడో వచ్చి వెళ్ళిపోయింది. అక్కడికీ నువ్వు లేవకపోయినా నీ కోసం పాలు పోయించుకుందామని గిన్నె పట్టుకెళ్లినా ఆ మహాతల్లి పొయ్యను పొమ్మంది"

మిన్ను మనసు చివుక్కుమంది. "ఎలా పోస్తుంది. ఇప్పటికి రెండు నెలల బాకీ తను కట్టలేకపోయింది. ఆమె తప్పులేదు. సరిపెట్టుకుంది. ఇక ఈ రోజుకు కాఫీ తాగే ప్రాప్తం కూడా లేనట్టే. ఇలా ఈ ఆకలి బతుకు ఎన్నాళ్లు" మిన్నుకు తన పరిస్థితికి తనే జాలిపడింది.

"మిన్నూ కాఫీ ఇదిగో" ఆనంద్ కాఫీ గ్లాసుతో ప్రత్యక్షమయ్యాడు. అతడి అభిమానం మిన్ను మనసును ముల్లులా గుచ్చింది. "వద్దు నందూ నేనీరోజునుండి కాఫీ తాగటం మానెయ్యాలనుకుంటున్నాను. అది నిజంగా వ్యసనంలాంటిదే అందుకే" అంది.

"చాల్లే. రోజూ భోంచెయ్యటం కూడా వ్యసనమే. అదీ మానెయ్యి" కసురుకు

న్నాడు. ఏమనుకుందో కాఫీ గ్లాసందుకుని నెమ్మదిగా సిప్ చేస్తోంది.

"మిన్నూ మన విషయం మా బామ్మతో చెప్పమన్నావా? " ఆనంద్ నెమ్మదిగా విషయం కదిపాడు.

తాగుతున్న కాఫీ కషాయంలా వెగటనిపించింది. "ఆ విషయం నా ముందెప్పుడూ మాట్లాడొద్దని నీకు చాలాసార్లు చెప్పాను. నా మీదెటువంటి ఆశలు పెట్టుకోవద్దు" అంది.

"నేనూ ఇన్నాళ్లూ అలాగనే నోర్మూసుకున్నాను. నిన్నుద్ధరిస్తాడనుకున్న ఆ శ్యామ్ అర్థాంతరంగా పోయాడు. ఇక ఇప్పుడు నీకు మాత్రం దిక్కెవరు? నీలాంటి ఆడపిల్లలు ఒంటరిగా ఉండడంకంటే నాలాంటి మగాడి రక్షణలో ఉండడం మంచిది. అందుకే నా మాట విను" ఆనంద్ బతిమాలాడు.

"మగాడు" చిన్నగా నవ్వి "నందూ నేనందమైన అమ్మాయినని ఒప్పుకుంటావుకదూ" అడిగింది.

"నేనొక్కడినే కాదు, ఈ గల్లీలో అందరూ నీ అందాన్ని మెచ్చుకుంటారు"

"అవునుగా, నా అందం ఎవరినయినా ఆకర్షిస్తుందికదూ"

"ఆకర్షించడమొక్కటేనా మగాళ్ల మతి పోగొడుతుంది. అదేగా నీ గురించి నా భయం"

"అలా మతి పోగొట్టుకున్న వెధవలెవర్తయినా మనిద్దరం కలిసి తిరుగుతున్నప్పుడు మనని చుట్టుముట్టి నన్నేదో చెయ్యాలని ప్రయత్నించారనుకో అప్పుడేం చేస్తావు? " అడిగింది.

ఆనంద్ ఒకసారి బుర్ర గోక్కున్నాడు. అతడి అవస్థకు మిన్ను చెయ్యడ్డం పెట్టుకుని నవ్వుకుంది. "వాళ్ళ దగ్గర ఆయుధాలేవీ లేకపోతే హెల్ప్ హెల్ప్ అని అరుస్తాను. నా కేకలకు నలుగురూ పోగవుతారుగా"

"అంటే వాళ్ల చేతుల్లో కత్తులుంటే పిరికివాడిలా పారిపోతావన్నమాట. అప్పుడు నా గతేమవుతుందో ఆలోచించేవా? " మిన్ను తీవ్రంగా అడిగింది.

"ఒకవేళేదన్నా జరిగినా నీకన్యాయం చెయ్యను మిన్నూ"

"ఆనంద్ ఇంకా ఏదో అనబోతుంటే మిన్ను ముఖం కోపంతో ఎరుపెక్కింది. "ఎంత దయామయుడివి. అంత శ్రమెందుకులే. నేను పెళ్లి చేసుకోవాలనుకున్నది నాకు రక్షణనివ్వగలిగేవాడినిగాని నీలాంటి పిరికివాడిని కాదు" అంది.

"నువ్వెప్పుడూ ఇంతే. పెళ్లి చేసుకోదల్చుకుంటే చేసుకుంటానని చెప్పాలి. లేదంటే లేదని చెప్పాలి. ఈ చెత్త ప్రశ్న వెయ్యటమెందుకు? " అన్నాడు ఉడుక్కుంటూ.

మిన్ను మాటాడలేదు. జడ విప్పుకుని తలకు నూనె పట్టించసాగింది.

"బాగా ఆలోచించు మిన్నూ తొందర లేదులే" చెప్పి వెళ్లబోయేవాడల్లా ఆగి "చెప్పడం మర్చిపోయాను. అన్నం నీక్కూడా వండేశాను. మొహమాట పడకుండా తిను. ఎన్నిరోజులు పస్తులుంటావు. నేను బాక్స్ పట్టుకుపోతున్నాను" చెప్పి వెళ్ళిపోయాడు.

"ఎంతో అవసరమయితేగాని ఇతడి సహాయాన్ని స్వీకరించకూడదు" మనసులోనే గట్టి నిర్ణయం తీసుకొంది.

స్నానం చేసి, బట్టలు మార్చుకుని జడ వేసుకుంటుండగా ఆనంద్ వచ్చాడు. "మిన్నూ కీస్ ఇవిగో" అంటూ ఇవ్వబోతుంటే "వద్దు. పట్టుకుపో" అంది.

"అదేం మధ్యాహ్నం భోజనం చెయ్యావా"

"ఉహూ"

"ఎందుకు చెయ్యవు? ఇప్పటికే తిండి తినక చిక్కి సగమయ్యావు. అయినా నీకోసం వండిన పదార్థాలు వేస్టవుతాయి"

"నేను వండమని చెప్పలేదుగా. రాత్రికి వంట శ్రమ తప్పినందుకు సంతోషించు" బొట్టు పెట్టుకుంటూ అంది.

"నీకు తలతిక్క ఎక్కువ. ఆడదానికంత పొగరు పనికిరాదు" అన్నాడు కసిగా.

మిన్ను మాటాడలేదు. మౌనంగా బయటి

కొచ్చి తలుపు తాళం పెట్టింది. "అప్పుడే ఊరు మీదకు బయల్దేరినట్టున్నావు" తన వెనుకే నడిచొస్తున్న మిన్నూను చూసి వ్యంగ్యంగా అన్నాడు.

"నీకెందుకా దుగ్ధ. మహా తాళికట్టిన మొగుడిలా పెత్తనం చెలాయిస్తున్నావే" అంది.

ఆనంద్ జవాబివ్వకుండా సైకిలెక్కి వెళ్ళి పోయాడు. మిన్ను నెమ్మదిగా నడుచుకుంటూ వెడుతోంది. గంటకిందట తాగిన కప్పు కాఫీ అరిగిపోయి కడుపులో గందరగోళం మొదలయింది. ఈ వారంలో పట్టుమని ఐదుపూటలు భోజనం చేసి ఉంటుంది. మొన్నంతా భోజనం లేకపోయినా నిన్న ఎదురింటి కామాక్షమ్మ పుణ్యమా అని కాస్త ఫుడ్ దొరికింది. వాళ్ళింట్లో ఫంక్షనుకు పిలిస్తే వెళ్ళి భోజనం చేసింది. ఇక ఈరోజేం చెయ్యాలో ఏవిటో. మనిషిలో ఆశకు, స్వార్థానికి, మనుగడకు, శ్రమజీవనానికి అన్నిటికీ ఈ ఆకలే కేంద్ర బిందువు.

ఆలోచిస్తూనే బస్‌స్టాప్ దగ్గరకెళ్ళి నిలబడింది. ఆమె నిలబడిన తీరు చూస్తే సిటీబస్‌కోసం వెయిట్ చేస్తున్నట్టుంది. ఎదురుగా రోడ్ దాటితే అటువైపు ఓ పెద్ద రెస్టారెంట్. రోడ్ కటూ ఇటూ విసుగ్గా చూస్తూ మధ్య మధ్య ఆ రెస్టారెంట్‌వైపే దృష్టి సారించింది మిన్ను.

ఇంతలో అక్కడ ఓ వెస్పా ఆగింది. వెస్పామీద వచ్చిన వ్యక్తి నల్లగా, కాస్త బలంగా ఉన్నాడు. ఎడమచేతికి బ్రాస్‌లెట్, వేళ్లకు ఉంగరాలు ఆ నల్లటి ఛాయమీద మిలమిలా మెరుస్తున్నాయి. స్కూటర్‌కి వెనుకభాగాన ఉన్న రేకుమీద కె.పి.రావ్ అని ఉంది. అతడ్ని చూడగానే మిన్ను బుర్రలో ఓ చిలిపి ఆలోచన తళుక్కుమంది. ఆలోచన వచ్చిందే తడవు రోడ్‌దాటి అటువైపు హడావుడిగా వెళ్ళింది.

"హలో" అన్న కోకిల స్వరం వినగానే తాళంవేసి హోటల్లోకి వెళ్లబోతున్న అతడాగి వెనక్కు తిరిగి చూశాడు. రామప్పగుడి శిల్పానికి ప్రాణం వచ్చి ఇటు వచ్చిందా అన్న సందేహంతో అతడి కళ్లు జిగేలుమన్నాయి. అందాన్ని ఏ కళ్లు ఆరాధించవు? ! ఆమె అపరిచిత అని తెలిసినా చటుక్కున ఆగి "నన్నేనా పిలిచారు" అన్నాడు.

"అవును మీరు నన్ను గుర్తుపట్టలేదనుకుంటాను. మీ ముఖం చూస్తేనే అర్థమయిందిలెండి, మీరు మతిమరుపు మహాశయులని" గోముగా అంది.

"నిజంగానే మీరెవరో, మిమ్మల్నెక్కడ చూశానో గుర్తు రావడంలేదు" అతడేవేవో జ్ఞాపకాలను మెదడునుండి వెలికితీసే ప్రయత్నం చేశాడు.

"ఇలా నాకళ్లలోకి సూటిగా చూసి ఆ మాట చెప్పండి" అతడి వైపుకు కొంచెం వంగి అంది. అందమైన ఆ కళ్లు కలల పుట్టిల్లు. ఆ కళ్లల్లో ఆకర్షణకు అతడిలో పురుషపుంగవుడు చిత్తయిపోయాడు.

"ఎక్కడో చూసినట్టనిపిస్తోందిగాని ఎక్కడో గుర్తు రావటంలేదు" నసిగాడు.

"చూసేరా నా మాటల్లో నిజముందని ఒప్పుకుంటున్నారన్నమాట. పోనీలెండి ఎక్కడో చూసినట్టయినా అంగీకరించారు. మీరెవరో నాకు తెలియదు పొమ్మంటారనుకుంటున్నాను. మీ మతిమరుపుకు మరో పరీక్ష పెడ్తున్నా గెట్ రెడీ" అంది సవాల్‌గా.

"మీలాంటి అందమైన అమ్మాయి పెట్టే పరీక్షలు కూడా అందంగానే ఉంటాయి. ఏవిటో చెప్పండి" అతడూ నవ్వుతూ అన్నాడు. అతడి చూపుల్లో ఆకలి మిన్ను ఆకలిని చంపేసింది. "వీడి ముఖం చూస్తేనే ఆమడదూరం పారిపోవాలనిపిస్తుంది. అయినా తప్పదు. ఈ శాల్తీకి పర్స్ ఖాళీ చేయించి పంపితేగాని బుద్ధిరాదు" మనసులోనే అనుకుంది.

"మిమ్మల్నెక్కడ చూశానో, మీ పేరేమిటో నేను చెప్తాను. మీరు నన్నెక్కడ చూశారో,

నా పేరేమిటో డిటైల్సు చెప్పాలి. మీరు గెలిస్తే హోటల్లో మంచి పార్టీ నేనిస్తాను. ఓడిపోతే మాత్రం మీదే" అంది. మనసులో అతగాడి ఓటమిని. తన గెలుపును ప్రార్థిస్తూ.

"నిజంగానే నేనోడిపోయాను. మీ గురించి నేనేం చెప్పలేని స్థితిలో ఉన్నాను" అన్నాడు.

"నా పేరు కీర్తన. ఓసారి మనం ట్రైన్ జర్నీలో కలుసుకున్నాం. మీ శ్రీమతి పేరు లక్ష్మినో, మీనాక్షనో చెప్పారు. ఆవిడెలా ఉన్నారు? " అడిగింది.

"లక్ష్మి. ఆవిడకేం నిక్షేపంలా ఉంది"

"పిల్లలెలా ఉన్నారు? "

"బాగానే ఉన్నారు"

"మిష్టర్ రావ్ మన పందెం ప్రకారం ఈ వివరాలు చాలా ఇంకా మీరు చేసే బిజినెస్ గురించి ఇంకా డిటైల్సు చెప్పమంటారా? " నవ్వుతూ అడిగింది.

"అక్కర్లేదు. నా పేరు కూడా చెప్పేశా రుగా. మీ జ్ఞాపకశక్తిని ఒప్పుకున్నాను. న్యాయంగా నేనోడిపోయాను కాబట్టి పదండి పార్టీ ఇస్తాను" అంటూ హోటల్లోకి దారితీశాడు. 'బతుకు జీవుడా' అనుకుంటూ అతడిననుసరించింది.

"ఏం తీసుకుంటారు? " లోపలికెళ్ళి ఓ మూలగా ఉన్న టేబుల్ ముందు కూర్చు న్నాక అడిగాడు.

"మీ ఇష్టం. కలవక కలవక కలిశాం. పార్టీ ఇవ్వబోతున్నది మీరు. మెనూ మీరే ఆర్డర్ చెయ్యాలి. మంచి ఆకలి మీదున్నాను కాబట్టి తినడం మాత్రమే నా డ్యూటీ" అంది.

బోయ్ రాగానే అతడే ఆర్డరిచ్చాడు. అత డొచ్చేలోగా ఆమెతో సంభాషణకు దిగుతూ, "ఇప్పుడు చెప్పండి. ఏం చేస్తున్నారు? ఇంకా పెళ్లెందుకు చేసుకోలేదు? " అడిగాడు రావ్.

"మీలాంటి పెళ్లయినవారి అగచాట్లు చూశాక పెళ్లి చేసుకోవాలనిపించలేదు" చిలి పిగా అంది.

అతడు నవ్వాడు. "ఇక్కడేదయినా జాబ్ చేస్తున్నారా? " మళ్ళీ అడిగాడు.

"మీరే ప్రశ్నలు వెయ్యకూడదో ఆ ప్రశ్నలు వేస్తున్నారు. ఆంధ్రదేశంలో రెండే రెండు సంపాదించటమంటే భగీరథ ప్రయత్నం. ఒకటి కట్నం లేకుండా వరుడ్ని సంపాదించటం, రెండు లంచం, రికమండే షన్లు లేకుండా ఉద్యోగం సంపాదించటం" అంది.

"నిజమే" ఒప్పుకున్నాడు.

"ప్రస్తుతం జాబ్ ట్రయల్స్‌మీదే ఈ ఊరొచ్చాను" అంది.

"ఎక్కడుంటున్నారు? "

"మా ఫ్రెండింట్లో"

"మీ కభ్యంతరం లేకుంటే సండే ఓసారి నన్ను కలవకూడదూ? "

"దేనికి? "

"నాకు మంచి ఫ్రెండ్ సర్కిలుంది. ఎవరో ఒకరితో చెప్పి మీకు తప్పకుండా హెల్ప్ చేయగలనన్న నమ్మకం ఉంది. అందుకే"

"అయితే తప్పకుండా వస్తాను. మీ ఇంటి అడ్రసివ్వండి" అంది మిన్ను.

"ఇంటి దగ్గరొద్దు. సాగరిక లాడ్జి దగ్గరకు రండి. మేమంతా అక్కడే కలుసుకుంటాం. అపార్థం చేసుకోకండి. ఆ లాడ్జి నా బెస్ట్‌ఫ్రెం డ్‌దే" మిన్ను అదోలా చూడ్డం గమనించి అన్నాడు.

"నువ్వెరోగ్‌వని నాకెప్పుడో తెలుసు" మనసులోనే అనుకుని, "అబ్బే మీలాంటి మంచి స్నేహితులను అపార్థం చేసుకోగ లనా. తప్పకుండా వస్తాను. అయితే ఏట యిములో మీరుంటారో చెప్పండి" అంది.

"సాయంత్రం ఐదు దాటాకే వస్తే బావుం టుంది"

"అలాగే"

ఇంతలో టిఫిన్ రావటంతో సంభాషణ ఆగిపోయింది.

కౌంటర్లో బిల్లు చెల్లించి బయటకు వస్తు

న్నప్పుడు చనువుగా అతడి చేతిలోనుండి పర్స్ లాక్కుని మూడు వంద నోట్లుంటే అవి తీసుకుని. "ఇవి నా దగ్గరుంచండి. ఎలాగూ నా ఉద్యోగం ఖాయమని భరోసా ఇస్తున్నారుగా. నా మొదటి జీతం రాగానే మీ అప్పు తీర్చేస్తాను" అంది.

అతడు ఖంగుతిన్నా వెంటనే సర్దుకున్నాడు. "కళ్లెదుటున్న ఈ అందాలు సొంతమవ్వాలేగాని ఎన్ని వేలిచ్చినా నష్టం కాదు" అనుకుని ఊరటచెందాడు.

బయటికొచ్చాక "మతిమరుపు మహాశయా అదివారం నన్ను రమ్మని తమరు రావటం మర్చిపోరుకదా. నాకు ఎదురు చూడ్డమంటే చిరాకు. అంత సహనం ఉండదు" అంది.

"తప్పకుండా వస్తాను. నువ్వు కూడా మాట తప్పకూడదు"

"మాది హరిశ్చంద్ర వంశమే. మాట తప్పనులెండి"

"ఎక్కడికెళ్లాలో చెబితే నిన్ను కూడా డ్రాప్ చేస్తాను" స్కూటర్ తాళంతీస్తూ అన్నాడు.

"నో థ్యాంక్స్! నాకు బజారులో చిన్నపనుంది. అది చూసుకుని బస్‌లో వెడతాను. మీరు వెళ్ళండి. బై" అంది చెయ్యూపుతూ. అతడు వెళ్ళిపోయాడు.

దూరమవుతున్న అతడ్ని చూస్తే విరగబడి నవ్వాలనిపించింది. నడిరోడ్ కాబట్టి సభ్యత అడ్డొచ్చింది. చేతిలో ఉన్న నోట్లను చూస్తుంటే ఎందుకో చెయ్యి వణికింది. "నేను తప్పు చేశానా? " ప్రశ్నించుకుంది.

"నువ్వు చేసింది తప్పే. నీ అందం ఎరగా చూపి ఈ డబ్బు సంపాదించావు" అంతరాత్మ అంది.

"నోర్ముయ్యి. ఈమధ్య నామీద నీ పెత్తనం ఎక్కువయింది. ఏది తప్పు? తప్పొప్పులెంచి అందరూ మంచిదారినే నడిస్తే ఈ లోకం తీరిలా అఘోరించేది కాదు. జరిగిన ఓ తప్పుకు నా పుట్టుక సాక్ష్యం" తననుతనే సమర్థించుకుని అక్కడ నుండి వెళ్ళబోతుండగా ఆమె వెనుకే ఓ కంఠం ఖంగుమంది.

"చాలా తెలివైనదానివే. రెండు గంటల నిరీక్షణకు ప్రతిఫలం రెస్టారెంట్‌లో మంచి టిఫిన్, మూడు వందలంటే బాప్‌రే! నీకు నిజంగా హేట్సాఫ్ చెయ్యాలి"

వ్యంగ్యంగా విన్పించిన ఆ మాటలకు చివాల్న తలతిప్పి చూసింది.

అక్కడున్న వ్యక్తిని చూడగానే ఆమె ముఖం వెలవెలపోయింది. నాలుక తడారినట్టయి మాట పెగిలి రాలేదు. అతడు... ఆరోజు మంగళ ఇంటి దగ్గరెదురయిన గ్రేకలర్ ప్యాంట్‌వాలా.

మరొకప్పుడయితే అలాంటి మొండిరకాలకు కటువుగా సమాధానం చెప్పేదేమోగాని ఇప్పుడున్న పరిస్థితి ఆమెను మూగదాన్ని చేసింది. "రెండు గంటల నిరీక్షణ అన్నాడంటే తను వచ్చినప్పట్నుండి తననే అబ్జర్వ్ చేస్తున్నట్టున్నాడు. ఓ గాడ్! అనవసరంగా ఇతడి దృష్టిలో పడ్డది. అయినా నా గురించి పట్టించుకోవాల్సిన అవసరం ఇతడికేముంది? తను అనుమానించినట్టే ఇతనూ శ్యామ్‌ను చంపిన..." ఆపై ఊహించలేకపోయింది. ఒళ్లు గగుర్పాటు చెందింది.

"పాపం! ఆ అమాయకుడు నీ ట్రాక్‌లో పడి పర్స్ ఖాళీ చేయించుకున్నాడు. ఇంతకీ ఆదివారం టైమ్ ఫిక్స్ చేసినట్టున్నాడు వెడుతున్నావా? " అతడి మాటలు చురకల్లా తగిలాయి. జరిగిందంతా చూసినట్టే చెప్తున్నాడు.

"ఆదివారం అక్కడికి వెళ్ళే బదులు నా అడ్రసిస్తాను. మా ఇంటికి రావచ్చుగా" మరో అస్త్రం సంధించేసరికి ఆమె ముఖం కోపంతో అరుణిమ దాల్చింది.

"యూ" అంటూ కోపంగా చెయ్యెత్తబోయింది. మధ్యలోనే ఆ చేతిని గట్టిగా పట్టుకుని ఆపాడు. అతడి బలమైన పిడికిట్లో

ఆమె చెయ్యి నలిగిపోయింది.

విసురుగా చెయ్యిలాక్కుని అక్కడనుండి వెళ్ళిపోయింది మిన్ను.



అప్పటికి రాత్రి తొమ్మిది గంటలయింది. వింధ్య తన గదిలో సోఫాలో కూర్చుని ఏదో పుస్తకం తిరగేస్తోంది. ఆ పని యాంత్రికమే గాని ఆమె మనసిక్కడలేదు. అమరేంద్ర గదిలోకొచ్చిన విషయమే ఆమె పరధ్యానంలో పట్టించుకోలేదు.

"ఇంకా అలాగే కూర్చున్నావేం? నిన్న నేనేం చెప్పానో మర్చిపోయావా? " అన్నాడు.

"గుర్తుంది. నా మనసేం బావోలేదు. నన్నొదిలెయ్యండి ప్లీజ్" అంది.

"మనసు నీకు బానిస కావాలిగాని దానికి నువ్వు బానిసవు కాకూడదు. నువ్వేలా చెప్తే అలా వినేలా నిన్ను నువ్వు కంట్రోల్ చేసుకోవాలి" అమరేంద్ర హితవు చెప్పాడు.

"అది మీలాంటి వారికి సాధ్యం. మందు మత్తులో బాధల్ని మర్చిపోగలరు"

"కావాలంటే నీకూ చక్కటి కంపెనీ ఇస్తాను. నువ్వూ ఆ మత్తులో అన్నీ మర్చిపోవచ్చు. నానుండి అభ్యంతరముండదని తెలుసుగా" అన్నాడు.

"చాలు... ఇప్పటికే నేను స్త్రీని అనే విషయం మర్చిపోయేట్టు చేశారు. పంచ ప్రాణాలు హరించారు. ఉన్న ఒక్క ప్రాణాన్ని లాగిపారేసి శాశ్వతంగా జీవచ్ఛవాన్ని చేయకండి. నాకు బతకాలనుంది. మీ అధికారం కింద నలిగిపోయే భార్యలా కాదు. నా రక్తం పంచుకుపుట్టిన బాబుకు తల్లిగా బతకాలనుంది" అంది వింధ్య.

అమరేంద్ర హేళనగా నవ్వేడు. "లేలే ఇప్పటికే సమయం దాటిపోయింది. ఓ అర గంటలో రెడీ అవ్వాలి" తొందరపెట్టాడు.

"మీ ధోరణేగాని నాకూ ఓ మనసుంటుందని ఆ మనసుకు కొన్ని ఇష్టాలుంటాయని మీరెందుకు గ్రహించరు" వింధ్య బాధగా అంది.

"మనసు, ఇష్టాలు అంటూ నవలల్లో డైలాగులు చెప్పకు. నా దృష్టిలో కాలం చాలా విలువైనది. కాలాన్ని క్యాష్‌రూపంలో మార్చుకోటమొక్కటే నాకు తెలిసింది. అదే నా అభిరుచి కూడా. ఈ ఒక్క రాత్రి విలువెంతో చెప్తే అదిరిపోతావు"

"ఎంత!"

"కోటి రూపాయల కాంట్రాక్టు మన పరమవుతుంది. ప్రసాదాలు పంచినా మనకు మిగిలే నైవేద్యం లక్షల్లో ఉంటుందని నీకు వేరే చెప్పక్కర్లేదనుకుంటాను"

"ఈ లక్షలన్నీ ఎవరికోసం? మనకున్న సంపద చాలదా? "

"చాలదు. లోకులు చూసేది సంఘంలో మనం పెంచుకుంటూ పోతున్న స్టేటస్‌ని, సంపదను. వాటికోసం ఈ అమరేంద్ర కాలంతోనే పరుగుపందెం పెట్టిస్తాడు"

"కాలంతో పందెం వెయ్యకండి. ఎప్పుడో ఎక్కడో అలసటతో కూలబడాల్సొస్తుంది. లేదా ఎదురురాళ్ళు గుచ్చుకుని బతుకు నడకనే కుంటిగా మార్చేస్తాయి. నా మాట వినండి. ఇప్పటికే మీ ఆటలో నేనోడిపోయాను. ఇంకా ఇంకా నన్ను శిథిల శిల్పాన్ని చెయ్యకండి" అంది ప్రాధేయపూర్వకంగా.

"వింధ్యా నేను చెప్పింది చెయ్యటమే తప్ప నాకు పాఠాలు చెప్పే ప్రయత్నం చెయ్యకు. నాతో నువ్వు రాజీపడాలిగానీ నన్ను సమాధానపరచలేవు. లే త్వరగా డ్రస్ చేసుకో" అంటూ తనే బీరువా తెరిచి చీర, బ్లౌజు, ధరించాల్సిన నగలు తీసి బయటపెట్టేడు.

మరబొమ్మలా లేచి వెళ్లింది వింధ్య. ఓ అరగంటలో తన అందాలకు తుదిమెరుగులు దిద్ది వచ్చి అమరేంద్ర ముందు నిలబడ్డది. ఆమెనోసారి ఆపాదమస్తకం పరిశీలించి చూసి తృప్తిగా తలాడించాడు. "గుడ్ పద వెడదాం" అంటూ బయటికొచ్చాడు.

వచ్చి కారులో కూర్చుందిగాని వింధ్యలో అలజడి సద్దుమణగలేదు. ఆరోజిలాగే భర్త బలవంతానికి లొంగి బలిపశువులా ఫారమ్ హౌస్‌కు వెళ్లింది.

ఆరోజేకాదు తన పదిహేనేళ్ల కాపురంలో అతడిలో ధనదాహానికి, స్టేటస్‌ను పెంచుకునే తృష్ణకు చాలాసార్లు ఆ బలిపీఠాన్నెక్కింది. ఆరోజుమాత్రం... అబ్బ... తల్చుకుంటే ఇప్పటికీ ఒళ్లు భయంతో జలదరిస్తుంది. ఆ సంఘటన తన హృదయం నుండి చెరిగిపోకముందే మళ్లీ ఇలా... వింధ్య బరువుగా నిట్టూర్చింది.

ఆమెలో చెలరేగిన ఆలోచనలు చదివినట్టే "ఏమిటాలోచిస్తున్నావు. ఆ సంఘటన నువ్వింకా మర్చిపోలేదా. నువ్వు మధనపడాల్సినంత పెద్ద విషయం కాదది. దానిగురించి బెంగపడాల్సిన అవసరంలేదు" అన్నాడు.

వింధ్య మాట్లాడలేదు. "ఆనాటి సంఘటనకు సాక్షీభూతమైన గొంతు మూగబోయింది. ఆ కళ్లు అస్థిత్వాన్ని కోల్పోయాయి. ఇక ఆ ఫిల్మ్ కూడా నాచేతికి చిక్కితే శాశ్వత సమాధయినట్టే. నేనంటే ఏమిటో తెలుసుగా..." దర్పంగా అన్నాడు.

వీళ్లు వెళ్లేసరికి అప్పటికే సోమశేఖర్ వీళ్ల కోసమే ఎదురుచూస్తున్నాడు. అప్పటికే నాలుగైదు సిగరెట్టుపీకలు యాష్‌ట్రేలో కనిపించాయి.

"సారీ ఫర్ ది లేట్. దార్లో కారు కాస్త ట్రబులిచ్చింది. మీరు బోర్ ఫీలవలేదుగదా" అన్నాడు అతడికెదురుగా కూర్చుంటూ.

"అబ్బేలేదు. ఇప్పటివరకు టి.వి. చూస్తూ కూర్చున్నాను. తోటమాలివచ్చి అతిథి మర్యాదలు కూడాచేశాడు. యజమానికితగ్గ సేవకులు" నవ్వుతూ అన్నాడు.

"మీరు మాట్లాడుతూండండి. నేనో గంటలో వస్తాను" చెప్పి బయటకెళ్లాడు అమరేంద్ర.

అమరేంద్ర వెనుకే తలుపులు మూతపడ్డాయి. తరువాత ఆ గదిలో మెత్తని పరుపుకు ప్రాణం వచ్చింది. గాలి వణికింది. వెల్తురు గుడ్డిదానిలా కళ్లు మూసుకుంది.

జంతువును మింగిన కొండచిలువ ఆకలి తీర్చుకోటానికి మంచుకొండను బలంగా చుట్టుకుంది.

★ ★ ★

"నందూ ఏం చేస్తున్నావు? " అంటూ మిన్ను ఆనంద్ గదికి వెళ్లింది.

"నువ్వా మిన్నూ, ఈరోజు నా అదృష్టం పండిందన్నమాట. ఇలా వచ్చికుర్చో" అంటూ హడావుడిగాలేచి మోడా ముందుకు జరిపాడు.

"వద్దొద్దు నువ్వేం హడావుడి చెయ్యొద్దుగాని అక్కడనుండి తప్పుకో. వంట నేను చూస్తాలే" అంటూ చనువుగా స్టౌముందు పీటవాల్చి కూర్చుంది.

మిన్ను ప్రవర్తనకు మూర్ఛవచ్చినంత పనయింది. మిన్ను తన భార్య అయినట్టు, ఇలాగే కూర్చుని వండిపెడుతున్నట్టు కలల్లో తేలిపోయాడు ఆనంద్.

"నామాట విన్పించిందా? " మిన్ను పలకరింపుతో ఊహాలోకంనుండి కిందకొచ్చాడు.

"ఏమిటో చెప్పు"

"నాకో పదిహేను కిలోల బియ్యం, కొద్దిగా కిరాణా సామాను, కూరగాయలు తెచ్చి పెట్టాలి. నువ్వొచ్చే వరకు నీ వంట

సంగతి నేను చూస్తాను. నువ్వు నాకీ సాయంచేసి పెట్టాలి" అంది.

"ఇందుకన్న మాట కాకాపడుతోంది" ఆనంద్‌కు కలచెదిరిపోటంతో కోపం ముంచుకొచ్చింది. బజారంతా చెడతిరుగుతావుగా ఆపాటి సొంత పనులు చక్కబెట్టుకోలేవూ. నాకు నువ్వేం వంట చెయ్యక్కర్లేదుగాని ఆ పనులేవో నువ్వే చేసుకోపో" అన్నాడు.

"కోపమొచ్చిందా నందూ. నేనే తెచ్చుకోవచ్చుగాని షాపు ఓనరు కామేశానికి నేను కొద్దిగా బాకీపడ్డాను. నేనే వెళ్లాననుకో ఆ డబ్బుకాస్తా బాకీ కింద చెల్లువేసుకుని నాకు మొండిచెయ్యి చూపిస్తాడు. వాడంత ఘటికుడు. అందుకే నిన్ను బతిమలాడ్డం" అంది.

"అవునూ ఉదయం పాలావిడక్కూడా డబ్బు ఇచ్చినట్టున్నావుగా"

"ఓ ఏభై బాకీకింద కట్టేను"

"అద్దెకూడా ఇచ్చినట్టున్నావు"

"నెల అద్దెలో సగమేకట్టాను"

"ఇవన్నీ చూస్తే ఆశ్చర్యంగా ఉంది. ఇంత డబ్బు నీకెలా వచ్చింది? " అడిగాడు.

"అదే సస్పెన్సు. ఓ పదిహేను రోజుల పాటు హాయిగా రోజులు నెట్టుకు రావచ్చు నువ్విచ్చే కాఫీకోసం ఎదురు చూడక్కర్లేదు" నవ్వుతూ అంది మిన్ను.

"మొన్నటికి చిల్లిగవ్వయినా చేతిలోలేదు. ఇప్పుడివన్నీ చూస్తుంటే... నిజం చెప్పు ఇవి నీకెలా వచ్చాయి" రెట్టించి అడిగాడు.

"ఎలాగో వచ్చాయి. డిటైల్సు అన్నీ నీకు చెప్పాలా. కట్టుకున్న మొగుడిలా భలే పెత్తనం చలాయిస్తున్నావే" మిన్ను నిర్లక్ష్యంగా అంది.

"నువ్వు చెప్పకపోయినా ఊహించలేనంత వెర్రి వెధవనుకాను" అన్నాడు.

"అయితే నువ్వేం ఊహించావో చెప్పు. నీ ఊహ నిజమయితే నువ్వు తెలివయిన వాడివని అంగీకరిస్తాను"

"నా తెలివితేటలకు నువ్వు కితాబివ్వక్కర్లేదు. అందమయిన ఆడపిల్ల నడిబజారులో నిలబడాలేగాని ఆ అందం విలువ వందల్లోనూ, వేలల్లోనూ ఉంటుంది" వ్యంగ్యంగా అన్నాడు. అతడి కళ్లల్లో అనుమానపు నీడలు, మాటల్లో విన్పించిన అపశ్రుతులు మిన్ను హృదయాన్ని కలవరపరిచాయి. షాక్ తిన్నట్టు చూసింది.

"నందూ! నువ్వు నా గురించి చాలా అసహ్యంగా మాట్లాడుతున్నావు" వణికే స్వరంతో అంది.

"నేను కాదు నీ పరిస్థితి ఎరిగిన వారెవరయినా అదే మాటంటారు" ఆనంద్ మాటలు పూర్తికాగానే

"చాలు అందరిలో నువ్వూ ఒకడివి కాబట్టి, అనే హక్కుందని నా గుండెను తూట్లు పొడుస్తున్నావన్న మాట. నువ్వు నా గురించి తెలుసుకున్నది చాలా తక్కువని గ్రహించు. సగటు మగాడిననిపించేవు" చెప్పి విసురుగా బయటకు వెళ్లిపోయింది మిన్ను.

"మిన్నూ ఆగు" వెనుకనుండి ఆనంద్ పిలుస్తున్నా విన్పించుకోకుండా తన గదికి వెళ్లి తలుపులు బిగించి పడకమీద వాలిపోయింది.

మిన్ను అలా వెళ్లిపోవటంతో ఆనందుకు పశ్చాత్తాపం కలిగింది. అనవసరంగా బాధపెట్టానని నొచ్చుకున్నాడు. అన్నం వంచేసి స్టౌఆర్పి మిన్ను గదివైపొచ్చేడు.

"మిన్నూ..." తలుపు తట్టేడు.

లోపల్నుండి సమాధానం రాలేదు.

"మిన్నూ, నిన్నే తలుపు తియ్యి" ఈసారి గట్టిగా పిల్చాడు.

"ప్లీజ్ వెళ్లిపో. నా గురించి నువ్వేం శ్రమపడక్కర్లేదు. వెళ్లు" లోపల్నుండి అంది.

"పిచ్చిగా ఏదో వాగేశాను. నా తప్పు క్షమించు. అదంతా మర్చిపో" బతిమాల్తూ అన్నాడు.

మిన్ను నుండి జవాబు రాకపోవటంతో లాభం లేదనుకుని ఆనంద్ అక్కడనుండి వెళ్లిపోయాడు.

లోపలున్న మిన్ను నిజంగా ఏడుస్తూనే ఉంది. "ఆ పల్లెటూళ్లో ప్రపంచంతో సంబంధం లేదన్నట్టు ఊరికి దూరంగా ఆశ్రమంలాంటి వాతావరణంలో ముద్దబంతిలా పెరిగింది. కసాయివాడిలోకూడా మంచిని వెదకగల విశాలహృదయుని శిక్షణలో పెరిగింది. చుట్టూ ఉన్న చెట్లు, పక్షులు తన నేస్తాలు. మిన్ను ఆలోచనలు గతంలోకి తొంగిచూశాయి. తను పెరిగిన ఆ పరిసరాలు, మనుషులు గుర్తొచ్చి మిన్ను దుఃఖం మరింత అధికమయింది.

★ ★ ★

"హలో హౌఆర్‌యు? "

"ఫైన్" జయరాం ఇటుదిరిగి తనను పలకరించిన యువకునివైపు పరిశీలనగా చూశాడు.

"నన్ను మీరు గుర్తుపట్టలేనట్టుంది" అతడు నవ్వుతూ అడిగాడు.

"నిజంగానే గుర్తురావడంలేదు. పెద్దవాడిని గదా జ్ఞాపకశక్తి పూర్తిగా పోయింది" జయరాం నిట్టూర్పుతూ అన్నాడు.

"నా పేరు సిద్ధార్థ. ఆ రోజు శ్యామ్ విషయంలో ఇన్ఫర్మేషన్‌కోసం మీ ఇంటికొచ్చేను" అతడు మాట్లాడుతుండగానే జయరాం ముఖం రక్తంలేనట్టు పాలిపోయింది.

"పదేపదే ఆ విషయం గుర్తు చెయ్యొద్దు. ఈ రాత్రికి కంటిమీద కునుకుండదు" అన్నాడు గాభరాగా.

"ఎందుకంత భయం? " సిద్ధార్థ నవ్వుతూ అడిగాడు.

"అలా ఎదురుగానున్న రెస్టారెంట్లో కూర్చుని మాట్లాడుకుందాం వస్తారా" జయరాం అడిగాడు.

"పదండి" సిద్ధార్థ జయరాం ననుసరించాడు. తనే రెండు కప్పుల టీకి ఆర్డరిచ్చాడు.

"ఇప్పుడు చెప్పండి, మిమ్మల్ని అంతగా భయపెడుతున్న ఆ విషయమేంటో" ఆసక్తిగా అడిగాడు సిద్ధార్థ.

"మీకు దయ్యాలు, భూతాలు వీటిమీద నమ్మకముందా? " జయరాం అడిగాడు.

"నా మాటకేం వాటి విషయంలో మీ అభిప్రాయం చెప్పండి"

"మొన్నటివరకు నాకు వాటిపట్ల నమ్మకం ఉండేదికాదు. మనిషి పొందే భ్రమలను, భయాలను మానసిక దుర్బలత్వంవల్ల ఈవిల్ స్పిరిట్‌గా చిత్రీకరించుకుని నమ్మకాన్ని పెంచుకుంటాడనే అనుకున్నాను"

"ఏసీ అంటే ఇప్పుడా నిర్ణయాన్ని సడలించుకునే పరిస్థితులేవో మీ అనుభవంలో ఎదురయ్యాయన్న మాట"

"అవును గత పది రోజులుగా ఇంట్లో ఎవరూ కంటినిండా నిద్రపోలేదంటే నమ్ముతారా"

"నమ్ముతాను. అందుకు నిదర్శనం మీరే. ఆ రోజు నేను చూసినప్పటికంటే ఒక్కసారి ఓ పదేళ్లు మీదకొచ్చినట్టుగా అయిపోయారు" సానుభూతిగా అన్నాడు.

"నిజమే కావచ్చు"

"ఎందుకింతగా డీలాపడుతున్నారు? " అడిగాడు.

"చెప్తాను. మీరొచ్చి వెళ్లిన తరువాత పది రోజులకు కాబోలు ఔట్‌హవుస్‌లో నుండి వింతవింత శబ్దాలు చప్పుళ్లు విన్పించాయి. ఆ రోజు వాటి గురించి అంతగా పట్టించుకోలేదు. ఆ తరువాత నుండి రెండు రోజులకోమారు ప్రతి అర్ధరాత్రి ఏదో శబ్దాలు విన్పిస్తూనే ఉన్నాయి. చీకటి పడుతుందంటే చాలు ఇంట్లో అందరం ప్రాణాలు అరచేత పట్టుకుని బతుకుతున్నాం. ఒక్కోసారి ఇల్లు అమ్మేసి ఎక్కడికయినా దూరంగా వెళ్లిపోవాలని కూడా అన్పిస్తోంది" జయరాం చెప్పాడు.

సిద్ధార్థ ఒక్క క్షణం దీర్ఘాలోచనలో మునిగాడు. జయరాం ఇంటి పరిసరాలు ఔట్‌హవుస్ యొక్క ఔట్‌లుక్ అతడి దృష్టిపథంలో మెదిలింది. హఠాత్తుగా కళ్లుతెరిచి "మీరిల్లు అమ్మేసి వెళ్లిపోవాల్సిన అవసరం లేదు. మీరు సహకరిస్తే ఆ దయ్యాల



రహస్యం నేను కనుక్కుంటాను" అన్నాడు జయరాంతో.

"వద్దుబాబూ వయసులో ఉన్న కుర్రాడివి. అనుభవించవలసిన సుందర జీవితమెంతో ముందుంది. అనవసరంగా సమస్యల్లో చిక్కుకోకు" అన్నాడు జయరాం.

"మీ భయాలు అర్థంలేనివి సార్. ఒక్కసారి ఆ ఔట్ హవుస్‌కి వెళ్లి పరిశీలించే అవకాశాన్నివ్వండి" సిద్ధార్థ అన్నాడు.

"అందువల్ల ఫలితముంటుందంటారా? "

"ఉండొచ్చు"

"అయితే నా అభ్యంతరమేమీలేదు. మీకు వీలున్నపుడు తప్పక రావచ్చు"

"మీకభ్యంతరం లేదంటే ఇప్పుడే వెడదాం" సిద్ధార్థ రెడీ అయ్యాడు.

"పదండి" బిల్లు చెల్లించి బయటపడ్డారు.

ఇంటికెళ్లాక కాగిడార్లోనే నిలబడ్డ సిద్ధార్థను చూసి "రండి లోపలకు" ఆహ్వానించాడు జయరాం.

"ఫరవాలేదు. మీరు వెళ్లి కీస్ పట్రండి. ఒక్కసారి ఔట్ హవుస్‌కి వెడదాం" అన్నాడు.

జయరాం లోపలికెళ్లి తాళాలు తెచ్చి సిద్ధార్థకిస్తూ "సారీ నేను రాలేను. మీరు వెళ్లండి' ' అన్నాడు.

ఆయన భయం అర్థంచేసుకున్న వాడిలా తలపంకించి సిద్ధార్థ ఒక్కడే ఔట్ హవుస్ వైపు వెళ్లాడు. తాళంతీసి లోపలకు అడుగు పెడుతూనే గది ఉన్న తీరుచూసి షాక్ తిన్నట్టు నిలబడిపోయాడు సిద్ధార్థ.

★ ★ ★

"శివా" దగ్గర్లో! వింధ్య స్వరం వింటూనే శివప్రకాష్ ఉలికిపడుతూ వెనుతిరిగి చూశాడు. పాలరాతి బొమ్మలా, భువనైక సుందరిలా గది మధ్యలో నిలబడి ఉంది వింధ్య. "ఏమిటలా కొత్తగా చూస్తున్నావు? " వింధ్య నవ్వుతూ అడిగింది.

"నిన్నే చూస్తున్నా. ఎన్నిసార్లు చూసినా నీలో అందం ద్విగుణీకృతమవుతోంది. కాలానికి ఏం చిట్కా వేశావు అందాన్ని దోచెయ్యకుండా ఉండాలని"

శివప్రకాష్ నవ్వుతూ అన్నా వింధ్య ముఖం వాడిపోయింది. "మత్తెక్కించే గుబాళింపు సొంతం చేసుకున్న మల్లికకు తన సౌరభమే తన శత్రువని తెలియదు శివా. అందుకే నిశిరాత్రి దాటకముందే నలిగి నాశనమవుతుంది. నా అందం కూడా నాకు శాపం. ఇది త్వరగా కరిగిపోవాలని కోరుకుంటున్నా ఆ భగవంతుడు నా మీద కినుక వహించాడు" ఆవేదనగా అంది.

"వింధ్యా నువ్వు కన్పించినప్పుడల్లా ఓ మిస్టరీలానే మిగిలిపోతున్నావు. నీ మాటలు నా హృదయాన్ని గుచ్చే రాతిశరాలు. నీలో వేదన మనసు విప్పి చెప్పవూ? " అన్నాడు.

"ఏమని చెప్పను శివా. వధ్యశిలమీద చివరి ఊపిరి వదలటానికి సిద్ధంగా ఉన్నానని చెప్పనా. ఊహ తెలియని వయసులో చేసిన పొరపాటు జీవితాంతం నన్ను కాల్చి మసి చేస్తుందని చెప్పనా. నా కోసం ఆక్రోశించేవారు, ఆవేదన చెందేవారు లేని అనాథనని చెప్పనా" కన్నీరు నిండిన కళ్లతో అంది వింధ్య.

"వింధ్యా నీ మాటల్తో నన్ను చిత్రహింస పెట్టకు. నీ ఆవేదనకు నేనే కారకుడనని కుమిలిపోతున్నాను. జరిగిందాంట్లో నాకూ భాగముంది. ఆ తప్పుకు శిక్ష నేనూ అనుభవిస్తూనే ఉన్నాను. అది నాతోనే అంతమవుతుందనుకున్నానుగానీ నా దురదృష్టం నిన్ను కూడా బాధిస్తుందనుకోలేదు. నీ ఆవేదన తీసెయ్యగల శక్తిని నాకు భగవంతుడు వరంగా ప్రసాదించలేదు" శివ నిట్టూర్చి అన్నాడు.

"నా గురించి వర్రీ కాకు శివా! విధి వక్రించి నాకేదన్నా జరిగితే నాకోసం ఓ కన్నీటిబొట్టు వదులు. నీ అశ్రుతర్పణమే నాకు మనశ్శాంతిని ప్రసాదిస్తుంది"

"ప్లీజ్ అలా నిర్దయగా మాట్లాడకు. అమరేంద్రతో నీ జీవితం సుఖంగా సాగకపోతే మా ఇంటికి వచ్చెయ్యి వింధ్యా! నీక్కావలసిన ఆదరణ, అభిమానం అన్నీ ఈ ఇంట్లో తప్పక లభిస్తాయి" శివ అన్నాడు.

"వద్దు శివా అటువంటి ఆలోచన నీ మనసుకు రానీకు. ఎన్నో రాక్షస పాదాల కింద నలిగిన పుష్పం భగవదారాధనకు పనికి రాదు. నా దృష్టిలో నువ్వు నాకోసం తపించే దేవుడివి ఏ చెడూ నిన్నంటకూడదు"

"ఓహ్! వింధ్యా నేనెంతటి దారుణాన్ని విని జీర్ణించుకోవలసి వచ్చింది. ఈ హాలాహలాన్ని భరించే శక్తి నాకు లేదు. ఇదంతా అబద్ధమని చెప్పు" కదిలిపోయాడు శివ.

"అదంతా కరిగిపోయిన కల అనుకుని మర్చిపో శివా. లేకపోతే మనశ్శాంతి ఉండదు"

"ఇదంతా సహిస్తూ నువ్వక్కడే ఎలా ఉండగలుగుతున్నావు? ఆ రాక్షసుడితో ఎలా సంసారం చెయ్యగల్గుతున్నావు? ఆ పరదాలను తెంచుకుని బయటపడే ప్రయత్నమెందుకు చెయ్యడంలేదు? ఇప్పటిదాకా నువ్వుంటున్నది ఇంద్రభవనమే అనుకున్నాను. కాని అది నీ పాలిట వధ్యశిలే"

"ఆ పరదాలు తెంచుకుని రాలేను శివా. సంపదకోసం నా సుగుణాన్ని, అధికారం కోసం నా స్వేచ్ఛను ఆ నీచుడు పణంగా పెట్టాడు. నేను బతుకుతున్నది ఓ మాతృమూర్తిగా, ఇల్లాలిగా మాత్రంకాదు"

"కానీ నీ బిడ్డలెవరూ నీకు దగ్గరగా లేరన్నావుగా"

"లేరు శివా! నా తల్లిదండ్రుల పరువుప్రతిష్టలు ప్రథమ ఫలాన్ని కర్కశంగా దూరం చేస్తే రెండోసారి పుట్టిన వాడిని నా భర్తే నా మీద కక్ష సాధించాలన్న ఉద్దేశంతో నానుండి దూరం చేశాడు. ఓ ప్రేమికురాలిగా, ఇల్లాలిగా, మాతృమూర్తిగా అన్ని దశల్లోనూ నేను దారుణంగా మోసపోయాను శివా. అయినా విచిత్రం చూశావా శివా నేను రేపుమీద తీపితో బతుకుతూనే ఉన్నాను. స్త్రీని మాతృత్వం కట్టివేసినంత

బలంగా మరే బంధమూ పట్టి ఉంచలేదు" వింధ్య అంది.

"వింధ్యా... ఆరోజు రాత్రి వెన్నెలే సాక్షీభూతంగా కలిసి పంచుకున్న అనుభవాల ఫలితం నీ గర్భాన రూపుదిద్దుకుందికదూ" అడిగాడు ఉత్కంఠతో.

మవునంగా తలాడించింది వింధ్య.

"నా ప్రతిరూపాన్ని తొమ్మిది నెల్లు మోసి జన్మనిచ్చేవుకదూ?"

"అవును... నెల తప్పేనని తెలిశాక ఇంట్లోవాళ్లకు చెప్పడానికి భయపడ్డాను. జరిగింది వాళ్లు గ్రహించేసరికి బాగా ఆలస్యమయ్యింది. అబార్షన్ కుదరదని డాక్టర్లు చెప్పారు. ఫలితంగా అందరూ చేసే ఛీత్కారాలమధ్య తొమ్మిది నెల్లు మోసి ఓ ప్రాణికి జన్మనిచ్చాను" వ్యధాభరితంగా అంది వింధ్య.

"పుట్టింది బాబా? పాపా" ఉద్వేగంగా అడిగాడు.

"పుట్టిందెవరో, ఆ పసిగుడ్డెలా ఉంటుందో కూడా చాలాకాలం నాకు తెలియలేదు. పుట్టిన వెంటనే బిడ్డను మాయం చేశారు. ఆ తరువాతే తెలిసింది పుట్టింది పాపని. ఆమె పెరుగుతున్నది కూడా ఓ దయార్ద్ర హృదయుని నీడలోనే అని. పాప గురించి నాకు తెలిసేసరికి నేను వివాహితను. ఒకటి రెండు సార్లు వెళ్లి పాపను చూసిరావటంతప్ప ఓ తల్లిగా నా బిడ్డయందు నా బాధ్యతను నిర్వర్తించలేకపోయాను" ఆవేదనతో చెప్పింది.

"ఇప్పుడా పాప ఎక్కడుంది?" శివ ప్రకాష్ ముఖంలో చెప్పలేని ఉద్విగ్నత.

"ఆ ఊళ్లో మాత్రంలేదు. ఆర్నెల్లకిందట ఆ కరుణామూర్తి ఈ లోకాన్ని విడిచిపోయాడు. చనిపోతూ ఏ ఆధారమూలేని ఆ అమ్మాయికి నా గురించి చెప్పి ఉంటాడు. పాప ఆమధ్య నన్ను వెదుక్కుంటూ మా ఇంటికొచ్చింది. తన జీవితానికో దారిచూపమని కన్నీటితో వేడుకుంది. కాని... నేనేసాయమూ చేయలేకపోయాను శివా" నిస్పృహయంగా చెప్పింది.

"ఓ! ఎంతపనిచేశావు. పోనీ తనెక్కడికి వెళ్లేదీ ఏమైనా చెప్పిందా?" ఏదో ఆశతో అడిగాడు.

"నేనడగలేదు, తను చెప్పలేదు"

"తిరిగి మీ ఊరు వెళ్లే అవకాశం ఉందంటావా?"

"లేకపోవచ్చు ఎందుకంటే ఆ ఊళ్లో ఆమెకెవరున్నారని"

"చాలా పొరపాటు చేశావు వింధ్యా. కనీసం నీ ఇంట్లో ఓ పనిమనిషిగానన్నా చోటిచ్చి ఆదరించలేకపోయావన్నమాట. వయసులో ఉన్నపిల్ల ఒంటరిగా ఏతోడూ లేకుండా బతికేందుకు ఆధారంలేకుండా ఈ సమాజంలో ఎలా నెగ్గుకు రాగలదనుకున్నావు. నువ్వింత స్వార్థపరురాలివవుతావనుకోలేదు" అసహనంగా అన్నాడు.

"నాది స్వార్థంకాదు శివా, భయం. కట్టిన తాళిక్కూడా విలువివ్వకుండా నా అందాన్ని వేలంవేస్తున్న ఆ కసాయివాడు టీనేజ్‌లో ఉన్న ఆడపిల్లను దయతో వదిలిపెడతాడా. అమ్మాయిది కళ్లు చెదిరే అందం. ముఖ్యంగా సౌందర్యానికి ప్రతీకలయిన ఆ కళ్లు చూస్తే నాకే దగ్గరకు తీసుకుని ముద్దు పెట్టుకోవాలనిపించింది. నాఇల్లు ఏవిధంగానూ ఆమెకు రక్షణనివ్వదు. ఆమె నాబిడ్డే అని పసిగడితే అమరేంద్ర మరీ శాడిస్టయిపోతాడు. అందుకే అమరేంద్ర వచ్చి అమ్మాయిని చూడకముందే నిర్దయగా బయటకు పంపేశాను. వెడుతూ తను నావైపు చూసిన చూపు నన్ను కలత నిదురలో కూడా కలవరపెడుతోంది శివా. నా మాతృత్వాన్నే సవాలుచేస్తూ చూసిన చూపది. వెడుతున్న అమ్మాయికి కొంత డబ్బివ్వబోయాను. ఆ నోట్లవంక చూడనైనా లేదు తలొంచుకుని వెళ్లిపోయింది. శివా నువ్వు కన్పించిన రోజునుండీ నాలో కొత్త ఆశలు చిగురించాయి. మన తొలి సమాగమానికి ప్రతీకగా అమ్మాయిని నీకు కానుకగా ఇచ్చి నీపట్ల

నాలో ఉన్న ఆరాధనకు నివేదనగా అర్పించుకోవాలనుకుంటున్నాను. నువ్వు కన్పించిన తరువాత ఈ రెండు నెలలనుండి ఏదో ఒక పనికల్పించుకుని అమ్మాయి ఎక్కడైనా కన్పిస్తుందేమోనని ప్రతిచోటా వెదుకుతూనే ఉన్నాను. ఎక్కడయినా కన్పిస్తే తీసుకొచ్చి పదిలంగా నీ దగ్గరకు చేర్చాలని నా ప్రయత్నం, ఇంతవరకూ ఫలించలేదు"

"వింధ్యా నిజంగా ఈరోజువరకు నాకు బతుకుమీద తీపిలేదు. ఆ దేవుడి ఆజ్ఞ అయ్యేవరకు జీవించాలికాబట్టి యాంత్రికంగా రోజులు నెట్టుకొస్తున్నాను. కాని... నువ్వు చెప్పిన విషయం విన్నప్పట్నుండి నాకు జీవితంమీద ఆశ పెరుగుతోంది. నా రక్తం పంచుకుపుట్టిన బంధం ఉన్నదన్నమాటే నాలో అమృతాన్ని కురిపిస్తోంది. వింధ్యా అమ్మాయి పేరేమిటో నీకు తెలుసా? "

"అమ్మాయి అసలు పేరు కీర్తన అనుకుంటాను. ముద్దుగా పిల్చుకునే పేరేదో ఉండాలి. ఆ పేరు కూడా నాకు సరిగా గుర్తులేదు. నేనెప్పుడూ పాపను చూడాలన్న ఆదుర్దాతో వెళ్లడం వల్ల నా కూతుర్ని చూసుకునే మైకంలో ఏదీ పట్టించుకోలేదు. అయినా నేను వెళ్లిందే రెండుసార్లని చెప్పానుగా" అంది వింధ్య.

"పేరు కీర్తనా! చాలాబావుంది వింధ్యా! అమ్మాయి నీకెక్కడయినా తటస్థపడితే నువ్వు తీసుకురాగలిగే పరిస్థితే లేకపోతే కనీసం నాకు వెంటనే ఇన్ఫర్మేషన్ అయినా ఇవ్వడానికి ప్రయత్నించు. ఆ అవకాశాన్ని మాత్రం చేజారనీకు. అమ్మాయి లభించేవరకు నాకు మనశ్శాంతి ఉండదు" అన్నాడు.

"అలాగే ఇక నేను వెడతాను శివా. నువ్వు నా గురించి ఆలోచించి బాధపడకు. బురదలో నివసించే జీవికి తన చుట్టూ ఉన్నది స్వర్గంలానే ఉంటుంది. నేనీ జీవితానికి ఎప్పుడో అలవాటు పడిపోయాను. ఎవరినయినా చావు ఒక్కసారే చుట్టుముడుతుంది. నీకు మనసునర్పించి అమరేంద్ర చేత తాళి కట్టించుకున్న నాడే మానసికంగా మృతురాల్ని. ఇప్పుడున్న వింధ్య అమరేంద్ర మల్చిన మంచుబొమ్మ. వస్తాను ఇప్పటికే బాగా ఆలస్యమయింది" చెప్పి హడావుడిగా వెళ్లిపోయింది వింధ్య.

శివప్రకాష్ వెడుతున్న వింధ్య వెనుకే బయటికొచ్చాడు. బాల్కనీలో ఉన్న చిన్నీని చూసి తడబడుతూ, "నువ్వొచ్చి ఎంతసేపయింది? " అడిగాడు.

"ఓ అరగంటయింది"

"ఇప్పుడు వెడుతున్న వింధ్యను నువ్వు చూశావా? "

"చూశాను"

శివప్రకాష్ సూటిగా మేనల్లుడి ముఖంలోకి చూడలేకపోయాడు. "ఆమె మీ మామయ్యా చేతిలోనుండి జారి పగిలిన శిథిలశిల్పం" ఒణికే గొంతుతో అన్నాడు శివప్రకాష్.

చిన్నీ ఆయన భుజం మీద చెయ్యేసి "ఆ నేరాన్ని మీమీదెందుకు వేసుకుంటారు. మీరిద్దరూ విధిచేతిలో వంచింపబడ్డారు అంతే" అనునయంగా అన్నాడు.

"నేనామె జీవితాన్ని ఓ దుర్బలక్షణంలో నా చేతిలోకి తీసుకోకుండా ఉంటే ఆమె జీవితం ఇంత నరకప్రాయమయ్యేదికాదు"

"జరిగిందాన్ని మననం చేసుకుంటూ ఆ మంచి చెడులను మనకు ఆపాదించుకుని బాధపడ్డం అంత మంచిది కాదు మామయ్యా! పదండి కిందకు వెడదాం. ఆయా మన కోసమే ఎదురు చూస్తోంది" అన్నాడు మేనమామను ఓదార్చుతూ.

"పద వస్తున్నా" అంటూ చిన్నీ వెనుకే కిందకొచ్చాడు శివప్రకాష్. భోజనం వడ్డిస్తూ "రంగారావుగారిందాకే ఫోన్ చేశారు" చెప్పింది ఆయా.

"నువ్వేం చెప్పావు? "

"మీ ఇద్దరి గురించి అడిగారు. ఇంట్లో లేరని బయటకెళ్లారని అబద్ధం చెప్పాను" ఆయా చెప్తుంటే ఇద్దరూ ఒకరి ముఖంలోకి

మరొకరు చూసుకున్నారు.

"ఈమధ్య నీ బ్రెయిన్ చాలా షార్ప్‌గా పంచేస్తోందే" చిన్నీ నవ్వుతూ అన్నాడు.

"మీ చురకలు ఆపండి బాబూ" మందలింపుగా అని శివప్రకాష్‌వైపు తిరిగి "చూడండి బాబూ మీరిద్దరూ ఆ విషయం అటోఇటో తేల్చుకుని ఆయనకో మాట చెప్తే మంచిది. రోజూ ఆయన ఇంటికి ఫోన్ చేయటం ఈ విషయంలో అబద్ధాలాడలేక నేను సతమతమవుతున్నాను. మీరు విషయం తేల్చకపోతే నేనే మళ్ళీ ఆయన ఫోన్ చేసినప్పుడు నా నిర్ణయం చెప్పేస్తాను" బెదిరిస్తూ చెప్పింది.

"ఏమని చెప్తావు? " శివప్రకాష్ నవ్వుతూ అన్నాడు.

"అబ్బాయికి మీ అమ్మాయిని చేసుకోటం ఇష్టమే. వెంటనే వచ్చి నిశ్చితార్థం తీసుకుని ముహూర్తాలు కూడా పెట్టించెయ్యమన్నారని చెప్తాను" అంది.

చిన్నీ ఉలికిపడ్డాడు. ఆయా వైపు కొరకొర చూస్తూ "అలా చెప్తే నీ ఉద్యోగం ఊడుతుంది జాగ్రత్త" అన్నాడు.

"మరీ మంచిది నా ఉద్యోగం ఊడగొడితే వెంటనే మీ మెడకో గుదిబండ పడుతుందని మర్చిపోకండి" ఆయా అంది.

ఆ ఇద్దరి వాదాన్ని ముచ్చటగా చూస్తున్న శివప్రకాష్ "ఇందులో నా ఆలస్యమేమీలేదు ఆయా. నేను తేల్చవలసింది కూడా లేదు. వాడిష్టపడితే నేను రెడీ, వాడి మాటకోసమే చూస్తున్నాను" అన్నాడు.

"నాదే ఆలస్యమంటున్నారు కాబట్టి రేపే రంగారావుగారితో నా అభిప్రాయం చెప్పెయ్యండి. వాళ్లమ్మాయిని చేసుకోబోడంలేదని ఆయన్ని మరో సంబంధం వెదుక్కోమని" తేల్చేశాడు చిన్నీ.

"ఇక ఆలోచించాల్సిందేమీలేదు మామయ్యా. నిన్నటివరకు మిమ్మల్ని బాధపెట్టలేక ఖచ్చితంగా చెప్పలేకపోయాను. ఇంతకుముందే నేను చేసుకున్న నిర్ణయంవల్ల ఆయన్నింకా మభ్యపెట్టడం మంచిది కాదు. రేపుదయం వాళ్ళింటికి వెళ్ళి నా నిర్ణయాన్ని చెప్పేయ్యండి" అన్నాడు.

"ఇంతకీ నువ్వింత హఠాత్తుగా తీసుకున్న నిర్ణయమేంటో చెప్పలేదు"

చిన్నీ నవ్వుతూ "మీకు తెలియనంత సీక్రెట్టేమీ లేదు. మా మామయ్యకో స్వీట్ సిక్స్టీన్ ఉందని తెలిశాక, అందునా ఆమె అందాల భరిణి అని విన్నాక మరో అమ్మాయినెలా ఇష్టపడగలను. ఆ విషయం విన్నపుడే నా మనసులో ఓ అభిప్రాయం ఏర్పడింది. పెళ్ళంటూ చేసుకోటం జరిగితే మా మామయ్య కూతురినే చేసుకోవాలని"

చిన్నీ మాటలకు శివప్రకాష్ కదిలిపోయాడు. "చిన్నీ! నీ నిర్ణయం నాకు ఆనందదాయకమేగాని ఆమోదయోగ్యం కాదయ్యా" అన్నాడు.

"ఎందుకని? "

"అమ్మాయుందని తెలిసిందేగాని ఆమె ఎక్కడుందో తెలియనప్పుడు నీ నిర్ణయం నాకు నిరాశనే మిగిల్చింది. నా స్వార్థం కోసం నిన్ను ఆపటం మంచిది కాదు. అది నాకిష్టం లేదు" అన్నాడు.

"అదా మీ బాధ. మీ మేనల్లుడి తెలివితేటలమీద మీకు నమ్మకం తగ్గినట్టుంది. ఎక్కడున్నా కీర్తనను వెదికి తెస్తాను. మీరు నిశ్చింతగా ఉండండి. ఆ భారం నా కొదిలెయ్యండి"

"నీ ఇష్టం. కాని ఓ మాట ఇప్పుడే చెప్పాలి. ఒక సంవత్సరం టయిమిస్తున్నాను. అప్పటికీ అమ్మాయిని వెదికి పట్టుకోలేకపోతే మరెవరితోనైనా నీకిష్టమైన అమ్మాయితో పెళ్లికంగీకరించాలి"

"ఇదో షరతన్నమాట"

"షరతు కాదు నీ పట్ల నాకున్న బాధ్యత నెరవేర్చాలిగా"

"అలాగే" చిన్నీ అనగానే శివప్రకాష్ బయటకు వెళ్ళిపోయాడు.

★ ★ ★

గది మధ్యలో నిలబడి చుట్టూ పరికించి

చూశాడు సిద్ధార్థ. మంచంమీదుండాల్సిన దిండ్లు, దుప్పటి చుట్టబెట్టి కుర్చీలో పడి ఉండడం, కప్‌బోర్డ్‌లో కింద అరలో ఉండాల్సిన పాత పేపర్ల కట్ట విడిపోయి చిందర వందరగా నేలమీద పోగుపెట్టినట్టున్నాయి. ఆ రోజు అందంగా పేర్చినట్టున్న షీల్డులు ఓ మూలకు జరిపినట్టున్నాయి. గోడలకుండాల్సిన నాలుగు చిత్రాలు నేలమీద పడి వాటిమీద పేరుకుపోయిన దుమ్ము, ధూళితో జాలిగా చూస్తున్నాయి.

పెయింటింగ్స్ మీదున్న ధూళి విదిల్చి గోడలకు తగిలించాడు. షీల్డులన్నీ ఓ వరుసక్రమంలో నీట్‌గా పేర్చాడు. పేపర్లు తీస్తుండగా వాటికింద సిగరెట్ బూడిద కన్పించింది. గది మూలగా కొన్ని సిగరెట్ పీకలు, ఖాళీ అగ్గిపెట్టె, వెలిగించిన పుల్లలు అతడి దృష్టిని దాటిపోలేదు.

ఓ వేస్ట్ పేపరు కింద పరిచి మరో పేపరు సాయంతో వాటిని కలెక్ట్ చేసి పొట్లంకట్టి జేబులో వేసుకున్నాడు.

చురుకైన అతడి కళ్లు మరోసారి గదినంతటినీ పరికించి చూసినా అనుమానాస్పదమైన వస్తువేదీ కన్పించలేదు.

గదిగుమ్మం దగ్గరకొచ్చి మరోసారి వెనక్కుతిరిగి చూసి సంతృప్తిగా తలాడించి బయటికొచ్చి తలుపు తాళం పెట్టి జయరాం ఇంటివైపు అడుగులేశాడు.

"మీకేమన్నా కన్పించాయా" సిద్ధార్థ సజీవంగా తిరిగొచ్చినందుకు ఓ పక్క సంతోషిస్తూ ఉత్కంఠగా అడిగాడు జయరాం.

"కన్పించడానికి అక్కడేమన్నా ఉంటేగా"

"అవున్లెండి దయ్యాలు మనుషుల్ని భయపెడతాయిగాని కంటికి కన్పించవు. అందునా పగటిపూట అసలు కన్పించవు" అన్నాడు.

"నిజం చెప్పాలంటే మీ భయాలు అర్థంలేనివి" సిద్ధార్థ మాట పూర్తికాకముందే జయరాం ఎరుపెక్కిన ముఖంతో "అయితే తరచు ఆ గదిలోనుండి వస్తున్న శబ్దాల మాటేమిటి. పెద్దతనంవల్ల నా చెవులు సరిగా పనిచేయలేదని మీరు సరిపెట్టొచ్చు కాని కుర్చీలు అటుఇటు జరపటం, ఏవో కాగితాలు తిరగేస్తున్న చప్పుళ్లు మా ఇంట్లో వాళ్లం స్పష్టంగా విన్నాం. దానికేమంటారు? " తీవ్రస్వరంతో అడిగాడు.

"నా మాటలు పూర్తిగా వినకుండానే మీరావేశపడుతున్నారు. అక్కడ దయ్యాలు లేవన్నానుగాని ఆ గదిలో ఏదీ జరగలేదని నేననలేదుగా"

"అంటే... మీరు చెప్పేదేవిటి? " ఆ కళ్ళల్లో భయం తొంగిచూసింది.

"అది మనుషులుచేస్తున్న పనే. దయ్యాలు పనిబట్టి సిగరెట్స్ కాల్చుతూ అక్కడ గడిపే అవకాశముందంటారా? "

"లేదు"

"ఆ గదిలో కాల్చిన సిగరెట్ పీకలు, వెలిగించిన అగ్గిపుల్లలు, యాష్ కన్పించాయి. ఎవరో దేనికోసమో ఆ గదిని వెదికే ప్రయత్నంలోనే అర్ధరాత్రి ఆ గదిలో ప్రవేశిస్తున్నారన్నది నిజం. వాళ్ళవల్ల వస్తున్నవే ఆ వింత ధ్వనులు.

"మీరు చెప్తున్నది వింటుంటే నాకు నమ్మకం కలగడంలేదు. అక్కడి గదిలో వెదికేందుకేముంటుంది. అతడు సాదాసీదాగా జీవితం గడిపిన ఓ సామాన్యుడు"

"మిమ్మల్ని నమ్మించాలని నేను ప్రయత్నించను. విషయాన్ని తార్కిక దృష్టితో విశ్లేషించి చెప్పటమే నా ఉద్దేశ్యం. ఒక సందేహముంది. శ్యామ్ ఓ ఫొటోగ్రాఫరు అన్నారు గదా. మరి అతడుపయోగించే కెమేరా ఏమయ్యింది? అతడి గదిలో అన్ని వస్తువులూ ఉన్నా కెమెరా నాకు కన్పించనేలేదు"

"అతడి దగ్గర ఒకటి కాదు, రెండు కెమెరాలుండాలి. మీరు సందేహించినట్టు అతడి గదిలో కెమెరా అన్నదే లేదంటే కొంచెం ఆలోచించాల్సిందే" జయరాం సాలోచనగా అన్నాడు.

"అందుకే అతడి మరణం గురించి కూడా

నాలో అనేక సందేహాలున్నాయి. అతడు కావాలని ఆత్మహత్య చేసుకోలేదు. అతడి గురించి నేను సేకరించిన సమాచారాన్నిబట్టి అతడికా అవసరమే లేదని తెలిసింది. ఎవరో అతడిని గొంతు నులిమి చంపి దాన్ని ఆత్మహత్యగా సృష్టించారు. అయితే వాళ్లెందుకు అతడ్ని హత్యచేశారన్నది అర్థంకాని మిష్టరీ. వాళ్ళ ఉద్దేశ్యం ఏదయినా అతడి చావుతో వాళ్ళ కోర్కె సిద్ధించలేదు. అన్వేషణ ముగిసిందిలేదు. దానిలో భాగంగా అతడి గదిలో ప్రవేశించి తమ ప్రయత్నాలు కొనసాగిస్తున్నారు"

"మైగాడ్! అదే నిజమయితే మా ప్రాణాలకేదన్నా ప్రమాదం ముంచుకొస్తుందంటారా" భయంతో ముఖంనిండా చెమట్లు పట్టాయి జయరాంకు.

"మీకాభయం అక్కర్లేదు. నేను చెప్పింది జరిగిందానికి, జరుగుతున్నదానికి ముడిపెట్టి ఊహించినదిగానీ అలాగే జరుగుతుందని నిర్ధారణగా చెప్పడంలేదు. మీరా శబ్దాలను పట్టించుకోవద్దు. నేనిప్పుడు చెప్పిన విషయాలు కూడా గోప్యంగా ఉంచడం కూడా మీ భద్రతకు మంచిది. ఆఖరుకు మీఇంట్లో వారికూడా ఈ విషయాలు చెప్పొద్దు. మీకేప్రమాదము లేదు, రాదు" అన్నాడు.

"అలాగే... పాపం శ్యామ్‌ను తల్చుకుంటే చాలా బాధగా ఉంది. ఇప్పటివరకు అతడు ఆత్మహత్య చేసుకున్న పిరికివాడనుకున్నాను. ఎవరో హత్యచేశారని వింటుంటే తట్టుకోలేకపోతున్నాను. ఆ హంతకుడెవరైనా సరే వదలొద్దు. వాడిని న్యాయస్థానానికి అప్పగించి శిక్షపడేలా చెయ్యండి. ఈ విషయంలో నా అవసరమేదన్నా ఉందంటే తప్పకుండా సహకరిస్తాను" అన్నాడు జయరాం.

"థ్యాంక్స్... దోషులను పట్టుకోవాలన్నదే నా ధ్యేయం. మీ అవసరం ఉంటే తప్పకుండా వస్తాను. ఇప్పుడైనా దయ్యాలు, భూతాలు వీటిమీద మీకున్న అనుమానాలు తొలగినట్టేనా" నవ్వుతూ అడుగుతుంటే జయరాం కొంచెం సిగ్గుపడుతూ "మీదయ వల్ల తొలగినట్టే" అన్నాడు.

"ఇక నేను వస్తాను. దేనికీ భయపడకుండా ధైర్యంగా ఉండండి" అని చెప్పి సిద్ధార్థ వచ్చేస్తుంటే జయరాం గేటువరకు వచ్చి సాగనంపాడు.



"హలో శ్రావణ్"

"ఓ! నువ్వా సిద్ధూ రారా... ప్లీజ్ బీసీటెడ్" అంటూ కుర్చీ చూపాడు శ్రావణ్.

"థ్యాంక్యూ" చెప్పి కూర్చున్నాక "చాలా బిజీగా ఉన్నట్టున్నావే" అన్నాడు సిద్ధార్థ.

"ఎప్పుడూ ఉన్నదేగా. అన్నట్టు నీ ఇన్వెస్టిగేషన్ ఎంతవరకు వచ్చింది? ఎనీ గుడ్ రిజల్ట్? "

పెదవి విరిచాడు సిద్ధార్థ. "ఇప్పటివరకు చిన్న క్లూ అయినా దొరకలేదు. మేఘశ్యామ్ విషయంలో నీ అనుమానం కరెక్టే. ఆత్మహత్య కాదు. అతడ్నెవరో చాలా ప్లాన్డ్‌గా మర్డర్ చేశారు"

"చిన్న క్లూ అయినా దొరకనప్పుడు అది మర్డరని ఎలా ఊహిస్తున్నావు? " అడిగాడు ఎస్.ఐ. శ్రావణ్.

"నువ్వు శ్యామ్ మరణం గురించి రిపోర్టు

పంపుతూ మా డిపార్ట్‌మెంట్‌కి ఇన్వెస్టిగే షన్ బాధ్యత అప్పగించినప్పుడు ఆ డ్యూటీ నాకప్పగించటంతో మొదటిసారి వెళ్లి ఆ ఇంటి ఓనరు జయరాంని కలిశాను. ఆయన నిన్న కన్పించి శ్యామ్ మరణించిన ఔట్ హౌస్‌లో రాత్రిళ్లు దయ్యాలు తిరుగుతున్నా యన్న భయాన్ని వ్యక్తీకరించాడు. నాకు అనుమానమొచ్చి ఆయన వెంట వెళ్ళి చూశాను. ఔట్‌హౌస్‌లో శ్యామ్‌కు సంబం ధించిన సామానంతా చిందర వందరగా పడి ఉన్నాయి. అక్కడే ఈ సిగరెట్ పీకలు, అగ్గిపెట్టె, పుల్లలు కన్పించాయి. వీటిని లాబ్‌కు పంపించు, ఏమన్నా ఆధా రాలు దొరికినా దొరకొచ్చు" అంటూ జేబులో ఉన్న ప్యాకెట్ తీసి శ్రావణ్ ముందున్న టేబుల్‌మీద పెట్టాడు సిద్ధార్థ.

"అంటే శ్యామ్ మరణానంతరం కూడా ఎవరో అతనింటికి రాకపోకలు సాగిస్తూ రహస్యంగా సెర్చ్ చేస్తున్నారంటే శ్యామ్‌ది మర్డరేగాని సూయిసైడు కాదన్నది నీ అభి ప్రాయం అంతేగా" శ్రావణ్ అన్నాడు.

"ఖచ్చితంగా"

"కాని వాళ్ళు వెతుకుతున్నదేమిటి? ఆ ఆగంతకులెవరు? " సాలోచనగా అన్నాడు. సిద్ధార్థ జవాబు చెప్పలేదు. "అన్నట్టు శ్యామ్ గదిలో అతని పర్సనల్ డైరీ దొరికిందన్నా వుగా. అదేవిధంగానూ ఈ కేసుకు ఉపయో గపడలేదా? " శ్రావణ్ అడిగాడు.

"లేదు... అది డైరీ అనేకంటే ఆత్మకథ అంటే బావుంటుంది. తనకు సంబంధించిన కథను, ఘట్టాలను వర్ణించి మరీ అందులో రాసుకున్నాడు. నేను చదివినంతవరకు అందులో నాకే ఆధారాలు లభ్యంకాలేదు. కాని... ఓచోట... 'మిష్టర్ ఆర్‌తో పరి చయం నా జీవితాన్ని మరో మలుపు తిప్పిందని' రాసుకున్నాడు. ఆ మిష్టర్ ఆర్ ఎవరో వీళ్ళిద్దరిదీ ఎలాంటి పరిచయమో నాకెంత ఆలోచించినా అర్థంకావడంలేదు. మిష్టర్ ఆర్ ఎవరో తెలుసుకోగల్గితే మన ఇన్వెస్టిగేషన్ మరింత ముందుకు సాగే అవకాశముంది" అన్నాడు సిద్ధార్థ.

"ఒకవేళ ఆ మిష్టర్ ఆర్ శ్యామ్‌ను హత్య చేసి ఉండొచ్చుగా" అనుమానం వ్యక్తం చేశాడు శ్రావణ్.

"ఆ అవకాశం చాలా తక్కువ. మిష్టర్ ఆర్‌కు శ్యామ్‌కు మధ్య మంచి స్నేహసంబం ధాలున్నాయని, ఆర్థిక సంబంధమైన లావా దేవీలు కూడా ఉన్నట్టుగా శ్యామ్ రాసుకున్న విషయాలవల్ల స్పష్టమవుతోంది. మిష్టర్ ఆర్ అనుమానించదగ్గ వ్యక్తిలా అన్పించడం లేదు" చెప్పాడు సిద్ధార్థ.

"వెయిట్ అండ్ సీ. అన్నట్టు రేపు ఇంటికి రాకూడదూ! మృదుల బర్త్‌డే. సర దాగా డిన్నర్ తీసుకోవచ్చు" పిలిచాడు శ్రావణ్.

"సారీ రేపుదయమే నేను ఊరెడుతు న్నాను. రెండు రోజులవరకు రావటం కుద రదు" సిద్ధార్థ చెప్పాడు.

"ఏదన్నా కేసు విషయమా? "

"కాదు. పర్సనల్ మేటర్"

"వెడితే వెళ్ళుగాని ఊర్నుండి రాగానే ఇంటికొచ్చి కన్పించు. ఈలోగా ఆ మిష్టర్ ఆర్ ఎవరో ఆరాతీసే ప్రయత్నం చేస్తాను" అన్నాడు ఎస్.ఐ. శ్రావణ్.

"థ్యాంక్స్ వస్తాను" చెప్పి వెళ్లిపోయాడు సిద్ధార్థ.

★ ★ ★

బస్సు దిగి మట్టి రోడ్ దారి పట్టాడు చిన్నీ. బాటకిరువైపులా పచ్చని పంటపొ లాలు తివాసీ పర్చినట్టున్నాయి. చిరుగాలికి పట్టుదారాలు పోగుపెట్టినట్టు అలలు అల లుగా సాగిపోతున్న పంటచేలవైపు పరవ శంగా చూస్తూ చకచక నడిచివెడుతున్నాడు.

"బాబూ ఎందాక వెడుతున్నారు? " తన వెనుకనుండి విన్పించిన ప్రశ్నకు ఉలిక్కిప డుతూ తలతిప్పి చూశాడు.

డెబ్బయి సంవత్సరాలకు దగ్గర్లో ఉన్న పెద్దతను తనవెనుకే వస్తున్నాడు. అతడే

తనను పలకరించాడు. "ఇక్కడికే నంద మూరువరకు" చెప్పాడు.

"ఎవరింటికెల్తున్నారు" కాస్త ఉత్సాహంగా అడిగాడు.

"రామస్వామిగారని ఆయనింటికి"

"రామసామిగారా..." భ్రుకుటి ముడిచి ఒక్కక్షణం ఆలోచించి "పురానాలు, దేవుడి బోదలు చెప్పే రామసామిగారింటికా బాబూ"

"ఆ! ఆయనింటికే"

"ఆయనగారిప్పుడు లేరు బాబు. ఆయన పోయి ఎనిమిది నెల్లయింది"

"ఆయన పోయేరా!" ఆశ్చర్యాన్ని ప్రకటించాడు చిన్నీ.

"అవును బాబూ. తను నమ్మిన మంచికి, దరమానికీ బతుకును అంకితం చేసిన దొడ్డ దొర. మంచోళ్ళకు చావు తొరగా ముంచుకొస్తుంది" నిర్వికారంగా చెప్పాడు.

"తాతా... మరి ఆయన పెంచిన అమ్మాయుండాలిగా. ఆ అమ్మాయయినా ఉందా" తెలియనట్టే అడిగాడు.

"ఆ బిడ్డ కూడా ఇప్పుడీ ఊళ్ళో లేదు బాబు. తండ్రిలా పెంచిన అయ్యా పోవటంతో దిక్కులేని పక్షిలా అల్లాడిపోయింది. ఇక్కడే మంచిగా బతకాలన్న ఆ యమ్మను బతకనిత్తుందా ఈ లోకం. ఆ యమ్మ రూపమే ఆమెకు శాపమయింది. ఊళ్లో ఎవరికీ చెప్పకుండా ఓ రాత్రికి రాత్రే ఇల్లొదిలి ఏడికో ఎల్లిపోయింది" అర్థమయ్యి అర్థంకానట్టున్న తాత మాటలకు తల పంకిస్తూ "అంటే... ఆమెకెవరయినా అపకారం తలపెట్టారా" అడిగాడు చిన్నీ.

"కడుపు చించుకుంటే కాళ్ళమీదే పడుతుంది బాబు. పెద్దోళ్ళ కదలు చెప్పటానికే సిగ్గుగా ఉంటాయి. మాలాంటోళ్ళకున్న నీతి నియమాలు, వావివరసలు ఆళ్లకుండవు" అంటూ ఏదో చెప్పబోతూ చిన్నీ ముఖంలోకి సందేహంగా చూస్తూ ఆగిపోయాడు.

"ఏం ఆగిపోయావేం నాకు చెప్తే ఏం జరుగుతుందోనని భయపడుతున్నావా, పరవాలేదు. రామస్వామిగారు, మా మామయ్య మంచి స్నేహితులు. ఆయన చనిపోయేముందు తన కూతురు బాధ్యత తను తీసుకోమని మామయ్యకు ఉత్తరం రాశారు. సమయానికి మా మామయ్య ఈ దేశంలోనే లేడు. అమెరికా వెళ్లారు. మొన్ననే తిరిగొచ్చాక రామస్వామిగారు ఎప్పుడో రాసిన ఉత్తరం చదివి వెంటనే ఆ అమ్మాయిని వెంటబెట్టుకురమ్మని నన్ను పంపించారు. ఆ అమ్మాయిని తీసుకెళ్ళాలనే ఇక్కడికొచ్చాను" చెప్పాడు చిన్నీ.

"పాపం ఆ పిల్ల దురదృష్టవంతురాలు కాబట్టే సమయానికి మీ మావయ్యగారు ఊళ్లోలేకుండా పోయారు" అన్నాడు తాత.

"ఇంతకీ ఆ అమ్మాయి ఏమైంది? అసలా అమ్మాయి రామస్వామిగారి కూతురేనా? " అడిగాడు చిన్నీ.

"కాదు బాబూ ఆ అమ్మాయి గురించి చెప్పాలంటే ఓ పాతికేళ్ళ కిందటి కత చెప్పుకోవాల. బతుకుతెరువునెదుక్కుంటూ పాతికేళ్ళకిందట రామసామిగారు, ఆయన భార్య పార్వతీదేవితో ఈ ఊరొచ్చారు. ఆవిడ నిజంగా ఆ పార్వతిదేవిలాగానే ఉండేది. ముఖమంతా పసుపు రాసుకొని, నుదుట పెద్ద బొట్టుతో మెరిసిపోయేది. చిరునవ్వే ఆమెకు నగలునాణేలు. ఎవ్వరినైనా నవ్వుతూ ఆదరంగా పలకరించేది.

వచ్చిన కొన్నాళ్లకే రామసామిగారు అందరికీ దగ్గరయ్యాడు. మా ఊళ్లో ఏ ఇంట శుభం జరిగినా ఆయన చేతులమీదుగానే ఆ కార్యం జరిగేది. మా ఊరి పెద్ద రైతులు, భూసాములు కొలిచే ధాన్యంతో ఆయన జీవనోపాది జరిగేది.

కార్యాలు చెయ్యటమే కాదు, రోజూ ఆ బాబు గుళ్లో పురానం కూడా చదివి వినిపించేవాడు. పురానమయ్యాక దేవుడికి ఆరతిచ్చి ఇంటికొచ్చేసరికి అర్ధరాత్రయ్యేది.

ఓరోజాయన మామూలుగా పురానం

చదివి చెప్పటానికి గుడికెళ్ళారు. తిరిగొచ్చేసరికి బాగా ఆలస్యమయింది.

తలుపు తెరిచి ఉండడం చూసి విస్మయపడుతూ "పార్వతీ, పార్వతీ" అని పిలుస్తూ లోపలికెళ్ళాడు రామస్వామి.

బదులు చెప్పకుండానే లోపల్నుండి అపరాధిలా తలొంచి నడుస్తూ ఎదురుగా వచ్చి నిలబడింది పార్వతి. విడిన కురులు, చెదిరిన బొట్టు, పగిలిన గాజులు, నలిగిన చీర చూసి ఆయన అదిరిపడ్డాడు. మనసు కీడును శంకించింది.

"పార్వతీ అలా ఉన్నావేం?" ఒక అంగలో, ఆమె దగ్గరకు వెళ్లి అడిగాడు రామసామి. బెదురుతూ నాలుగడుగులు వెనక్కు వేసింది. తలెత్తి భర్తవంక చూసిన ఆమె కళ్ళు శ్రావణమేఘాల్లా ఉన్నాయి.

"నీ మవునంలో అపశ్రుతి ఉంది. నన్ను హింసించక మాట్లాడు పార్వతీ"

"ఏం మాట్లాడను. పాలకుండను వీధి కుక్క ముట్టింది" చెప్పి వలవల ఏడ్చింది పార్వతి.

బలమైన తంకుశం గుండెలో దిగబడ్డట్టయింది. కొద్దిక్షణాలు మాటలు రాని మూగవాడయ్యాడు.

పార్వతి శోకమూర్తిలా రోదిస్తూనే ఉంది.

కొద్దిసేపటికి తేరుకున్నాడు. ఏడ్వడంవల్ల ప్రయోజనముంటుందా. పాలు పారబోస్తే పాత్ర పరిశుద్ధమవుతుందిగా పార్వతీ" అన్నాడు శాంతంగా.

అంత దుఃఖంలోను భర్త మాటలు విస్మయాన్ని కలిగించాయి. "స్వామీ" అంది అనూహ్యంగా. ఆమెలో భర్తపట్ల ప్రేమ, భక్తి అంచులు దాటి ప్రవహిస్తున్నపుడు ఉపయోగించే పదమది.

"నేనన్నదాంట్లో అసత్యముందా?"

"అసత్యంలేకపోయినా అసంబద్ధంగా విన్పిస్తున్నాయి. పాలే అయితే పారబోస్తాం కాని జీవితమే నేలపాలయితే" ఆగిపోయింది.

"జీవితం ఎప్పుడూ నేలపాలు కాదు పార్వతీ. శరీరం అశాశ్వతమైనది. నాశనమయ్యే ఈ మాంసపుముద్దకు మంచి, చెడులు ఆపాదించగలంగాని దీని లోపలున్న ఆత్మకు మంచి, చెడులు ఎలా ఆపాదించగలం. మనసు మాలిన్యం కానంతవరకు ఈ భౌతిక శరీరాన్ని పట్టించుకోనక్కర్లేదు. వాడు నీ శరీరాన్ని తాకగలడుగాని నీ మనసును మలినం చెయ్యలేడు"

"వద్దు ఇంత మంచిని పొందే అర్హత నాకులేదు. మీ క్షమకు నేను తగను. నాకేదన్నా శిక్ష విధించండి. మీరు మరణాన్ని తీర్పుగా ఇచ్చినా నేను సంతోషంగా స్వీకరిస్తాను" ఏడుస్తూ అంది పార్వతి.

"ఇది క్షమ కాదు. భర్తగా నీపట్ల నాకున్న కర్తవ్యాన్ని నీకు విశదపరుస్తున్నాను. పెళ్లిరోజున హోమగుండం ముందు "అర్థేచ, కామేచ, మోక్షేచ... నాతిచరామి" అని నీకు ప్రమాణం చేశాను. సుఖంలోనే కాదు కష్టంలోనూ నిన్నొదిలిపోనన్నాను. ఇప్పుడు నీకు అంతులేని కష్టం వచ్చిపడ్డది. అది ఒంటరిగా భరిస్తాననటం అన్యాయం కదూ. నీ శరీరంలో అర్థభాగాన్నిచ్చావు చూడు అది ఏధర్మంతో నువ్వు నాకు పంచావో అదే ధర్మంతో నేనీ మాట చెప్పాను. జరిగింది ఓ దుస్వప్నమని మర్చిపో పార్వతీ. ఈ క్షణంనుండి మళ్ళీ నా పార్వతిగా పునర్జన్మనెత్తాలి" అన్నాడు.

"అది జరిగేపనికాదండీ. మీరెంతటి కరుణామూర్తులో నాకు తెలుసు. నన్ను క్షమించడంలో మీరు మరింత ఎత్తుకు ఎదిగిపోయారు. కాని... మీ పాదాల దగ్గరయినా నిలబడగలిగే యోగ్యతను నేను పోగొట్టుకున్నాను. మీ మాట కాదన్నందుకు నన్ను మన్నించండి" అంది.

"పార్వతీ నా మాటంటే వేదవాక్కులా పాటించే నువ్వు ఈ విషయంలో వ్రతభంగం ఎందుకు చేసుకోవాలనుకుంటున్నావు. భర్తగా నువ్వు నాకిచ్చే విలువ

దేనా? " నిష్ఠురంగా అన్నాడు.

భర్త మాటలకు కుపితురాలయింది పార్వతి. "మీరు నన్ను కావాలని శంకిస్తున్నారుగాని నా హృదయమేమిటో, నేనేమిటో మీకు తెలియదా" అంది దీనంగా.

"తెలుసు కాబట్టే జరిగింది పీడకలలా మర్చిపొమ్మంటున్నాను"

"అదెలా సాధ్యం. సీతమ్మవారు పరపురుషుని ఇంట ఉన్నందుకే అగ్నిపరీక్ష పెట్టి లోకంకోసం చేసేనని తప్పించుకున్నాడు రాముడు. ఆ మహాసాధ్వి అగ్నిపరీక్షలో నెగ్గినా కూడా సంతృప్తిపడలేదు. ఎవరో ఏదో అన్నారన్న సాకుతో నిండు గర్భిణిని నిర్దాక్షిణ్యంగా అడవిపాలు చేశాడు. అటువంటి పవిత్రమూర్తికే అపనిందలు, భర్తృవియోగం తప్పనప్పుడు కళంకితనైన నేనేవిధంగా సమాధానపడగలను" అంది పార్వతి.

"పిచ్చిదానా. ధర్మాలు కాలానుగుణ్యంగా మారుతాయి. రాముడంత ఖచ్చితంగా వ్యవహరించాడు కాబట్టే దేవుడయ్యాడు. దేవుడెప్పుడూ మానవుడికంటే భిన్నమైనవాడే. ఆ దైవత్వాన్ని మనకు అన్వయించుకోకూడదు. మనం మనుషులం కాబట్టి అనుసరించే ధర్మం వేరుగా ఉండాలి"

భర్త మాటలకు దీర్ఘంగా నిట్టూర్చింది. "మీరు క్షమించినంత సులువుగా నేను సమాధానపడలేను. నాకు కొంత సమయం పడుతుంది. మానసికంగా ఈ గాయం మానితే అప్పుడు మీ భార్యనవుతాను. అంతవరకు నన్ను క్షమించండి" చెప్పి లోపలున్న బావిదగ్గరకు స్నానం చేయటానికి వెళ్ళింది పార్వతి.

రామస్వామి చిన్నగా నిట్టూర్చాడు. హృదయం బరువెక్కింది.

తాత చెప్పటం ఆపగానే "ఆ తరువాతేమయ్యింది" కుతూహలంగా అడిగాడు చిన్నీ.

"ఏమవుతుంది బాబూ. ఆడోళ్ళ కన్నీటి కథలకు ముగింపు అగ్గిదేవుడి ఒడిలోనే. పాపం ఆ పార్వతమ్మ ఆ గోరం జరిగిన నెల్లాళ్ళకే గన్నేరుపప్పు తిని బలవంతంగా ప్రాణాలు తీసుకుంది" ఆర్ద్ర కంఠంతో చెప్పాడు తాత.

చిన్నీలో రామస్వామిమీద గౌరవం, పార్వతిమీద సానుభూతి .చోటుచేసుకున్నాయి. "ఆయన పెద్దమనసుతో ఓదార్పునిచ్చి మనిషిని చెయ్యాలన్నా ఆమె ఎందుకలా తొందరపడింది. చనిపోయేముందయినా ఒక్కక్షణం ఆయన గురించి ఆలోచించాల్సింది" అన్నాడు బాధగా.

"ఆలోచించేదేమోగాని బాబూ విధి ఆయమ్మ పట్ల క్రూరంగా చూసింది. ఆమె నెల తప్పటంతో అందుకు బాధ్యుడు ఆ రాక్షసుడే అనుకొని వాడి పాపాన్ని గర్భాన మోయటం ఇష్టంలేక అభిమానవంతురాలైన ఆ తల్లి ప్రాణం తీసుకుంది. ఆవిడ పోయాక రామస్వామి విరాగయిపోయాడు"

"ఆ తరువాత..." చిన్నీలో కుతూహలం తొంగిచూసింది.

"అంతటితో పెద్దల ఆగడం ఆగలేదు బాబూ. కక్షకట్టినట్టు ఆయన్ను మా ఊరి నుండి దూరంగా తరిమేసేవరకు నిద్దరోలేదు"

"ఊరి పెద్దలకు ఆయనంటే ఎందుకంత కక్ష? "

"తన మానాన తను పచ్చిక మేసే లేడికూన ఏ నేరం చేసిందని బాబూ పులి దానిమీద పంజా ఇసురుతుంది. దాని ప్రాణం ఒక పంజాదెబ్బకే హరీ మంటుందని తెలిసినా దాని జులువాపదు. ఇదీ అంతే"

"కాని దానికది ఆకలి వేట. ఇదలాక్కాదుగా"

"ఇదీ ఓవిధమైన వేటే బాబూ. తమింట్లో పెరిగిన పాపాన్ని రామసామి ఇంటి ముంగటెట్టి ఊరికి దూరంగా తరిమేశారు" పెద్దలు.

"అంటే... అర్థంకాలేదు" చిన్నీ సందేహం

వెలిబుచ్చాడు.

చిన్నీ ప్రశ్నతో తాత మనసు ఒక్కసారి గతంలోకి తొంగిచూసింది.

★ ★ ★

బ్రాహ్మీముహూర్తానే నిద్రలేచి స్నానాదికాలు ముగించి రోజూలానే ధ్యానం చేసుకుంటున్న రామస్వామికి ఆ రోజసలు ఏకాగ్రత కుదరడంలేదు. సమీపంలో చంటిబిడ్డ ఏడుపు అతడి ఏకాగ్రతను భంగపరుస్తోంది. అంతకంతకు తారస్థాయి నందుకుంటున్న పసిబిడ్డ ఏడ్పు విని తనకేమీ పట్టనట్టుండలేకపోయాడు. దర్భాసనంమీద నుండిలేచి తలుపు తీసుకుని బయటికొచ్చాడు.

గుమ్మం పక్కగా అరుగుమీద పొత్తిళ్లలో ఉన్న పసిబిడ్డ చలిబాధకు తట్టుకోలేక గుక్కపట్టి ఏడుస్తోంది. రామస్వామి బిడ్డనెత్తుకుని వాకిట్లోకొచ్చి చుట్టు పక్కల కనుచూపు మేరలో ఎవరైనా కనిపిస్తారేమోనని నాలుగువైపులా పరిశీలనగా చూశాడు.

దూరంగా పొలం పనికిపోయే కూలి జనాల అలికిడి తప్ప అతడాశించినట్టు పాపకు సంబంధించిన వ్యక్తులెవరూ కన్పించలేదు.

కొద్దిక్షణాలు అక్కడే నిలబడి చూసి చిన్నగా నిట్టూర్చి పాప నెత్తుకుని లోపలికెళ్ళాడు రామస్వామి. దీపం వెల్తురులో బిడ్డను చూశాడు. ఆడబిడ్డ. పురిటినెత్తురు గుడ్డు. కోసిన బొడ్డునుండి ఇంకా నెత్తురు చిమ్ముతూనే ఉంది. ఒక్కసారి బిడ్డను చూడగానే అతడి మనసు ఆనందతరంగమయింది. అంతలోనే అతడి సంతోషం గుప్పున ఊదేసినట్టయింది.

ఎందుకో ఆక్షణంలో భార్య పార్వతి గుర్తొచ్చింది. మనసు వికలమయింది. తను కట్టుకున్న భార్యకే రక్షణ ఇవ్వలేని అసమర్థుడు. ఇక ఈ ఆడబిడ్డనెలా పెంచగలడు? తను రక్షణనివ్వగలడా? అందుకే చేతుల్లో ఉన్న బిడ్డను బయటకు తెచ్చి అరుగుమీద పడుకోబెట్టాడు.

అప్పటివరకూ చలినుండి రక్షణనిచ్చిన వెచ్చదనం దూరంకాగానే పాప మళ్ళీ ఏడ్వడం మొదలెట్టింది. మనసు రాయిచేసుకుని ఆ ఏడ్పు విననట్టే రామస్వామి బయటకునడిచాడు.

రాములవారి గుడివరకు వెళ్లేటప్పటికే రామస్వామికి బింకం సడలి ఆస్థానే జాలి చోటుచేసుకుంది. "ఏడ్చిఏడ్చి నోరెండిపోయి ఆ పసిదాని శ్వాస ఆగిపోతే? అదే జరిగితే ఆ పాపం పూర్తిగా నాదే. భగవాన్! ఎప్పుడు ఎవరితో బంధం కలుపుతావో, ఎవర్ని ఎలా విడదీస్తావో తెలియని లీలామానుష విగ్రహుడివి. నీ లీలలు నీకే ఎరుక. ఈశ్వరా నీ ప్రసాదంగా ఆ బిడ్డ మంచిచెడ్డలు నేనే స్వీకరిస్తాను" దృఢనిశ్చయంతో వడివడిగా అడుగులేస్తూ ఇంటికొచ్చేసరికి వెంకన్న భార్య రంగమ్మ బిడ్డనెత్తుకుని ఊరడించడానికి అవస్థపడుతూ కన్పించింది.

"నువ్వెప్పుడొచ్చావే రంగీ"

"గుక్కపట్టి బిడ్డేడుత్తాఉంటే ఏటోనని పరిగెత్తుకొచ్చాను. చూద్దునుగదా మీరింట్లో కన్పించలేదు. బిడ్డ నొగ్గేసి ఏడికెల్లారయ్యా" అడిగింది రంగి.

"సూరిగాడి కొట్టంవైపు వెళ్లాను. బిడ్డ ఆకలేసి ఏడుస్తుందో ఏమో పాలు కావాలిగా అందుకే" చిన్న అబద్ధం చెప్పాడు.

"బిడ్డ ఎవరి. బిడ్డయ్యా?" అడిగింది రంగి.

"తెలియదే. నేను స్నానంచేసి పూజలో కూర్చున్నానో లేదో బయట్నుండి ఏడుపు విన్పించింది. వెంటనే లేచి బయటకొచ్చేసరికి పొత్తిళ్లలో ఉన్న ఈ పాప తప్ప దరిదాపుల్లో మరెవరూ కన్పించలేదు. ఎవరో కావాలనే ఇక్కడ వదిలివుంటారు" అన్నాడు.

"నిజమేనయ్యా. సెంద్రకంటి బొమ్మలాగున్న బిడ్డనొగ్గెయ్యడానికి ఆ తల్లి మనసె

ట్టాగొప్పిందో ఏటో" బిడ్డను చూసి మురిసి పోయింది రంగి.

ఆమె మురిపెం చూడగానే రామస్వామిలో చిన్న ఆలోచన తళుక్కుమంది. "రంగీ పాపను మీ ఇంటికి తీసుకెళ్ళి నువ్వు పెంచకూడదటే. అలాగని భారమంతా నువ్వు మొయ్యనవసరంలేదు. నాకొచ్చిన దాంట్లోనే తృణమో పణమో నీకూ సాయం చేస్తాను" అన్నాడు.

"మీరు సాయం చెయ్యకపోయినా తీసికెల్లే దాన్నే బాబూ. కాని నా ఇంటి సంగతంతా మీకు తెలుసు. రెక్కాడితేగాని డొక్కల్లేవని గంజినీల్ల బతుకులు. నా ఒంటిరెక్కమీద నేను, ముగ్గురు బిడ్డలు, ఆడు బతకాల. పొద్దు పొడవకముందే ఎల్లి నాలుగిళ్లలో పాసిపన్లు చేసి బతికే నాకు సంటిబిడ్డను సాకటం అయ్యేదేనా బాబూ" అంది రంగి.

"నిజమే. నీ ఇంటి పరిస్థితులన్నీ ఎరిగీ ఏదో ఆశపడ్డాను. పోనీలే నువ్వెళ్లి ఎక్కడైనా పాలచుక్కలడిగిపట్రా. నువ్వొచ్చేవరకు బిడ్డను నేనెత్తుకుంటాను"

"అట్టాగే బాబు" పాపను రామస్వామికిచ్చి బయటకు పరుగెత్తింది రంగి.

మంచంమీద ఒత్తుగా పేర్చిన పొత్తిగుడ్డల్లో వెచ్చగా పడుకున్న పాప ముఖంలోకి తదేకంగా చూస్తూ కూర్చున్న రామస్వామికి గోదాదేవి కథ జ్ఞప్తికొచ్చింది. విష్ణుచిత్తునక్కూడా సాక్షాత్తు ఆ లక్ష్మీదేవే చిన్నబిడ్డ రూపంలో భగవత్ప్రసాదంగా లభించింది. పెరిగి పెద్దయ్యి శ్రీరంగనాధుడికే అతడిని మామను చేసింది. "ఈ బిడ్డ పెరిగి పెద్దయి తననేం చేస్తుందో" అతడిలో మెదిలిన ప్రశ్నకు సమాధానం లభించకముందే కామందుగారి పాలేరు వాకిట నిలచి "పంతులుగారూ" అంటూ పిల్చాడు.

"ఎవరూ" అంటూ బయటికొచ్చి చూసి "నువ్వా ఏమిటిలా వచ్చావు? " అడిగాడు.

"కామందుగారు ఉన్న పలంగా మిమ్మల్నెంట బెట్టుకురమ్మన్నారు"

"నన్నా... నాతో ఆయనకేం పని"

"ఏమో నాకేటి తెలుసు. ఆయన చెప్పమన్నారు. చెప్పాను. మీరెంత బేగా వత్తే అంత మంచిది" ఆ మాటలో హెచ్చరిక రామస్వామికి అపశ్రుతిలా విన్పించింది. "పరమేశ్వరా ఇంకా ఏ లీల చెయ్యాలని ఇటువంటి పిడుగు నామీద కురిపించావు. మహాభక్తులే నీ పరీక్షకు గురయ్యారు. నేనెంత? " అనుకుంటూ పాపను రంగికి అప్పచెప్పి కామందుగారి మండువా లోగిలి వైపు సాగిపోయాడు రామస్వామి.

సింహాసనంలాంటి కుర్చీమీద ఠీవిగా కూర్చుని రామస్వామి కోసమే ఎదురుచూస్తున్నాడు కేశవరావు. కింద మెట్ల దగ్గరే ఆగి "ఎందుకో పిలిపించారట" అడిగాడు.

"నీ ఇంట్లో ఓ పసిపిల్ల ఉందని తెలిసింది. ఎవరా పిల్ల? "

"తెలియదు"

"నీకు తెలియకుండా ఆ పిల్ల నీ ఇంట్లో ఎందుకుంటుంది? "

"మీ ప్రశ్నకు సమాధానం నా దగ్గర లేదు. కాబట్టి అంతా దైవలీల అని చెప్పటం తప్ప వేరే ఏమీ చెప్పలేను" శాంతంగా అన్నాడు.

"అహ్హహ్హ! దైవలీలా..." ఎగతాళిగా నవ్వి "ఆ పిల్ల నీకు పుట్టిన అక్రమ సంతానం అని నేనంటాను. ఒప్పుకోటానికి నువ్వు సిద్ధంగా ఉన్నావా? "

"శివశివ" వినలేనట్టుగా రెండు చెవులు మూసుకున్నాడు రామస్వామి.

"ఆయన్నెందుకు మధ్యలో అడ్డం పెట్టుకోవటం. ఆ పిల్ల తల్లెవరో, దాని కులగోత్రాలేంటో ఈరోజు సాయంత్రం రచ్చబండ దగ్గర జరగబోయే పంచాయితీలో నువ్వు చెప్పాల్సుంటుంది. అది గుర్తుంచుకో"

కామందు మాటలకు మూడో కన్ను తెరిచిన రుద్రునిలా చూశాడు రామస్వామి. "నామీద పంచాయితీ జరపటం దేనికి? " గంభీరంగా అడిగాడు.

"కులం గోత్రంలేని పిల్ల నీ దగ్గరున్నం దుకు. పెళ్లామే లేని వాడివి. నీ దగ్గరున్న పిల్ల తల్లెవరో తేలాల్సిందే"

"నిజమే. ఆ విషయం తేలాల్సిందే. తల్లి ఒడిలో సేదతీరి పాలవెల్లువను చవిచూస్తూ ఆ తల్లికి మాతృత్వపు మధురిమను అందిం చాల్సిన పసిగుడ్డు కిరాతకంగా పరాయిపం చలో పారవేయబడిందంటే ఆ విషయం అందరం ఆలోచించాల్సిందే" రామస్వామి మాటలు ములుకుల్లా తగిలాయి.

"ఆపు నీ అధిక ప్రసంగం. అసలు విష యాన్ని పక్కదోవ పట్టించే ప్రయత్నం కట్టి పెట్టి ఆ తల్లికి, పిల్లకు, నీకూ మధ్య సంబం ధమేమిటో సూటిగా చెప్పెయ్యి" గద్దించాడు.

"మీరెన్ని విధాల ప్రశ్నించినా నా దగ్గర సమాధానం లేదు. ఆ పిల్లెవరో, తల్లెవరో కూడా నాకు తెలియదు. అవన్నీ తెలిసిన సాక్షి ఒకడున్నాడు. కాని... అతడు మౌనసాక్షి. విషయం తెలిసినా నోరు విప్పడు. దుష్టుడినీ, శిష్టుడినీ కూడా సమ దృష్టితో చూసే అమృతమూర్తి" అన్నాడు రామస్వామి.

"మౌనసాక్షా! వాడెవడు? "

"ఆ విశ్వంభరుడు. నేను నిత్యం కొలిచే సదాశివుడు. అతడి దగ్గరే మీరడిగిన ప్రశ్నకు జవాబుంటుంది" అన్నాడు రామ స్వామి.

"చాలించు నీ తెలివి, మాటల చాతుర్యం. నటన కట్టిపెట్టి విషయం త్వరగా తేల్చు" హుంకరించాడు.

"నేను చెప్తున్నది నిజమే అయినా మీ మనసులో ఉన్న అభిప్రాయాన్ని నా తలకు రుద్దే ప్రయత్నమే తప్ప నా గోడు మీరు పట్టించుకునే స్థితిలో లేరని అర్థమయింది. ఆ పిల్ల ఎవరైనా, కన్నతల్లెవరో తెలియకపో యినా, నా గుండెలో అనాధకు చోటిచ్చి నంత మాత్రాన మీకొచ్చిన నష్టమేమిటో సెలవియ్యమని కోరుకుంటున్నాను"

"నష్టమేమిటని తెలిగ్గా అడుగుతున్నావా? ఊరికంతటికీ ఉన్న ఆ ఒక్క ఆలయానికి పూజారివి నువ్వు. నిత్యపూజలు నీ చేతుల మీదుగా మా దేవుడికి జరగాల్సిందేగా. అటువంటప్పుడు కులం, గోత్రంలేని పిల్ల నీ ఇంట పెరుగుతుందంటే నువ్వు మైలపడ్డట్టే. నీలాంటి అపవిత్రుడి చేతులమీదుగా మా దేవుడికి పూజలు జరపటం మా ఊరికే అరిష్టం. కాదంటావా? "

కేశవరావు మాటలకు రామస్వామి కోపంతో నిలువెల్లా వణికిపోయాడు. "ఆపు నీ అధిక ప్రసంగం. నీ ఎత్తుగడేవిటో ఇప్పుడు నాకర్థమయింది. నేను నిత్యం ఆరా ధించే నా శివుడ్ని నా నుండి దూరం చెయ్య టమే కాకుండా నా నోటి దగ్గరున్న అన్నాన్ని కూడా లాక్కోవాలన్నదే నీ కుటిలనీతి. కానీ... పంచాయితీ జరిపి నువ్వు నన్ను వెలివెయ్యటం కాదు. నేనే మీ అందరినీ వెలి వేస్తున్నాను. నా నిష్క్రమణలో నీ దాహం చల్లారి నీ కళ్లు చల్లబడతాయనుకుంటాను. ఒక్కమాట! ఇతరుల జీవితాలను సమాధు లుగా చేసి వాటిమీద బంగారు హర్మ్యాలు నిర్మించి నివసించాలనుకునేవాడు ఏదో ఒక రోజు కుప్పకూలిపోయిన ఆ భవనపు గోడల మధ్యనే సమాధయిపోతాడన్న విషయం మాత్రం మర్చిపోవద్దు. నువ్వనుకున్నట్టు భగవంతుడు ఆ ఆలయంలో కాదు ఉండేది మంచి వారి మనోమందిరాల్లో నివసిస్తాడు" చెప్పి విసవిసా వెళ్ళిపోయాడు రామస్వామి.

వెడుతున్న రామస్వామిని చూసి కామందు మీసాలు గర్వంగా దువ్వుకు న్నాడు.

★ ★ ★

తాత కథ చెప్పటం ఆపగానే "పాపం ఆయన నిజంగానే ఊరికి దూరంగా వెళ్ళిపో యారా? " అడిగాడు చిన్నీ.

ఆత్మాభిమానమున్న మనిషి కాబట్టి ఆ పాపను తీసుకుని ఊరికి దూరంగా ఓ పుణ్యాత్ముడిచ్చిన స్థలంలో చిన్న పూరిల్లు వేసుకుని చివరి ఊపిరొదిలేదాకా అందు

లోనే ఉన్నాడు. మా ఊరి మొగమన్నదే మళ్ళీ ఆయన చూడలేదు"

"మరి జీవనోపాధి ఎలా? " చిన్నీ సందేహంగా అడిగాడు.

"పుణ్యాత్ముడన్నానే ఆయనెవరో కాదు కామందు దాయాది. స్వయానా చిన్నాన్న కొడుకు. ఆయనే రామస్వామిగారినాదుకొని ఓ అర ఎకరం భూమి భరణంగా ఇచ్చాడు. అందులో పూలతోట, కూరగాయలు పెంచుకుని అవమ్మి ఓ పూటతినీ తినకుండా బతికున్నంతవరకు కాలక్షేపం చేసేవాడాపిచ్చి మారాజు. మా ఊరివారు కూడా ధాన్యమో, బియ్యమో కామందుకు తెలియకుండా అప్పుడప్పుడు సాయపడే వారనుకోండి" వివరించాడా తాత.

ఇంతలో ఊరు దగ్గర పడ్డంతో సంభాషణకు ఫుల్‌స్టాప్ పడింది. "అదిగో బాబూ అల్లంత దూరంలో ఉన్న పూరిల్లు చూశారా అదే రామసామిగారిల్లు" మట్టిరోడ్ మొదట్లోనే నిలబడి దూరంగా బిక్కుబిక్కుమంటున్నట్టున్న తాటాకుల ఇంటిని చిన్నీకు చూపించాడు.

"ఇప్పుడా ఇంట్లో ఎవరూ ఉండడం లేదా? " అడిగాడు.

"లేదు బాబూ, ఆ అమ్మ ఊరొదిలి వెళ్ళాక తనిచ్చిన భూమిని తనే తీసుకున్నాడా యజమాని. ఇల్లు మాత్రం అలాగే రామసామిగారి గుర్తుగా ఉండిపోయింది" చెప్పాడు తాత.

"ఆ ఇల్లు నేనోసారి చూడాలి. నా వెంట మీరూ రండి" అడిగాడు చిన్నీ.

"పదండి" అంటూ చిన్నీ వెంట నడిచాడు తాత.

"మరి రామస్వామిగారి దగ్గర పెరిగిన అమ్మాయికి ఆయన చదువు చెప్పించలేదా? ..." వెడుతున్న చిన్నీ అడిగాడు.

"చదువుకుంది బాబూ. పదివరకు మా పక్కూరి పెద్ద బడిలో చదువుకుంది. పురాణాలు, రాములోరి కత, భారతం అన్నీ చక్కగా చదువుద్ది. అమ్మాయెంత కమ్మగా పాడుతుందని. రూపమెంత బావుంటుందో మాటతీరు కూడా అంత బాగానూ ఉండేది" ఆపై తాత ఏంచెప్తున్నదీ అతడి చెవిన పడలేదు. మనసు మేఘమాలికల్లో పయనిస్తే ఊహలు ఆకాశ హర్మ్యాలు నిర్మించి అతడినక్కడ అభిషిక్తుడ్ని చేశాయి.

"లోనికి రండి బాబూ" తలుపుతీసి తాత లోపలికి ఆహ్వానించేవరకు ఊహలవారధి కడుతూనే ఉన్నాడు. తాత పిలుపుతో "ఆ! వస్తున్నా" అంటూ కొంచెం చూరుకిందికి వంగి లోపలికి నడిచాడు.

లోపల గదంతా చక్కగా అలికి ముగ్గులు పెట్టారు. ఓ పక్కగా చిన్న పూజామందిరం, మరోపక్క గోడకు చేరవేసిన మంచం, ఓమూలగా కొద్దిగా వంటపాత్రలు, స్టౌ, ఓమూల చాప, ఓ ట్రంకు పెట్టె కన్పించాయి.

"ఎవరూ మసలకపోయినా ఇల్లింత శుభ్రంగా ఎలా ఉంది? "

"ఆయనింట్లో పనిచేసే రంగికి ఆయనంటే చాలా బక్తి. ఆయన బతికున్నపుడు ఇల్లెంత శుభ్రంగా ఉంచేదో ఆయన పోయినా ఇప్పటికీ ఆయనున్నట్టే రోజూ తనుపని చేసుకుంటూ పోతుంది. దాని దృష్టిలో ఈ ఇల్లు ఓ గుడిబాబూ" తాత చెప్తుంటే చదువుసంధ్యలు నేర్వని ఓ మనిషిని కదిలించగల రామస్వామిగారి వ్యక్తిత్వాన్ని అంచనావేసి ముగ్ధుడయ్యాడు.

అటువంటి ఉదాత్తుని చేతిలో మలచబడ్డ ఆ అతివ వ్యక్తిత్వం ఇంకెంత ఉన్నతంగా తీర్చిదిద్దబడిందో.

యధాలాపంగా నడిచివెళ్లి ఆ పాత ట్రంకుపెట్టెను తెరిచి చూశాడు. పెట్టెలో కొన్ని ఆధ్యాత్మిక గ్రంధాలు, ఆయన ఉపయోగించిన పంచెలు, పైకండువాలు కన్పించాయి. బాగా అడుగున మౌంటు కంటించిన పాతబడినట్టున్న ఓ నాలుగేళ్ల పాప ఫోటో ఒకటి కన్పించింది. ఫోటో బయటకు తీసి పరిశీలించి చూశాడు. ఎవరివో అస్పష్ట

మైన పోలికలు అందులో లీలగా ద్యోతకమవుతున్నాయి.

"తాతా ఈ ఫొటోలో వున్న పాపెవరు? "

"రామసామిగారి అమ్మాయిదే బాబూ. చిన్నప్పుడు బుట్ట బొమ్మలా ముద్దొచ్చేది. ఆ అందానికి ముచ్చటపడి ఆయనే ఈ ఫొటో తీయించారు"

"మీకభ్యంతరం లేకపోతే ఈ ఫొటో నేను పట్టుకెడతాను"

"ఫొటోయేగా తీసికెల్లండిబాబు" తాత అన్నదే తడవు బ్రీఫ్ తెరిచి ఫొటో అందులో భద్రపరిచాడు. "అన్నట్టు ఈ అమ్మాయి పదోక్లాసు వరకు చదువుకుందన్నారుగా ఆ అమ్మాయితోపాటే చదివిన ఈ ఊరు ఆడ పిల్లలెవరైనా మీకు తెలుసా? వాళ్లు ఈ అమ్మాయికి సంబంధించిన సమాచారమేదన్నా చెప్పగలరేమోనని నా ఊహ" అన్నాడు చిన్నీ.

పెదవి విరిచాడు తాత. "మా ఊరి ఆడపిల్లలెవర్నీ పొరుగూరు పంపించి చదివించే ఆనవాయితీ లేదు బాబూ. పదోతరగతితోటే బడిమానిపించేవారు. నేను ఎరిగుండగా ఈ పక్కూరి మునసబుగారమ్మాయి మాత్రం ఈ పాపతోటే కలిసి చదువుకుంది. మీరా ఊరెళ్లి వాకబు చేయండి. ఫలితం ఉండొచ్చు"

తాత మాటల్తో చిన్నీ మదిలో చిరు ఆశ కొన ఊపిరి పోసుకుంది.

"ఇక వెడదామా తాతా!"

"పదండి బాబూ" అంటూ చిన్నీ వెనుకే బయటికొచ్చి తలుపు గొళ్లెం పెట్టాడు.

"అడగ్గానే శ్రమ అనుకోకుండా చాలా విషయాలు చెప్పారు. మీకు నా కృతజ్ఞతలు" అన్నాడు.

"అంత మాటెందుకులెండయ్యా. అమ్మాయిగారు కనబడితే మాత్రం మీ దగ్గరకు చేరిన వైనం చిన్న కార్డుముక్కమీద రాసి పంపండి. అప్పుడే మాలాటి వాళ్లకి ఊరటగా ఉంటుంది" అన్నాడు తాత.

"తప్పకుండా తెలియజేస్తాను" చెప్పి తాత అడ్రసడిగి డైరీలో నోట్ చేసుకున్నాడు చిన్నీ.

"తాతా ఒక్కవిషయం మీరు చెప్పలేదు" గుర్తుచేశాడు

"ఏటిబాబూ అది"

"అంత మంచిమనిషి జీవితాన్ని నిర్దయగా సమాధిచేసిన మీ కామందిప్పుడు జీవించే ఉన్నాడా? ఉంటే ఎలా ఉన్నాడు? " అడిగాడు.

"పదేళ్లుగా మంచంపట్టి కదల్లేని స్థితిలో చావుకోసం ఎదురుచూస్తూ చేసిన పాపానికి ఏడుస్తూ శవంలా పడున్నాడు బాబూ. ఇంకా ఆడికా శిక్ష చాలదు" తాత కటువుగా అన్నాడు.

"నిజంగానే దేవుడనే వాడున్నాడు తాతా. మరి నేను వెడతాను" సెలవు తీసుకుని పక్కవూరు మునసబుగారిని కలుసుకోటానికి బయల్దేరాడు చిన్నీ.



కాలింగ్‌బజర్ మోగడంతో "వస్తున్నా" అంటూ లోపల్నుండి మృదుల వచ్చి తలుపుతీసి వరండాలో నిలబడున్న సిద్ధార్థను చూసి చిన్నపిల్లలా సంబరపడిపోతూ "నువ్వా అన్నయ్యా రా లోపలికి" అంది.

"శ్రావణ్ ఉన్నాడా? " హాల్లోకొచ్చి



సోఫాలో కూర్చుని అడిగాడు సిద్ధార్థ.

"నువ్వొచ్చేముందే ఫోనొస్తే అరగంటలో వస్తానంటూ వెళ్లారు. ఆయనొచ్చే టయమయింది. శ్రావణ్ వచ్చేలోగా నీ కోసం మంచి టిఫిన్ రెడీ చేస్తాను. ఈ మాగజైన్ చూడు" పత్రిక సిద్ధార్థకిచ్చి బాణంలా వంటింట్లోకి దూసుకెళ్లింది మృదుల.

పత్రిక తిరగేసే మూడ్ లేని సిద్ధార్థ సోఫాలో రిలాక్స్‌గా వాలి కళ్లు మూసుకున్నాడు.

నందమూరుకు పది కిలోమీటర్ల దూరంలోనున్న ఆ పక్కఊరి మునసబుగారింటికెళ్లి వాకబు చేస్తే "మీరొచ్చిన కారణం ఏదయినా మా అమ్మాయికి మాత్రం ఆర్నెల్లకిందటే పెళ్లయిపోయింది. ప్రస్తుతం కాకినాడలో ఉంటున్నారు. మా అల్లుడికి అక్కడే ఉద్యోగం" అంటూ విషయం వివరించాక అల్లుడి అడ్రసిచ్చాడాయన.

కాకినాడ వెళ్లి మునసబుగారమ్మాయి కమలను కలుసుకున్నా సరైన ఇన్ఫర్మేషన్ లభించలేదు. కనీసం ఫోటో కూడా దొరకలేదు.

"ఎంతసేపయింది సిద్ధూ నువ్వొచ్చి?" సమీపంలో శ్రావణ్ గొంతు వింటూనే వాస్తవానికొచ్చి "ఓ పావుగంటయింది" జవాబిచ్చాడు.

"అమరేంద్ర అని బడా కాంట్రాక్టర్ పేరు విన్నావుగా" అడిగాడు శ్రావణ్ వచ్చిన వెంటనే సంభాషణలోకి దిగుతూ.

"పేరు విన్నాను మనిషిని మాత్రం చూడలేదు" అన్నాడు సిద్ధార్థ.

"ఈ రషీద్, యాదగిరిలు అమరేంద్రకు కుడిభుజంలాంటివారని, అతడి గాంగ్‌లో వీళ్లిద్దరే మెయిన్ క్యారెక్టర్స్ అని మా డిపార్టుమెంటుకు తెలిసిన విషయం"

"అఫ్‌కోర్స్ నువ్వన్నట్టు రషీద్, యాదగిరిలను అమరేంద్ర పంపాడనుకుందాం. కానీ అమరేంద్రకు, శ్యామ్‌కు మధ్య ఉన్న లింకే

మిటి? అసలు మిష్టర్ ఆర్ అంటే ఎవరు? ఆర్ అంటే రషీద్ అనుకోవటానికేదన్నా ఆస్కారముందా?" సిద్ధార్థ ప్రశ్నల వర్షం కురిపించాడు.

"రషీద్ మేఘశ్యామ్ ఉదహరించిన మిష్టర్ ఆర్ అనుకునే అవకాశం టెన్‌పర్సెంట్ కూడాలేదు. ఎందుకంటే శ్యామ్ ఒట్టి ఫొటోగ్రాఫరు. చెయ్యి తిరిగిన ఆర్టిస్టు. పైగా కామన్‌మెన్. ఓ పొలిటీషియన్‌కాదు, బిజినెస్ మాగ్నెట్‌కాదు అందుకే" శ్రావణ్ అన్నాడు.

సిద్ధార్థ కాసేపు మౌనం వహించాడు. "మనం ఓసారి అమరేంద్రను కలవగలిగే వీలుచూసుకోవాలి" అన్నాడు.

"అమరేంద్రను మనం కలవటం దేనికి?"

"ఫేస్ ఈజ్ ది ఇండెక్స్ ఆఫ్ మైండ్" అని చెప్పారుగదా. అతడి వ్యక్తిత్వం, పర్సనాలిటీ తెలుసుకునే అవకాశం ఉంటుందిగా" అన్నాడు సిద్ధార్థ.

"నువ్వు తప్పకుండా కలవాలంటే వెడదాం. ఊళ్లో పేరుమోసిన వ్యక్తిగదా అప్పుడప్పుడు విందులు, వినోదాలు ఏర్పాటు చేస్తుంటాడు. తన స్టేటస్ ప్రదర్శించడానికి అదోమార్గం. మా డిపార్ట్‌మెంటుక్కూడా అటువంటి ఆహ్వానాలందుతూనే ఉంటాయి గాని వాటి గురించి నేను ఇంట్రష్టు చూపను. ఈసారి అటువంటి ఇన్విటేషనేదన్నా ఉందంటే నీకు వెంటనే ఫోన్ చేస్తాను. రెడీగా ఉండు" అన్నాడు శ్రావణ్.

"అన్నట్టు ఏదో పర్సనల్ మేటరంటూ ఊరెళ్లి వచ్చేవుగా వెళ్లినపనేమయింది" మళ్లీ శ్రావణ్ అడిగాడు.

"ఏంకాలేదన్నట్టు పెదవి విరిచాడు. అతడి ధోరణిచూసి ఇక ఆ ప్రసక్తి పొడిగించలేదు శ్రావణ్. "నేనిక వెడతాను" శ్రావణ్‌తో చెప్పి బయటకొస్తూ "అన్నట్టు ఓసారి రేపు మంగళను కలుద్దామనుకుంటున్నాను" చెప్పాడు సిద్ధార్థ.

"ఆరోజు వెళ్లటమే మళ్లీ వెళ్లలేనట్టుందిగా. ఓసారి చూసిరా" చెప్పాడు శ్రావణ్.

సిద్ధార్థ ఇంటికి బయల్దేరాడు.

★ ★ ★

ఉదయం ఎనిమిదింటికే వచ్చిన మిన్నూను చూడగానే మంగళ చిర్నవ్వు తెచ్చుకుంటూ "చాలా రోజులకు కన్పించావు. ఇన్నాళ్లూ పత్తాలేకుండా ఎక్కడికి పోయావు?" అంది.

"జాబ్ ట్రయిల్స్‌లోపడి రాలేకపోయాను. సారీ మంగళా" బల్లమీద అలసటగా కూలబడుతూ అంది మిన్ను.

"ఆహా మనకున్న డిగ్రీలకు జాబ్ ఇచ్చేదెవడు?" లేచివెళ్లి గ్లాసుతో మంచినీళ్లు తెచ్చి మిన్నూకి అందించింది.

"అదిగో ఆమాటే అనొద్దని చెప్పాను. బతకటానికి డిగ్రీలవసరంలేదోయ్. బుర్రలో తెలివుండాలి. కష్టాలను చిర్నవ్వుతో స్వీకరించగలిగే మనోనిబ్బరం, సెల్ఫ్‌కాన్ఫిడెన్స్ ఉండాలి. పోనీ దాన్ని జాబ్ అనొద్దులేగాని చిన్నపని వెదుక్కున్నాను" చెప్పింది మిన్ను.

"ఏముంది ఏ షాపులోనైనా సేల్స్‌గాళ్‌గా చేరుంటావు. నీ అందచందాలే నీకు అడ్వాంటేజ్ కదా" అంది మంగళ.

"పప్పులో కాలేశావు. అలా అందచందాలు ఎరగా చూపించే పనయితే ఎప్పుడో వెదుక్కునేదాన్ని. నేను దానికి పూర్తిగా వ్యతిరేకినని తెలుసుగా. పబ్లిక్‌ఫిగర్‌లా మిగలటం నాకిష్టంలేదు. నాకు స్టిచింగ్, ఎంబ్రాయిడరీ చెయ్యటం వచ్చని నీకు తెలుసుగా. కేవలం లేడీస్ నడిపే ఓ రెడీమేడ్ అండ్ ఎంబ్రాయిడరీ స్టిచింగ్ సెంటర్లో చేరాను. ఇక ఫుడ్‌కు లాటరీ కొట్టే పనిలేదు. ఆ పూర్‌ఫెలో నందూ దయాధర్మాలమీద ఆధారపడే అవసరమూ లేదు" మిన్ను కళ్లల్లో మెరుస్తున్న సంతృప్తికి మంగళ కూడా ఆనందించింది.

"నా సొదకేంగాని అమ్మ ఆరోగ్యమెలా ఉంది?" అడిగింది మిన్ను.

"మామూలే. తను చావదు నన్ను చావనివ్వదు" మంగళ ఉదాసీనంగా అంది.

"ప్లీజ్ అలా అనకే మంగళా. ఎంతయినా ఆమె నీ కన్నతల్లి. ఆమె బతికుంది కాబట్టే నువ్వు ఒంటరితనం ఫీలవకుండా బతగ్గలుగుతున్నావు. నీ జీవితానికి ప్రొటక్షన్ కూడా వుంది. నా సంగతి చూడు. చీకటి పడిందంటే బిక్కుబిక్కుమంటూ గది తలుపులు బంధించి భయంతో గడపాలి" అంది మిన్ను.

"ఇన్నాళ్లూ నీ వ్యక్తిగత విషయాల్లో తల దూర్చకూడదని అడగలేదు. నిజంగానే నా అన్నవారు లేని అనాథవా నువ్వు?" అడిగింది మంగళ.

"కన్నతల్లి బతికే వుంది. ఆమె రత్నాల సౌధంలో ఉండే అందాలబొమ్మ. కానీ నన్ను బిడ్డగా ఒప్పుకోలేని పరిస్థితామెది. నాకు చైతన్యాన్నిచ్చిన అన్ లైసెన్స్డ్ ఫాదర్ ఈ దేశంలోనే ఎక్కడో పిల్లా పాపల్తో సుఖంగానే ఉండిఉంటాడు. అతడి పేరేంటో ఊరేమిటో కూడా తెలియని అనామికను"

"నిజంగా నాది మట్టిబుర్ర కాబట్టి నువ్వు చెప్పిందేమీ నాకర్థం కాలేదు" అంది మంగళ.

"అర్థం కాకపోయేంత పజిలే ముందిందులో ఓ యువతి, యువకుని మధ్య లైలా మజ్నూల ప్రేమలా ఓ మధుర ప్రేమకు పరాకాష్ఠగానో లేక వయసు వేడిలో సహజంగా కలిగిన కోర్కెల దాహానికి వెన్నెల సాక్షీభూతంగానో, చీకటి తెరలమాటున జరిగిన సృష్టికేళికి బలై ఈ లోకానికి వచ్చిపడ్డ చిరునామాలేని ఉత్తరాన్ని. తప్పదు కాబట్టి తల్లి గర్భాన తొమ్మిది నెలలు నిశ్చింతగా ఉన్నాను. భూమ్మీద పడగానే తల్లి ఒడిని కూడా చూడకుండానే వీధిలోకి విసిరేయబడ్డ నిరూపశిల్పశేషాన్ని. ఇంకాలోకంలో దుష్టత్వం, దయార్ద్రత సమాంతరరేఖల్లా మిగిలున్నాయి కాబట్టి నేను నేనుగా మిగిలాను" చెప్పింది మిన్ను.

"అంటే... నీకన్నతల్లెవరో నీకు తెలుసు కదూ" మంగళ అడిగింది.

"తెలుసు, చిన్నతనంలో అంటే నాకు ఊహ తెలిశాక ఎప్పుడైనా నన్ను చూడ్డానికొచ్చి వెళ్లే ఆంటీయే నన్ను కన్నతల్లని మా నాన్నగారు పోయేక తెలిసింది. ఆమె కోసమే నందమూరు వదిలి నేనిక్కడకొచ్చాను"

"మరి ఆమెను నువ్వు కలిశావా?" అడిగింది మంగళ.

"కలిశాను. నా పరిస్థితి వివరించాను. ఆశ్రయం కూడా కోరాను కానీ ఆమె తనే విధమైన సాయమూ చేయలేనని ఖచ్చితంగా చెప్పేసింది. అంతేకాదు త్వరగా అక్కడ్నుండి వెళ్లిపొమ్మని బతిమాలింది. మళ్లీ ఎప్పుడూ తనను కలిసే ప్రయత్నం చెయ్యొద్దని రెండు చేతులు జోడించి అభ్యర్థించింది. ఆమె కన్నీరు నన్ను కలిచివేసింది. అందువల్లనే మరెప్పుడూ ఆమెను కలిసే ప్రయత్నం చెయ్యలేదు. వచ్చేస్తున్నపుడు బాగ్ తెరిచి రెండు నోట్ల కట్టలు కూడా ఇవ్వబోయింది. డబ్బొద్దని తిరస్కరించి వచ్చేశాను. ఆ తరువాతే నాకో తల్లి ఉందన్న విషయమే మర్చిపోయాను" చెప్పింది మిన్ను.

"ఆవిడ నిజంగా ఆడదికాదు, రాక్షసి" కసిగా తిడుతున్న మంగళను వారించింది.

"వద్దు మంగళా ఆమెను తిట్టకు. ఆమె పరిస్థితికి జాలిపడు"

"నీ అంత విశాల హృదయం, సహనం నాకు లేవులే" వ్యంగ్యంగా అంది మంగళ. మిన్ను చిన్నగా నవ్వి "సృష్టిలో స్త్రీని మాతృత్వం కట్టిపడేసినంత బలంగా మరే బంధమూ పట్టి ఉంచలేదు. నా చిన్నప్పుడు ఆమె నన్ను చూడ్డానికి వచ్చినపుడు వెంట ఎన్నో బహుమతులు తెచ్చేది. నన్ను హృదయానికి హత్తుకుని మవునంగా ఏదో భావాతీత లోకంలో ఉన్నట్టుండి పోయేది. నన్ను చూడగానే వింతగా మెరిసే ఆ కళ్లల్లో కన్నీటి చెమ్మను కూడా చూసేదాన్ని. ఆ కన్నీటి వెనుక ఎగిసిపడే మాతృ మమకారం ఉందని ఆ తరువాతే

అర్థమయింది"

"ఆహా అంత ప్రేమ ఉన్నదయితే నిన్నెందుకు ఆదరించి ఆశ్రయమివ్వలేదు. రత్నాల సౌధంలో ఉన్న అందాల చిలుక అంటూ నువ్వే వర్ణించావుగా. కనీసం ఆ ఇంట్లో పని పిల్లగానైనా ఉండనియ్యొచ్చుగదా. నీకు పెట్టే పట్టెడు మెతుకులు ఆమె సంపదను కొల్లగొట్టలేవుగా" మంగళ ఆవేశంగా అంది.

"నిజమే, కానీ ఆ రత్నాల మేడలో పేర్చిన ప్రతి ఇటుక ఓ పలుకురాయి కావచ్చు. నన్ను చూడగానే ఆమె కళ్లల్లో తొంగిచూసిన భయాల నీడలు ఇప్పటికీ నేను మర్చిపోలేను. ఆ ఇల్లోక పాముల బుట్టలా ఏ పాము కోరనుండి విషం చింది నాకు కీడు చేస్తుందోనన్న భయంతో 'వెంటనే ఇక్కడ్నుండి వెళ్లిపో' అంటూ త్వరపెట్టి పంపేసింది. ఇక ఎప్పుడూ ఈ పడగనీడకు రావద్దంటూ జాలిగా అభ్యర్థించింది. ఇదంతా చూస్తే ఆమె జీవించేది ఓ శవపేటికలాంటి వేదికమీదేనని నాకు అర్థమైంది" అంటూ "అన్నట్టు ఇదివరలో పనిచేసిన షాపు ఓనరును కలిసి మాట్లాడతానన్నావుగా. వెళ్లేవా లేదా? " మాట మార్చింది.

"లేదు... అసలు నాకెక్కడికీ వెళ్లాలనిపించట్లేదు. జీవించటమే వృథా అన్పిస్తోంది" మంగళ నిరాశగా అంది.

"అలా నిరాశతో కుంగిపోవద్దు. జీవితం దేవుడిచ్చిన వరం, దాన్ని శాపంగా మార్చుకోటం అవివేకం. శ్యామ్ అన్నయ్య మరువలేని మంచి వ్యక్తి. అయినా మర్చిపోక తప్పదు మంగళా" మృదుస్వరంతో అనునయంగా అంది.

"అన్నట్టు వారంరోజుల కిందట ఓ వింత జరిగింది" మంగళ హఠాత్తుగా అంది.

"ఏమిటది? "

"అమ్మది లేవలేని స్థితి అని నీకూ తెలుసుగా. అందుకే పనుండి బయటకు వెడితే ఇంటికి తాళం పెట్టి వెడతాను. ఆరోజు సాయంత్రం మార్కెట్‌కు వెడుతూ దగ్గరే కదా త్వరగా వచ్చెయ్యొచ్చులే అని తలుపులు బయట గడియ మాత్రమే పెట్టి కూరగాయలు తేవటానికి వెళ్లాను. పని చూసుకుని తిరిగి వస్తుంటే నా బాల్య స్నేహితురాలు కన్పించటంతో ఆమెతో ఓ అరగంట మాటాడి ఇంటికొచ్చేసరికి తలుపులు బార్లా తెరిచున్నాయి. గదిలో సామానంతా ఎవరో గాని చెల్లాచెదురు చేసివెళ్లారు.

పెట్టెలో బట్టలు, కప్‌బోర్డులో సామాన్లు అన్నీ గదిలో చిందరవందరగా పడి గదంతా యుద్ధరంగంలా కన్పించింది. "అమ్మా, నేను బయటికెళ్లాక ఎవరైనా మనింటికొచ్చారా" అని అమ్మనడిగితే, "నువ్వలా వెళ్లేవో లేదో తలుపు తీసుకుని ఎవరో వచ్చినట్టయి నువ్వే అనుకుని 'మంగళా' అని పిల్చినా ఎవరూ జవాబివ్వలేదు. గదిలో జరుగుతున్న గందరగోళానికి ఎవరూ అని నేనెంత అరిచినా నా గోలెవరూ పట్టించుకోలేదు. లేవలేని పరిస్థితివల్ల వాళ్లెవరో తెలుసుకోలేకపోయాను. అరిచి అరిచి నోరెండిపోడంతో నోర్మూసుకున్నాను. ఆ గొడవ సద్దుమణిగాక ఓ పది నిమిషాలకు నువ్వొచ్చావు" అంది అమ్మ. ఇంతకీ వచ్చిన వాళ్లెవరో, వాళ్లెందుకొచ్చారో ఎంత ఆలోచించినా నాకర్థం కావడంలేదు" మంగళ చెప్తుంటే మిన్ను గుండెల్లో చలిపిడుగులు కురిశాయి.

"వచ్చిందెవరో, ఎలా ఉన్నారో, ఆడో మగో ఎవరైందీ చుట్టుపక్కలవాళ్లనయినా అడిగి తెలుసుకున్నావా? " మిన్ను అడిగింది.

"ఎదురింటావిడనడిగితే ఎవరొచ్చిందీ రావటం చూడలేదుగాని మీ ఇంట్లో నుండి బయటికెళ్లేటప్పుడు చూశాను. ఇద్దరి మగాళ్లలో ఒకతను కొంచెం సన్నగా, పొడవుగా ఉన్నాడు. మరొకతను కాస్త లావుగా, పిల్లిగెడ్డంతో ఉన్నాడు. చీకట్లో ముఖాల్నంత పరిశీలనగా చూడలేదని చెప్పింది" అని కాసేపాగి

"ఆ ఎవరో దొంగ వెధవలయ్యుంటారు. ఎవరింటికో వెళ్లాలనుకున్న వాళ్లు దారి తప్పి

మా ఇంటికొచ్చుంటారు. వాళ్ళమాయకత్వమే గాని మా ఇంట్లో ఏం దొరుకుతుంది. మన దరిద్రాన్ని వాళ్ళెలాగూ మోసుకెళ్ళలేరు"

మంగళ తేలిగ్గా మాట్లాడుతుంటే "ప్లీజ్ మంగళా ఈ విషయాన్నంత తేలిగ్గా తీసుకోకు. వాళ్ళు కావాలనే నీ ఇల్లు వెదుక్కుంటూవచ్చారు" మిన్ను దృఢంగా అంది.

"కావాలనే వచ్చారా, మా ఇంట్లో విలువైనవి ఏమున్నాయని? "

"వాళ్ళకవసరమయిందేదైనా అన్వేషిస్తూ నీ ఇంటికొచ్చారనిపిస్తోంది. శ్యామ్ పోయి నాలుగు నెల్లు దాటినా తీగ వెదుకుతూ డొంకను కదిలిస్తున్నారంటే నాకేమిటో భయంగా ఉంది. నీ గురించి వాళ్ళు తెలుసుకున్నారన్న ఊహే నాకు కలవరంగా ఉంది. ఇది ఇంతటితో ఆగదు" మిన్ను చెప్తున్నదేంటో మంగళకర్థంకాలేదు.

"అంటే వాళ్ళు దేనిగురించి వెతుకుతున్నారో నీకు తెలుసా? " మంగళ అడిగింది.

"తెలుసు"

"అంటే వాళ్ళెవరయిందీ కూడా నీకు తెలిసే ఉంటుంది"

"అది నాకు తెలియదు. కానీ వాళ్ళు మన ప్రత్యర్థులని తెలుసు. శ్యామ్ అన్నయ్యను శాశ్వత నిద్రలోకి నెట్టేసిన కిరాతకులు వాళ్ళే" అంది గద్గదకంఠంతో.

"మనకు ప్రత్యర్థులా! మనకెవరితోటీ విరోధంలేదు. ఎవరికీ ఏ అపకారం చెయ్యలేని దుర్బలులం. మనకు విరోధులెందుకుంటారు" అమాయకంగా అడిగింది మంగళ.

మిన్ను జవాబు చెప్పే స్థితిలోలేదు. కుర్చీలో నుండి లేచి అసహనంగా అటూ ఇటూ పచార్లు చేస్తోంది. మంగళ మిన్నును అచ్చెరు వొందుతున్నట్టు చూడ్డం తప్ప మరో ప్రశ్న వేయలేదు. "మంగళా మనం ఈ ఊరొదిలి ఎటయినా వెళ్ళిపోదాం" పచార్లాపి మిన్ను మంగళతో అంది.

"ఎక్కడకని వెడతాం. ఎవరున్నారని వెడతాం? "

"ఎక్కడికయినాసరే. ఇక్కడుండడం ప్రమాదకరమని నా మనసు చెప్తోంది. కనీసం నేను వచ్చేసిన ఆ పల్లెటూరికైనా సరే గుట్టుచప్పుడు కాకుండా వెళ్ళిపోదాం" మిన్ను అంది.

"అమ్మ పరిస్థితి నీకు తెలిసిందే. ఈ స్థితిలో ఆమెను తీసుకుని మనం ఎక్కడికని వెళ్ళగలం" మంగళ నిస్పృహాయంగా అంది.

"ఇక్కడే ఉంటే శ్యామ్ అన్నయ్యలానే మన పరిస్థితి సంకటస్థితిలో పడుతుంది. అందుకే వెళ్ళిపోదాం"

"నాకు చావంటే భయంలేదు. శ్యామ్ లానే నేనూ పోతానంటే ఆ రోజుకోసం ఎదురుచూస్తూ నేనిక్కడే ఉంటాను. చావైనా మమ్మల్నిద్దర్ని ఒకటి చేస్తుందంటే అంతకంటే సంతోషకరమైనదేదీలేదు"

మంగళ మొండితనం చూస్తే మిన్నుకు కోపం ముంచుకొచ్చింది. "కానీ నీలా నాకు చావాలని లేదు, బతకాలనుంది" అంది.

"బతుకుమీద నీకున్న తీపిని చంపుకోమని నేను చెప్పను. నా ఖర్మకు నన్నొదిలి నువ్వు ఎక్కడకు వెళ్ళాలనుకుంటే అక్కడకు వెళ్ళిపో. నువ్వు హాయిగా జీవించాలనే నేను కోరుకుంటున్నాను" అంది మంగళ.

"అంతేగాని నా సలహా పాటించవన్న మాట"

"ఈ విషయంలో నన్ను క్షమించు మిన్నూ. ఇప్పటికే ఈ జీవిత పోరాటంలో అలిసిపోయాను. అలిసిపోయిన బతుకు దీపాన్ని నిలబెట్టుకోటానికి ఇంకా పరుగులెత్తే ఓపిక నాకు లేదు. దయుంచి నన్నర్థం చేసుకో" దీనంగా అంది మంగళ.

మిన్ను మాట్లాడలేదు. వచ్చేస్తూ 'ఇది ఉంచు' అంటూ వంద రూపాయల నోటు మంగళకివ్వబోతుంటే "వద్దు నీ దగ్గర తీసుకోటానికి నాకు మనసొప్పడంలేదు" తిరస్కరించింది మంగళ.

"నీ నా అంటూ భేదం చూపి నన్ను నీనుండి దూరం చెయ్యకు. కష్టం కలిసి పంచుకోటంలో తృప్తి ఉంటుంది. నా తృప్తి కోసమైనా తీసుకో. మళ్లీ వారం వస్తాను. మరిక వెళ్లనా"

"మర్చిపోకుండా రా మిన్నూ. నువ్వొస్తే నాకు కొండంత ధైర్యంగా ఉంటుంది. నా మనసు నీ సమక్షంలో ఊరట పొందు తుంది" మంగళ అంది.

"తప్పకుండా వస్తాను" చెప్పి వెళ్లింది మిన్ను.

మిన్ను వెళ్లిన ఓ గంటకు సిద్ధార్థ మంగళ ఇంటికొచ్చాడు.

★ ★ ★

"డామిట్! ఇంకా దొరకలేదంటూ నా ముందుకొచ్చి చెప్పటానికి మీకు సిగ్గెయ్యడం లేదా" అమరేంద్ర చేతిలో ఉన్న విస్కీ గ్లాసును నేలకేసి కొట్టేడు. ఎదురుగా నిలబడ్డ ఆ ఇద్దరూ తప్పుచేసిన వాళ్లల్లా తలొంచుకున్నారు. "వాడి రూమ్‌లోనూ లేక దానికొంపలోనూ లేక ఏమయ్యింది? ఎలా మాయమయ్యింది" ఆవేశంతో చిందులు తొక్కాడు.

"అదే మాకూ అర్థం కావట్లేదు సార్! ఒక వేళ అది చేరవలసిన చోటుకే చేరిందేమోనని మా అనుమానం" రషీద్ సందేహాన్ని వెలిబుచ్చాడు.

"ఇంపాసిబుల్. వాడికి చేరే ఉంటే ఇప్పటిదాకా నోర్మూసుక్కూచుంటాడా. ఫోన్లు మీద ఫోన్లు చేసి రారెత్తించేవాడు. అదడ్డం పెట్టుకుని నన్ను గెలవాలన్నదేగా వాడి ఎత్తుగడ"

"మీరు చెప్పేదీ నిజమే. అయినా ఆ రోజు రాత్రి అక్కడున్న మన గార్డ్ చాలా దూరం వరకు వాడిని వెంబడించి వెళ్లానని చెప్పాడు. పెద్ద మసీదు వెనుక సందులోకి వెళ్లేకమాత్రం ఆ చీకట్లో ఎటు వెళ్లిందీ కనిపించకుండా పోయాడని చెప్పాడు. ఓ గంట వరకు ఆ పరిసరాల్లోనే వాడికోసం చూసి చూసి విసుగెత్తి వచ్చి విషయం మనకు చెప్పాడు. ఆ తరువాతే రాత్రికి రాత్రే వాడిని ఈ భూమ్మీదే లేకుండా చేశాం.

యాదగిరి వివరిస్తుంటే "సరే తెలిసిన కథనే మళ్లీ చెప్పటం దేనికి. ఇది మనం చేయించిన పనే అని వాడికీ తెలుసుకాబట్టి వాడు అదెక్కడుందో తెలుసుకునే ప్రయత్నం గట్టిగానే చేస్తాడు. వాడి చేతికి చిక్కకముందే అది వెదికి కాల్చి బూడిద చెయ్యండి. మధ్యలో ఎవడడ్డొచ్చినా సరే అవసరం వస్తే వాడంతం చూసైనాసరే అనుకున్నది సాధించుకురండి. మీ ప్రయత్నాలు మరింత చురుగ్గా సాగాలి" చెప్పాడు అమరేంద్ర.

"అలాగే సర్... ఇక మమ్మల్ని వెళ్లమంటారా? " రషీద్ అడిగాడు.

"వెళ్లండి. అన్నట్టు కొత్తగా వచ్చిన ఎస్.ఐ. శ్రావణ్ చాలా ఘటికుడని తెలిసింది. వాడి దృష్టిలో పడకుండా జాగ్రత్తగా మీ పని సాధించుకురండి"

ఇద్దరూ తలూపి వెళ్లిపోయారు. "బుల్ షిట్" గొణుగుతూ లేచి వెళ్లి కప్ బోర్డులో ఉన్న గాజుగ్లాసు తెచ్చుకుని టేబుల్ ముందు కూర్చున్నాడు.

ఒక్కగుక్క విస్కీ గొంతులో పోసుకున్నాడో లేదో వింధ్య మెల్లగా నడిచొచ్చి అతడికెదురుగా కూర్చుంది. "ఏవిటిలా వచ్చేవు" అన్నట్టు కళ్లెగరేసేడు అమరేంద్ర. "బాబు దగ్గర్నుండి లెటరేదన్నా వచ్చిందా? " అడిగింది వింధ్య.

"లెటరొస్తే నీకు చూపిస్తానుగా"

"వాడు లెటర్ రాసి పది రోజులు దాటిపోయింది" గొంతులో దిగులు స్పష్టంగా విన్పించింది.

"ఎగ్జామ్స్ జరుగుతున్నాయేమో. చదువు గొడవలోపడి లెటర్ రాయటం ఆలస్యం చేసుంటాడు. దానికి కంగారెందుకు" అన్నాడు.

"ఏమో మనసేమిటో దిగులుగా ఉంది.

వాడెలా ఉన్నాడో ఏమిటో? రేపోసారి వాడి హాస్టల్‌కు ఫోన్ చెయ్యండి ప్లీజ్" అభ్యర్థనగా అంది.

"అలాగే చేస్తాలే. నువ్వెళ్లిపడుకో" చెప్పి అమరేంద్ర తన పనిలో నిమగ్నమయ్యేడు.

అతడేం చెప్పినా అది మిలట్రీ ఆర్డర్లా పాటించి తీరాలి. అంధుకే వింధ్యను వెళ్లమనగానే అక్కడనుండి నిశ్శబ్దంగా వెళ్లిపోయింది.

గదిలో టేబుల్ మీదున్న ఫోటో ఫ్రేమ్‌లో బాబు చిన్నప్పటి ఫోటో తీసుకుని మంచంమీద వాలింది. మెరిసే ఆ కళ్లు, కల్మష మెరుగని చిర్నవ్వు, నవ్వినప్పుడు బుగ్గలమీద కన్పించే చిరునొక్కులతో బాబు ఫోటో ఎంత చూసినా తనివితీరదు. వాడి ఫోటోను తమకంగా గుండెలకత్తుకుంది.

"తనలాంటి దురదృష్టవంతురాలెక్కడా ఉండదు" చెమ్మగిల్లిన కళ్లను భారంగా మూసుకుంది.

ఇంతలో పోర్టికోలో నుండి కారు స్టార్టు చేసిన శబ్దం, ఆ వెనుకే గేటుకు తాళం పెడుతున్న చప్పుడు విన్పించింది. ఈ సమయంలో అతడెక్కడికి వెడతాడో వింధ్యకు తెలుసు. అతడికి వాళ్ల దూరపు బంధువు, మరదల వరసైన మణితో సంబంధముందన్న సంగతి పెళ్లయిన కొద్దిరోజులకే తెలిసిపోయింది.

"ఆమె అంటే అంత అభిమానమున్నప్పుడు శారీరక సంబంధం పెట్టుకుని కూడా నన్నెందుకు పెళ్లి చేసుకున్నారు! ఇద్దరి ఆడవాళ్ల బతుకులు మీవల్ల నాశనమయ్యేయన్న జ్ఞానమైనా మీకు లేకపోయిందా? " తీవ్రస్వరంతో నిలదీసింది.

"ష్, అనవసరంగా వీధిలో పడకు. ఎవడినో ప్రేమించి కడుపు తెచ్చుకోకముందు నువ్వు 'బావా నువ్వే కావాలం'టూ ఎప్పుడూ నా వెంటపడలేదు. 'అల్లుడూ' అంటూ మీ బాబు కూడా ఇప్పటిలా నోరారా పిల్చిన పాపాన పోలేదు. ఎందుకని? నేను మీలా డబ్బున్నవాడినికాను కాబట్టి. మా ఇంటికి రావాలన్నా మేము మీ బంధువులమని చెప్పుకోవాలన్నా మీకు నామోషీ. ఏదన్నా ఇబ్బందుల్లో పడి మీ ఇంటికి డబ్బు అవసరమై అమ్మ నన్ను పంపితే నన్నెంత పురుగులా చూసేదానివో, ఆ చూపులు నా గుండెనెలా తూట్లు పొడిచేవో నాకు బాగా గుర్తు. మీ మానమర్యాదలు మట్టి కలిసేక ఎవరో తిన్న ఎంగిలికూడులాంటి నిన్ను వదల్చుకోటానికి ఎరలా మీ బాబుకు నేను దొరికేను... ఇప్పుడు నా చేతికి చిక్కేవురా మావా అని నీ గురించి అంతా తెలిసి కూడా నిన్ను పెళ్లి చేసుకున్నది నీ అందచందాలు చూసి కాదు. కేవలం నీ వెనకున్న డబ్బుకోసమే. నిన్నిలా ఏదోక నాడు నేనే చేసుకోవాల్సొస్తుందని నాకు ముందుగా తెలియదు కాబట్టి మరదలుకదా అని దానిమీద మనసు పడ్డాను. బావనేకదా అని అది మరీ తొందరపడింది. నిన్ను చేసుకున్నానుకదా అని దాన్నొదిలెయ్యమంటే ఎలా? దాని మానాన అది ఉంటుంది. నీ మానాన నువ్వుండు. పెళ్లికిముందే నువ్వెవడ్నో ప్రేమించి ఓ బిడ్డను కన్నావని తెలిసీ విశాలహృదయంతో నీతో గుట్టుగా కాపురం చెయ్యట్లేదా. అలాగే నువ్వు అల్లరి పడకుండా నీ మర్యాద దక్కించుకో. నిజం చెప్పాల్సొస్తే నీకన్నా అదంటేనే నాకిష్టం. ఎందుకంటే కృష్ణుడికి రాధలా ప్రేమలో ఉండే మజా, సుఖం మొదట రుచి చూపిందదే"

అంత నిష్కర్షగా చెప్పేక కూడా మణి గురించి ఇంకెలా నిలదియ్యగలదు? అందుకే ఆ విషయంలో రాజీపడిపోయింది వింధ్య. అదామెకు అతడి చేతిలో మొదటి ఓటమి.

పెళ్లయిన సంవత్సరంలోనే వింధ్య నెల తప్పింది. అదే సమయంలో మణి కూడా ప్రెగ్నెంటని తెలిసింది. వింధ్యకు పుట్టింటి వారు సీమంతం వేడుకలు ఘనంగానే జరిపేరు. డెలివరీ మరో పదిహేను రోజులకొ

స్తుందనగా ముందే హాస్పిటల్లో జాయిన్ చేశారు. ఆ తరువాతే తెలిసింది మణి కూడా అదే హాస్పిటల్లో మరో రూమ్‌లో జాయినయిందని.

మణికంటే ముందే వింధ్యకు డెలివరీ అయ్యింది. నార్మల్ డెలివరీ, బాబు పుట్టేడు. తెల్లగా, బొద్దుగా ఉన్న బాబును చూసి మురిసిపోయింది వింధ్య. తనకిది రెండో కాన్పే అయినా మాతృత్వం అనే పదానికి అర్థం తెలిసింది వీడి పుట్టుకతోనే. ముడిచిన వాడి చిన్నారి పిడికిళ్లు ఎన్నిసార్లు మృదువుగా తాకిందో ఆమెకే తెలియదు.

వింధ్యకు బాబు పుట్టి వారం రోజులయ్యేక మణికి డెలివరీ అయ్యింది. మామూలుగా కాదు సిజేరియన్ చేసి మృత శిశువును బయటకు తీశారు. విషయం విని 'అయ్యో పాపం దురదృష్టవంతురాలు' అనుకుంది. కానీ దురదృష్టమంతా తనదేనని ఓ గంటలోనే తేలిపోయింది.

అమరేంద్ర తన రూమ్‌కొచ్చి ఉయ్యాల్లో ఉన్న బాబును తీసికెడుతుంటే "వాడినెక్కడికి తీసుకెడుతున్నారు? " ఆందోళనగా అడిగింది.

"మణికి స్పృహ వచ్చేక పుట్టిన బిడ్డ ఎవరు, ఏడి అనడిగితే ఏం చెప్పను. విషయం విని అది తట్టుకోలేదు. అందుకే వీడినే మణికి పుట్టిన బిడ్డగా చూపెడదామని"

"ఆ తరువాతయినా నిజం చెప్పాలిగదా! అప్పుడు మాత్రం షాక్ తినదా"

"ఆ నిజం ఎప్పటికీ చెప్పదల్చుకోలేదు" అమరేంద్ర స్థిరంగా అన్నాడు.

"అంటే నా బిడ్డను నానుండి దూరం చేస్తారా! వద్దండీ వాడు లేనిదే నేను బతకలేను. నా బిడ్డను నాకిచ్చెయ్యండి" భోరుమంటూ భర్త కాళ్లమీద పడింది.

"నువ్వెంతేడ్చినా ప్రయోజనంలేదు. నేనెంత కసాయివాడినో నీకు తెలుసు. మణికి ఇటుపై బిడ్డలు పుట్టే అవకాశం లేదని డాక్టర్లు చెప్పారు. కావాలంటే నువ్వు మళ్లీ తల్లివి కావచ్చు. ఈ బిడ్డను మాత్రం మణి కొడుకుగానే పెరగనీ. వాడు పెరిగేది ఎక్కడో పరాయి ఇంటకాదుగా. ఎక్కడ పెరిగినా తండ్రిని నేనే" అన్నాడు అమరేంద్ర.

"ఇది చాలా అన్యాయం. లోకంలో ఎక్కడా ఇంత దారుణం ఉండదు. వద్దు నా బాబును నాకిచ్చెయ్యండి. వాడు లేందే నేను బతకలేను. కావాలంటే ఆమెకోసం మరో బిడ్డను మోసి జన్మనిస్తాను. ఈసారికి మాత్రం . వీడిని నానుండి లాక్కుని నాలో మాతృమమకారాన్ని క్రూరంగా చంపొద్దు. మీకు దండం పెడతాను" అతడి కాళ్లను తీగెలా పెనవేసుకుపోతూ అంది.

"అలాగేం, పెళ్లికాకుండా పుట్టిన అన్ లైసెన్స్‌డ్ ఛైల్డ్‌ని పెంటమీద పారేసినప్పుడేమయిందో ఈ మాతృమమకారం. వెధవ సెంటిమెంట్స్ వదిలిపెట్టి నోర్మూసుకుని పడుండు. లేకపోతే నేనెంతటి రాక్షసుడునో నీకు తెలుసుగా. ఒక్కొక్క మాటకు నీ గుండె తూట్లు పడుతుంది. ముచ్చటగా మూడోసారి కన్నబిడ్డను అల్లారు ముద్దుగా పెంచుదువులే. ఈసారి కూడా ఇంతే ప్రాప్తమని సరిపెట్టుకో" కాలితో ఆమెను దూరంగా నెట్టి బిడ్డను మణి ఉన్న రూమ్‌కు తీసికెళ్లిపోయాడు.

అది అతడి చేతిలో తను పొందిన రెండో ఓటమి.

ఒకసారి పరువు ప్రతిష్టల పేరుతో పెద్దలు, రెండోసారి కట్టుకున్న భర్త తనలో మాతృత్వాన్ని దారుణంగా ముక్కలు చేసేక వింధ్య మనసు శిలే అయ్యింది. మరో బిడ్డకు జన్మనిచ్చి ఆ ఊబిలో కూరుకుపోవాలనిపించలేదు. తననింత దారుణంగా ఓడించిన మనషులందరిమీదా కసితీర్చుకోవాలనుకుంది. అందుకే భర్తకు చెప్పకుండానే పుట్టింట ఉన్న కొద్ది రోజుల్లోను లాప్రోస్కోపిక్ చేయించుకుని తనలో తల్లిని చంపేసింది.

ఆ పని చేసింది ఎవరి మీదనో కసితీర్చుకోటమూకాదు, కక్షసాధించటమూ కాదని తను అమరేంద్ర చేతుల్లో పొందిన మూడో

పరాజయమని అతడు తనని స్వార్థంకోసం పెద్ద మనుషులకు తార్చడం ప్రారంభించిన తరువాత అర్థమయ్యింది.

ఆ రోజునుండీ బాబు మణికి పుట్టిన బిడ్డగానే పెరిగాడు. ఊళ్లోనే ఉంచిన బాబుకెప్పటికయినా విషయం తెలిసే అవకాశముంటుందని ఎక్కడో దూరంగా ఊటీలో ఉండే రెసిడెన్షియల్ స్కూల్లో జాయిన్‌చేశాడు అమరేంద్ర. వాడి అడ్రసుగాని, కనీసం హాస్టల్ ఫోన్ నెంబరుగాని వింధ్యకు తెలియకుండా అన్ని జాగ్రత్తలూ తీసుకున్నాడు. వాడికి హాలీడేస్ ఇచ్చినప్పుడు అమరేంద్ర, మణి కలిసి వాడిని మంచి మంచి ప్రదేశాలకు టూర్ తీసుకెళ్లి వాడితో జాలీగా గడిపి తిరిగొస్తారు. వాడినెప్పుడూ ఫొటోలో చూసుకుని మురిసిపోటం తప్ప నేనే నీ అమ్మనని చెప్పే అవకాశమే ఆమెకివ్వలేదు.

తన జీవితంలో చేదు అనుభవాలు తవ్వుకుంటూ వెడితే తన మీద తనకే పుట్టెడు జాలికలుగుతుంది. "కన్నెపిల్ల కాలుజారకూడదని పెద్దలెందుకు పదేపదే హెచ్చరిస్తారో ఎదిగిన ఆడపిల్లకు ఇన్ని ఆంక్షలెందుకు విధిస్తారో జీవిత చిత్రంమీద రంగులొలికి రూపం మారిపోయేకగాని అర్థం కాలేదు. అంతా తెలిసొచ్చేసరికి జీవన కలశం చేజారి పగిలి ముక్కలయింది. ఇప్పుడిక ఏముంది? శిథిలశిల్పంలా, శాపగ్రస్తలా శూన్యహృదయంతో మిగిలింది.

ఆలోచనలతో అలిసిన వింధ్య బరువుగా కళ్లు మూసుకుంది. మూసిన కళ్లనుండి పక్కలకు జారిన అశ్రుధారలు ఆమె గుండెను తేలిక చేశాయి.

★ ★ ★

మంగళను కలుసుకుని వచ్చిన రోజు రాత్రి మిన్ను అసలు నిద్రపోలేదు. ఆ ఆగంతకులు శ్యామ్‌కు, మంగళకు మధ్య ఉన్న పరిచయాన్ని తెలుసుకుని మంగళ ఇంటికి వెళ్లగలిగారంటే వాళ్లు అసాధ్యులైయుంటారు. ఆమె గురించి తెలుసుకోగల్గినవాళ్లకు తన గురించి తెలుసుకోటం పెద్ద కష్టం కాదు. మంగళ ఇంట్లో చొరబడి దేనికోసం వెదికారో అది తన దగ్గరుందని తెలిస్తే తనసలు బతకనివ్వరు. లేదు నాకు చావాలని లేదు. ఓ ఇంటికి ఇల్లాలిగా, నలుగురు బిడ్డలకు తల్లిగా నా అన్నవాళ్ల రాగబంధాల మధ్య నిండుగా బతకాలనుంది. తన పుట్టుక సమాజానికి ప్రశ్నార్థకమైనా దానికి జవాబుగా తనదనే సంసారాన్ని ఏర్పాటు చేసుకోవాలన్న ఆశ పడుతోంది. ఆ ఆశ నెరవేరకుండానే అర్థాంతరంగా తనకు చావాలని లేదు. ఏదో ఒక ఆలోచన చెయ్యాలి. ఈ సమస్యల వలయం నుండి బయటపడాలి. ఎలా? ఎలా?

మిన్ను ఆలోచిస్తుండగానే తలుపు తట్టిన శబ్దమయింది. గుండెదడదడలాడింది. నాలుగైదుసార్లు అదే పనిగా తలుపు తడుతుంటే ఇక ఉండబట్టలేక "ఎవరూ? " తగ్గు స్వరంతో అడిగింది.

"నేను నందూని" ఆనంద్ స్వరం వినగానే లేచి వెళ్లి తలుపు తీసి "ఏం మహాశయా ఈ టయిమప్పుడు ఏం పనుందని తలుపులు విరగ్గొడుతున్నావు? " పరిహాసంగా అడిగింది.

"తలపోటు దంచేస్తోంది. కాస్త జ్వరం కూడా తగిలినట్టుంది. టాబ్లెట్టేదన్నా ఉంటే ఇస్తావేమోనని తలుపు తట్టేను. నీకు నిద్రాభంగం కలిగించినందుకు..." వణుకుతున్న స్వరంతో అన్నాడు ఆనంద్.

మిన్ను నుదురు తాకిచూసింది. చాలా వేడిగా తగిలింది. "అరె కొంచెం జ్వరమంటావేంటి. జ్వరం ఎక్కువగానే ఉంది. వెళ్లి నీ రూమ్‌లో పడుకో టాబ్లెట్స్ అల్మారాలో ఉం.ాలి. వెదికి తెస్తాను" అంటూ అతడ్ని పంపేసి టాబ్లెట్ వెదికి, దానితోపాటు అమృతాంజనం కూడా తీసుకుని నందూగదికి వెళ్లింది.

గ్లాసుతో నీళ్లు, టాబ్లెట్ ఇస్తూ "లేముందీ టాబ్లెట్ వేసుకో. అసలు భోజనం

చేశావాలేదా? " అడిగింది.

"లేదు, ఆఫీసునుండి వచ్చేటప్పుడే కాస్త తలనొప్పి, ఒళ్లు వెచ్చగా ఉన్నట్టనిపించింది. అన్నం తినాలనిపించక వంటచెయ్యనేలేదు. టీ పెట్టుకుని తాగిపడుకున్నాను. అదే తగ్గిపోతుందనుకున్నానుగాని అంతకంతకు హెడేక్ ఎక్కువవటంతో నిన్ను నిద్రలేపాను" అన్నాడు.

"మంచిపనే చేశావు. ఒక్కచోట ఉంటున్నపుడు ఆపాటి సాయం చేసుకోటం తప్పనిసరి. ఏదీ సరిగా పడుకో అమృతాంజనం తలకు పట్టిస్తాను" అని సీసామూత తెరుస్తుంటే "వద్దు మిన్నూ నీకెందుకు శ్రమ. ఆ సీసా ఇలా ఇచ్చి నువ్వెళ్లిపడుకో. నేను చూసుకుంటాలే" చలికి దుప్పటికప్పుకుంటూ అన్నాడు.

"నేను నిన్ను ముట్టుకున్నంత మాత్రాన నీ బ్రహ్మచర్యానికిగాని, నా పాతివ్రత్యానికిగాని ఇంచుకకూడా భంగం వాటిల్లదుగాని కళ్లు మూసుకుపడుకో" ఆర్డరువేసి అతడి నుదుటికి అమృతాంజనం రాసి తల ఒత్తుతూ కూర్చుంది.

అతడు నిద్రలోకి జారేక తలుపు దగ్గరగా వేసి తన గదికి వెళ్లిపోయింది మిన్ను. నైట్ బల్బ్ కాంతిలో పైకప్పు దూలానికి, గోడకు మధ్య పిచ్చుక గూడువంకే భయంభయంగా చూస్తోంది. ఆర్నెల్లకిందట ఆడపిచ్చుక ఎంతో శ్రమపడి గడ్డి, పీచు ఏరి తెచ్చి ఆ ఖాళీ ప్రదేశంలో గూడుకట్టుకుంది. గుడ్లు పెట్టి పొదిగిన రెండు పిల్లల్ని రెక్కలొచ్చేవరకు వెంట తిప్పుకుంటూ తనతో పాటు వాటికి కడుపునింపేది. అవి కిచకిచమంటూ ఎంత గోలచేసినా మిన్నూకి విసుగనిపించేదికాదు. చిన్నచిన్న గింజలను ముక్కుతో ఏరితెచ్చి తల్లిపిచ్చుక బిడ్డల నోటికందిస్తుంటే ఆ దృశ్యాన్ని ఎంతో అపురూపంగా చూస్తూ కిటికీ దగ్గరే నిలబడేది. పూర్తిగా వాటికి రెక్కలొచ్చి అవి స్వతంత్రులయ్యాక ఎక్కడికో ఎగిరిపోయాయి. తమ దారి తాము చూసుకున్నాయి. తల్లి పిచ్చుకకు కూడా ఇక గూడు అవసరంలేకపోటంతో అదీ ఎగిరిపోయింది. ఆ గూడే తనకిప్పుడు శరణ్యమయింది.

ఆరాత్రి... శ్యామ్ మరణించకముందు రాత్రి దాదాపు పన్నెండయ్యింటుంది. ఎవరో తలుపు తట్టినశబ్దం విని ఆనందనుకొని వచ్చి తలుపు తీసి చూస్తే ఎదురుగా శ్యామ్ నిలబడి వున్నాడు. తలుపు తియ్యగానే చటుక్కున తనను నెట్టుకుని లోపలికొచ్చి తలుపు గడియపెట్టి "ప్లీజ్ మిన్నూ ఆ లైటార్పెయ్యి" అన్నాడు. మూసిన తలుపుకు చేరబడి అతడు ఆయాసపడుతూ తడబడుతూ భయంగా మాట్లాడ్డం చూస్తే మిన్నూకి ఏదో జరిగుంటుందని అర్థమయింది. వెంటనే లైటార్పి ముందు ఓ గ్లాసుడు మంచినీళ్లు తెచ్చిచ్చింది. గ్లాసందుకుని గడగడతాగేసి ఖర్చీఫ్‌తో నుదుటికి పట్టిన చెమటను తుడుచుకుని వచ్చి మంచంమీద అలసటగా వాలిపోయాడు.

ఐదు నిమిషాలకు అతడు రిలాక్సయ్యేక "ఇంత రాత్రివేళ ఇలా పరుగెత్తుకుంటూ రావలసిన అవసరమేముంది? దేని గురించి అంతగా ఆందోళన పడుతున్నావు" తగ్గుస్వరంతో అడిగింది.

"మిన్నూ నా గురించి నువ్వేమనుకుంటున్నావు? " అడిగాడు శ్యామ్.

"అన్నయ్య గురించి చెల్లెలు ఎప్పుడూ మంచిగానే ఆలోచిస్తుంది"

"కానీ ఈ అన్నయ్య తెలియకుండానే ముళ్ళతీగెలున్న కంచెమీద వెళ్ళిపడ్డాడు. ఆ ముళ్ళను విడిపించుకొని బయటపడలేక సతమతమవుతున్నాడు. భగవంతుడు నుదుట నన్ను జీవించమని రాసుంటే ఈ అన్నయ్య రేపట్నుంచి కొత్త జీవితం మొదలెడతాడు. లేదంటే నా జీవిత పుటల్లో ఇది చివరిరోజే అవుతుందనిపిస్తోంది"

"ప్లీజ్ అలా మాట్లాడకు" మిన్ను మందలింపుగా అంది.

"నాకు నా జీవితం గురించి భయంలేదు. కానీ... ఆ అమాయకురాలి గురించే నా బాధంతా. అనవసరంగా మంగళ బతుకును నా చేతుల్లోకి తీసుకున్నాను. నేనేమైనా అయితే మంగళను ఆదుకుంటానని మాటివ్వగలవా మిన్నూ" అడిగాడు.

"అబ్బబ్బ ఇలా మాటాడితే నా మీదొట్టు. మంగళ నీకు ప్రాణమైతే నాకు మాత్రం వదిన కాదా. ఆమె గురించి అప్పగింతలు మాని నిశ్చింతగా రూమ్‌కెళ్ళి పడుకో. లేదంటే ఈ రాత్రికి ఇక్కడే నిద్రపో" అంది.

"వద్దొద్దు. నేనిక్కడుండడం నీకు ప్రమాదం. ఎవర్నీ చిక్కుల్లో పడెయ్యడం నాకిష్టముండదు. అన్నట్టు నాకో హెల్ప్ చేయగలవా? "

"రిక్వెస్టు చెయ్యడంకాదు. నువ్వాజ్ఞాపించు నేనాచరిస్తాను" మిన్ను దృఢంగా అంది.

"ఇదిగో ఈ వస్తువు ఎవ్వరికంటా పడకుండా దాచాలి. నాకే ప్రమాదం జరగకుండా ఉంటే రెండురోజులు పోయాక నేనే వచ్చి తీసుకుంటాను. ఒకవేళ... నాకేదన్నా జరిగితే దాన్ని వెంటనే మాడ్చి మసిచెయ్యి. నీ దగ్గరమాత్రం ఉంచొద్దు" వణికే కంఠంతో చెప్తుంటే మిన్ను మనసు చలించిపోయింది.

"అన్నయ్యా అంతలా చెప్తున్నావంటే నువ్వెంత భయానక పరిస్థితుల్లో ఉన్నావో నాకర్థమయింది. నా మాట విని ఇప్పుడిక బయటకు వెళ్ళకు. పరిస్థితులు చక్కబడే వరకు ఇక్కడో నాల్రోజులుండు. నిన్నెవరికంటా పడకుండా చూసుకునే బాధ్యత నాది" మిన్ను అనునయంగా అంది.

"వద్దమ్మా! నేను వెళ్ళాలి. ముందిది ఎక్కడ దాస్తావో దాచు. ఎంత వెదికినా కన్పించకుండా జాగర్త చెయ్యగలగాలి" హెచ్చరించాడు.

"నీ మాట నీదేగానీ నా సలహా పాటించవన్నమాట" మిన్ను కోపంగా అంది.

"నీకు తెలియదమ్మా. నేను చెప్పినా నువ్వర్థం చేసుకోలేవు. ప్లీజ్ నన్ను వెళ్ళనీ. దీని విషయం మాత్రం ఎవరికీ, ఎప్పుడూ చెప్పొద్దు. ఇది నీ దగ్గరున్న విషయమే మరిచిపో. జాగర్త" హెచ్చరించి చప్పుడు కాకుండా తలుపు తీసుకుని చీకట్లో కలిసిపోయాడు మేఘశ్యామ్.

అతడు వెళ్ళాక "దీన్నెక్కడ దాచాలా అని గదంతా అంగుళం అంగుళం పరిశీలించి చూస్తే పిచ్చుకగూడు కన్పించింది. పాతగుడ్డలో దాన్ని భద్రంగా చుట్టి ఆ గూడులోనే దాచింది.

శ్యామ్ భయపడినట్టే ఆ రాత్రే అతడికి చివరి రాత్రయింది.

రాత్రంతా ఆలోచనల్తో నిద్ర లేకపోవడంతో ఉదయం మిన్ను ఆలస్యంగా నిద్రలేచింది. ఆనంద్‌కు రాత్రి జ్వరం వచ్చిందన్న విషయం గుర్తు రాగానే ముందు నందూ రూమ్‌కెళ్ళింది. అప్పటికే అతడు మంచం మీద కూర్చుని కాఫీ తాగుతున్నాడు.

"నందూ ఇప్పుడెలా ఉంది? జ్వరం తగ్గిందా లేదా? " అడిగింది.

"దేవతల చెయ్యిపడ్డాక జ్వరం పారిపోకుండా ఉంటుందా. నాకిప్పుడు కాస్త తేలిగ్గానే ఉంది. ఇప్పుడే నిద్రలేచినట్టున్నావు ముఖం కడుక్కురా. ఫ్లాస్కులో నీకోసం కాఫీ ఉంచేను వచ్చి తాగు" అన్నాడు.

"సారీ త్వరగా లేవలేకపోయాను. వంట నువ్వు చేసుకోలేవుగాని ఈ పూటకు మనిద్దరికీ నేనే వండుతాలే. ఈ రోజుకి సి.ఎల్ పెట్టి రెస్టు తీసుకోటం మంచిది" చెప్పి వెళ్ళిపోయింది మిన్ను.

బ్రష్ చేసుకొచ్చి ఫ్లాస్కులో ఉన్న కాఫీ గ్లాసులో ఎంచి అతడికెదురుగా కూర్చుని తాగుతుంటే ఆనంద్ రెప్పవెయ్యటం మరిచినట్టే ఆమెను చూస్తుండడం గమనించి కాస్త ఇబ్బందిగా కదుల్తూ "ఏమిటలా చూస్తున్నావు నా ముఖంలో ఏముందేవిటి? " అంది పరిహాసంగా.

"మిన్నూ ఐ లైక్ యూ"

"ఆహా!"

"ఐ లవ్‌యు"

"ఇంకా"

"అలా జోక్‌గా తీసుకోకు మిన్నూ. నన్నెందుకు అర్థం చేసుకునే ప్రయత్నం చెయ్యవు. నీకో విషయం తెలుసా"

"చెప్పు, నాకు తెలియనిదయితే తెలుసుకుంటాను" అంది.

"ఎవరైనాసరే తను ప్రేమించిన వారి కంటే తనను ప్రేమించే వారిని చేసుకుంటే జీవితం సుఖంగా సాగుతుందట. నీకా విషయం తెలుసా" అన్నాడు.

"ఇప్పుడు చెప్పేవుగా తెలిసిందిలే"

"మిన్నూ నా గురించి అన్ని విషయాలు నీకు తెలుసు. ప్రస్తుతం మూడువేల వరకు జీతం వస్తోంది. ఫ్యూచర్లో ఇంకా పెరిగే అవకాశముంది. మా ఊళ్లో రెండెకరాల తోట, ఇల్లు అన్నీ ఉన్నాయి. నిన్ను చేసుకోటానికి ఈ అర్హతలు చాలవా? " అడిగాడు.

"అర్హత గురించి చెప్పాల్సొస్తే నీకేవిధంగానూ నేను తగను నందూ. ఎందుకంటే బోలెడు కట్నకానుకలు పోస్తేనేగాని ఆడపిల్లకు పెళ్లికాని రోజులివి. నాకు పెద్దగా ఛదువులేదు. నాఅన్న దిక్కులేని అనాథను. నాలాంటి దాన్ని చేసుకుంటే జీవితాంతం నా మంచిచెడ్డలు ఆ మగాడే భరించాలి కాబట్టి నేనో పెద్ద గుదిబండలాంటి దాన్ని. నాకేవిధమైన అర్హతలూలేవు"

"ఆ విషయం వదిలెయ్యి. రాత్రి నాకు ఒంట్లో బాగలేదని తెలిసి చాలా కంగారుపడ్డావు. నేనొద్దన్నా వినకుండా సర్వీసు చేశావు. అలా చేసింది ప్రేమతోనా, నా మీద సానుభూతితోనా? "

ఆనంద్ ఈ రోజు అటోఇటో తేల్చెయ్యాలనుకుంటున్నాడని మిన్నుకి అర్థమయింది.

"రెండూ కాదు, నువ్వంటే నా మనసులో మంచి అభిప్రాయముంది, అభిమానమూ ఉంది. అందుకే నీకు జ్వరం రాగానే కంగారుపడ్డాను. ఈ కబుర్లకేంగాని ముందు నన్నెళ్లి వంట ప్రయత్నం చేసుకోనియ్యి మహానుభావా. ఇప్పటికే చాలా టయిమయింద"ని చెప్పి అక్కడనుండి వెళ్లిపోయింది మిన్ను.

మిన్ను తెలివికి నవ్వొచ్చింది ఆనంద్‌కు. కర్ర విరగనివ్వదు, పాముని చావనివ్వదు. అతి తెలివి. నిజంగా ఆమెను పొందకుంటే జీవితమే శూన్యం. ఆ నవ్వులో ఎన్ని మల్లెలు విరుస్తాయో. ఆ కళ్లల్లో మెరుపులు పురుష హృదయాన్ని బందీని చేస్తాయి. ఆమెను భార్యగా పొందటమంటే అదృష్టమనే చెప్పాలి. ఆ అదృష్టాన్ని తను దక్కించుకోగలడా... ఆనంద్ పడకమీద వాలి ఆలోచనల్లో తేలిపోయాడు.

★ ★ ★

సాయంత్రం స్టిచింగ్ సెంటర్ నుండి మిన్ను బయటికొచ్చేసరికి అప్పటికే ఓ పక్క నుండి ఆకాశంలో మబ్బు ముంచుకుంటూ వస్తోంది. స్టాపులో నిలబడి బస్‌కోసం వెయిట్ చేసేకంటే కాస్త దూరం నడిచి అంతగా వర్షంవస్తే ఆటో ఎక్కెయ్యటమే మంచిదనుకుని కాస్త స్పీడుగా నడుస్తోంది మిన్ను.

చూస్తుండగానే కారుమొయిలు కమ్ముకుని అప్పటికప్పుడే చీకట్లు ముసురుకున్నాయా అనిపించేలా వాతావరణం మారిపోయింది. ఫుట్‌పాత్‌మీద హడావుడిగా నడిచి వెడుతున్న మిన్ను తనకు కొంచెం దూరంలో అంబాసిడర్ ఆగటం, అందులోనుండి ఓ వ్యక్తి కిందకు దిగి "మిన్నూ" అని పిలవటంతో చటుక్కున ఆగి ఆ అపరిచిత వ్యక్తి వైపు చూసింది.

"మిన్నూ అంటే నువ్వే కదూ? " అడిగాడు.

"అవును, నా పేరు మీకెలా తెలుసు? " అడిగింది అనుమానంగా.

"తెలుసు, శ్యామ్ ఈమధ్య గీసిన బొమ్మలకు మోడల్‌వి నువ్వేనని కూడా తెలుసు"

శ్యామ్ ప్రసక్తిరాగానే మిన్ను ముఖం భయంతో పాలిపోయింది. "నన్నెందుకు

పిల్చారో తెలుసుకోవచ్చా" అడిగింది. అత డికి ఏభయ్ ఏళ్లుంటాయి. శిల్కులాల్చీ మెళ్లో గోల్డ్ చైన్, కళ్లకు రేబాన్ గాగుల్సుతో చాలా పెద్దమనిషి తరహాలానే కన్పి స్తున్నాడు.

"ముందుగా నీకో విషయం చెప్పాలి. శ్యామ్ నాకు ఆప్తుడు, స్నేహితుడు కాబట్టి నా గురించి నువ్వు భయపడనవసరంలేదు"

"మీ గురించి నేనెందుకు భయపడాలి. భయపడాల్సిన అవసరం కూడా లేదు. మీరు చెప్పదల్చుకున్నదేమిటో త్వరగా చెప్పండి. వర్షం వచ్చేలా ఉంది" మిన్ను నిబ్బరాన్ని ప్రదర్శించింది.

"శ్యామ్ చనిపోయిన సంగతి నీకూ తెలుసుగా"

"తెలుసు, ఆయనకేం బాధలున్నాయో క్షణికావేశంతో ప్రాణాలు తీసుకున్నాడు. పూర్ ఫెలో" సానుభూతిగా అంది.

"అది సూయిసైడనే అనుకుంటున్నావా? "

"ఉరిపోసుకోటమంటే ఆత్మహత్యేకదా! పోలీసులే అలా నిర్ధారించేక మరోలా ఎలా అనుకుంటాం. పాపం మనసులో ఏ బాధలు దాచుకున్నాడో ఏమో ఒక్క మాటయినా పెదవి విప్పి చెప్పలేదు"

మిన్ను సానుభూతిగా అంటుంటే ఆ పెద్దమనిషి విషయం ఎలా నరుక్కురావాలో తెలియక తికమకపడుతూ "గట్టిపించమే" అనుకున్నాడు.

అతడేదో ఆలోచిస్తున్నట్టు నిలబడ్డం చూసి "ఇంతకీ మీరేం చెప్పదల్చుకున్నారో త్వరగా చెప్పేస్తే నేనింటికి వెడతాను" త్వర పెట్టింది.

"శ్యామ్ చనిపోయిన రాత్రి మీ ఇంటికొచ్చేడుకదూ? "

"మా ఇంటికా అతడికెప్పుడూ మా ఇంటికొచ్చే అవసరం రాలేదు. నేను ఆయన వేసే చిత్రాలకు మోడల్ గా పనిచేసినా ఎప్పుడూ ఆయన రూమ్ కే వెళ్లేదాన్ని. తిరిగొచ్చేటప్పుడు మళ్లీ ఎప్పుడు రావాలో అతడే చెప్పేవాడు. ఆ టయిముకు నేనతడి రూమ్ కు వెళ్లేదాన్ని" చెప్పింది.

"బాగా గుర్తు తెచ్చుకో. ఆ రాత్రి శ్యామ్ నువ్వుంటున్న ఏరియాకి వచ్చినట్టు కన్ ఫర్మ్ డ్ గా తెలిసింది. ఆ పరిసరాల్లో నువ్వు తప్ప శ్యామ్ కు పరిచయస్థులెవరూ లేరని కూడా తేలింది. అతడు నీ దగ్గరకే వచ్చుండాలి"

"మన్నించండి. అతడొస్తే చెప్పటానికి నాకు భయమెందుకు. శ్యామ్ కు స్నేహితులైన మీరు నాకు మాత్రం ఆప్తులుకారా. శ్యామ్ ను నేను ఓ సోదరుడిలా భావించాను. అతడు కూడా నన్ను తోడబుట్టిన చెల్లిలా ఆదరించేవాడు. అతడి గురించి నా దగ్గరే చిన్న సమాచారమున్నా దాచాల్సిన అవసరంలేదు. నేను నిజమే చెప్తున్నాను. శ్యామ్ చనిపోయిన సంగతి మరో రెండు రోజులకుగాని నాకు తెలియలేదు. ఆ విషయం ఇంటి ఓనరు జయరాంగారు చెప్తున్నప్పుడు నేను షాక్ తిన్నాను. ఆ షాక్ నుండి తేరుకోటానికి ఓ వారం రోజుల పట్టింది" మిన్ను చెప్తుంటే ఆమె గుండెలోతుల్లో దాగిన రహస్యాలు వెలికి తీస్తున్నవాడిలా ఎక్స్ రేలాంటి చూపులు చూస్తూ "ఈ విషయంలో నీనుండి ఏదో అడిగి సమాధానం రాబట్టాలనుకోటం పిచ్చి ప్రయత్నమని నాకర్థమైంది. శ్యామ్ ఒక ఆర్టిస్టు. అంతవరకే నీకు తెలుసు. అతడి వ్యక్తిగత జీవితంలో ముడిపడి ఉన్న రహస్యాలన్నీ నాకు తెలుసు కాబట్టి ఓ విషయం ముందుగా నేన్నీకు చెప్పాలి. ఇది హెచ్చరికలాంటిదే. శ్యామ్ ఆ రాత్రి చివరగా నిన్ను కలిసి తన దగ్గరున్న కెమేరాగాని ఫొటో రీలు గాని దాచమని నీకిచ్చి ఉండాలి. ఆ రెంటిలో ఏది నీ దగ్గరున్నా నాకప్పగించటం వల్ల నీకు మేలే జరుగుతుంది. అందుకు శ్యామ్ కు లక్ష రూపాయలివ్వటానికి మామధ్య డీల్ జరిగింది. అది నాకందకముందే అతడి నోరు శాశ్వతంగా మూసి ఆ రహస్యాన్ని సమాధి చేసేశారు. శ్యామ్

ఇచ్చిన వస్తువు నాకప్పగిస్తే నీకిప్పుడే ఏభైవేలకు చెక్కు రాసిస్తాను. శ్యామ్‌ను చంపిన వాళ్లు కూడా దానికోసమే అన్వేషిస్తున్నారు. వాళ్ల దృష్టిలో పడ్డావా డబ్బు రావటం మాటెలా ఉన్నా నీ ప్రాణానికే ప్రమాదం ముంచుకొచ్చినట్టే. ఎందుకో నువ్వు నన్ను నమ్మలేకపోతున్నావని అర్థమయింది. ఇంటికెళ్లి బాగా ఆలోచించు. ఏ నిర్ణయం తీసుకున్నా అవసరమనుకుంటే ఈ అడ్రసు కొచ్చి నన్ను కలుసుకో". జేబులో నుండి విజిటింగ్ కార్డు తీసి మిన్ను చేతిలోపెట్టి "ఒక్క విషయం మర్చిపోవద్దు. నేనెప్పుడూ నీ శ్రేయోభిలాషినే. నానుండి నీకెటువంటి రిస్క్ ఉండదు. ప్లీజ్ బిలీవ్ మి" చెప్పి కారు స్టార్టు చేసి వెళ్లిపోయాడతడు.

మిన్ను హృదయంలో మంచుగడ్డలు పేలినట్టు చల్లబడిపోయింది. యాంత్రికంగా ఆ కార్డును హేండ్‌బ్యాగ్‌లో పడేసి నెమ్మదిగా నడకసాగించింది. నడుస్తోందేగాని పరిసరాలను పట్టించుకోకుండా తీవ్రంగా ఆలోచిస్తూనే ఉంది.

మంగళ ఇంటికి వెళ్లినవాళ్లు, ఇప్పుడు తనతో మాట్లాడి వెళ్లిన పెద్దమనిషి ఒకే వర్గం వాళ్లు కాదని మిన్నుకి అర్థమయింది. రెండు వర్గాలవాళ్లు ఒకరికొకరు ప్రత్యర్థులని, ఇద్దరూ వెదికేది ఆ ఫొటోరీలు కోసమేనని అర్థమవుతోంది. అయితే ఒక్కటే తేడా. దానికోసం ఒకరు ప్రాణాలు తీస్తున్నారు, మరొకరు కాసులు కురిపిస్తామంటున్నారు. ఇంతకీ అందులో ఏముంది? ఆలోచనల్లో నడుస్తున్న మిన్నుకు వర్షం పడుతోందన్న స్పృహేలేదు. చిన్నచిన్న తుంపరతో మొదలైన వర్షం క్షణాల్లో పెద్దదై కుండపోతగా కురవటంతో చటుక్కున పక్కగా ఉన్న బిల్డింగు వరండాలోకి పరుగెత్తింది.

అప్పటికే బట్టలు, తల చాలావరకు తడిసిపోయాయి. వర్షంతోపాటు వీస్తున్న గాలికి తడిసిన ఆమె శరీరం చలికి సన్నగా వణుకుతోంది. చేతులు రెండూ గుండెల దగ్గరగా ముడిచి, పోర్టికోలో ఉన్న స్తంభాన్నానుకుని పడుతున్న వర్షపు ధారను తదేకంగా చూస్తోంది. యాంత్రికంగా చూస్తోందే తప్ప మన సంతా ఇంతకు ముందు తనను కలిసిన పెద్దమనిషి చుట్టూ తిరుగుతోంది.



హాల్లో మేనమామకెదురుగా కూర్చుని వీక్లీ తిరగేస్తున్నాడు చిన్నీ. బయట వాతావరణం క్లౌడీగా ఉండడంతో చాలా బద్ధకంగానూ ఉంది, మనసుకు ఆహ్లాదంగానూ ఉంది. అప్పుడే ఆయా వచ్చి ఇరువురి మధ్య టీకప్పులున్న ట్రే ఉంచి "తీసుకోండి, చల్లారిపోతుంది" హెచ్చరించి మరీ వెళ్లింది.

టీ తాగుతుండగా హాల్లో మూలగా ఉన్న ఫోన్ మోగటంతో శివప్రకాష్ లేచి వెళ్లి రిసీవరందుకున్నాడు.

"హలో! నేనే శివప్రకాష్‌ను"

"..."

"వింధ్యా ఎక్కడనుండి మాట్లాడుతున్నావు?"

"..."

ఐసీ ఏమిటి విషయం?"

"..."

"ఈజిట్!ఎక్కడ? ఎక్కడ చూసేవో సరిగా చెప్పు" శివప్రకాష్ కంఠంలో ఒణుకో, ఆనందమో, ఆదుర్దాయో చిన్నీకి అర్థంకా లేదు. మేనమామ మాట్లాడుతుంటే మరింత ఆసక్తిగా వినసాగాడు.

"రెస్టారెంట్ కెదురుగా ఉన్న ఫుట్‌పాత్ మీదనా"

"..."

"ఓకే. క్షణాల్లో అక్కడుంటాను. అంతవ రకు నువ్వు ఎక్కడికీ వెళ్లకుండా ఆపే ప్రయత్నం చెయ్యకూడదూ"

"..."

"సరే సరే... నీ పరిస్థితి నాకు తెలిసిం దేగా. నేనే వచ్చేస్తున్నా" ఫోన్ పెట్టేసి చిన్నీతో ఒక్క మాటయినా చెప్పకుండా హడావుడిగా బయటకు పరుగుపెట్టినట్టే వెళ్లి పోర్టికోలో ఉన్న కారు తీసి స్టార్టు చేసు కుంటూ వెడుతున్న మేనమామను చూస్తుంటే చిన్నీ నిశ్చేష్టుడయ్యాడు.

"ఏమయ్యుంటుంది? వింధ్య ఆంటీ చెప్పిన విషయం వింటూనే మామయ్య ఎందుకంత ఎక్సయిటయ్యారు" చిన్నీ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఆయనిలా బయల్దేరగానే వర్షం మొదలవటం అది కొద్ది క్షణాల్లోనే కుంభవృష్టిలా మారటం జరిగిపోయింది.

ఇంతలో బయట్నుండి గాజుల శబ్దం విన్పించటంతో కారిడార్‌లోకొచ్చి తొంగి చూశాడు. ఎవరో అమ్మాయి గేటువైపు చూస్తూ అటువైపు నిలబడి ఉంది. వర్షంలో తడవడంవల్ల చలికి వణకుతుండడం చూస్తే అతడికి జాలేసింది. వర్షం కురుస్తున్న పద్ధతి చూస్తే ఇప్పట్లో తగ్గే సూచనలులేవు. చిన్నీ లోపలికివెళ్లి ఆయాను పిలిచి, "బయట పాపం ఎవరో అమ్మాయి వర్షంలో బాగా తడిసిపోయింది. లోపలికి పిలిచి తుడుచుకోటానికి టవలదీ ఇచ్చి హాల్లో కూర్చోబెట్టు. చలికి వణుకుతోందికాబట్టి నీక్కాస్త జాలిగా తోస్తే కాస్త వేడివేడిగా ఏదన్నా ఇవ్వు. నేను లోపలికి వెడతాను. ఇక్కడుండడం ఆ అమ్మాయికి ఇబ్బంది కలి గించొచ్చు" చెప్పి డ్రాయింగ్ రూమ్‌కు వెళ్లి పోయాడు చిన్నీ.

ఆయా బయటికొచ్చి పోర్టికోలో ఉన్న మిన్నూని చూసింది. "అయ్యో అక్కడే నిల చిపోయావు, లోపలికి రామ్మా" అంది.

"పరవాలేదండీ వర్షం తగ్గగానే వెళ్లిపో తాను" మోహమాటంగా అంది.

"వర్షం తగ్గగానే నేనే పంపించేస్తానుగాని అంతవరకు ఇలా లోపలికొచ్చి హాల్లో కూర్చో చలికి వణికిపోతున్నావు, పదపద" అంటూ ఇంచుమించు చెయ్యిపట్టి లాక్కెళ్లి నట్టే లోపలికి తీసుకెళ్లింది ఆయా.

"ఇదేం నిర్బంధంరా తండ్రీ" లోలోపల మూలుక్కుంటూనే అయిష్టంగా వెళ్లింది.

"ఇదిగో టవలు, ముందా తల తుడు చుకో. నువ్విలా సోఫాలో కూర్చుంటే నేను ఐదు నిమిషాల్లో టీ కలిపి తెస్తాను. ఇంతకీ నువ్వు టీ తాగుతావా కాఫీనా? " అడిగింది ఆయా.

"మీకెందుకండి శ్రమ" గొణిగింది మిన్ను.

"శ్రమాలేదు గిమాలేదు. నాడ్యూటీయే అది. అతిథుల్ని ఆదరించటం, దగ్గరుండి మంచి చెడులు చూసుకోటం. ఇందుకు భిన్నంగా జరిగితే ముందు నా ఉద్యోగం ఊడిపోతుంది. త్వరగా చెప్పెయ్యి నీకేం కావాలో"

ఆయా ధోరణి మిన్నుకి తమాషాగా అన్పించింది. 'ఈవిడేదో వింత ప్రాణిలా ఉంది. కమ్మటి కాఫీ ఇస్తానంటే వదులు కోటం దేనికి' అని మనసులోనే అనుకుని "మీ ఇష్టమండీ నాకేదన్నా పరవాలేదు" అంది పైకి.

"గుడ్... ఐదు నిమిషాల్లో వస్తాను. అంతవరకు ఈ సోఫాలో వచ్చి కూర్చో అన్నట్టు తల బాగా తడిసినట్టుంది తుడు చుకో. లేకపోతే జలుబు చేస్తుంది" ఓ

సలహా ఇచ్చి మరీ వెళ్లింది.

"చెప్పింది చెయ్యకుంటే బుర్ర తినే ఘటంలా ఉంది" మిన్ను లోలోపల విసుక్కుంటూనే జడవిప్పి తల తుడుచుకుంటూ కిటికీ దగ్గర నిలబడింది.

నిజంగానే ఐదు నిమిషాల్లో ప్లేటులో నాలుగు మిల్క్ బిస్కట్లు, కప్పుతో టీ పట్టుకొచ్చింది ఆయా. "అరె కూర్చోమంటే ఇంకా అక్కడే నిలబడ్డావేం" అంది.

"చీర తడిసిందిగా సోఫాలో కూర్చుంటే పాడవుతుందని" నసిగింది. ఆయా తన పొరపాటుకు నాలుక్కొరుక్కుంటూ "చీర తడిసిందన్న సంగతే మర్చిపోయాను. ముందీ బిస్కట్లు తిని, టీ తాగేసి ఒక్కసారి నాతోపాటు లోపలికిరా" అంది.

"దేనికండి? "

"చెప్పింది చెయ్యటమేగాని ప్రశ్నలెయ్యటం నాకు నచ్చదు" ఆయా అధికారికంగా అంటుంటే మిన్ను బెదురు బెదురుగా చూస్తూ "ఇది మెంటల్ కేసుకాదుకదా" అనుకుంది. డ్రాయింగ్ రూమ్‌లోనుండి వీళ్ల సంభాషణ వింటున్న చిన్నీకి ఆయా ఆ అపరిచిత మీద అలా పెత్తనం చెయ్యటం చూస్తే నవ్వుగా ఉంది. పూర్‌గాళ్ దురదృష్టంకొద్దీ ఈ రోజు మా ఆయా చేతిలోపడింది. బాడ్‌డే అనుకున్నాడు ఆమెను తల్చుకుని.

ఇంతకీ లోపలికి తీసికెళ్లి ఆయా చేసిన హడావుడేంలేదు. మిన్ను చీరమార్పించి తడిసిన చీరను గదిలో తిరుగుతున్న ఫ్యాన్‌కింద ఆరబెట్టింది. "ఇక ఇప్పుడు నువ్వు వర్షం తగ్గేవరకు హాల్లో సోఫాలో కూర్చో నాకు కిచెన్లో పనుంది" అంటూ మిన్నుని హాల్లో కూర్చోబెట్టి లోపలికెళ్లింది ఆయా. "అమ్మయ్య ఈ మహాతల్లి పోరు వదిలింది" హేండ్‌బేగ్ టేబుల్‌మీదపెట్టి మాగజైన్ను చేతిలోకి తీసుకుంది మిన్ను.

వర్షంతోపాటు ఉరుములు, మెరుపులు ప్రారంభమయ్యాయి. మెరుపు మెరిసినప్పుడల్లా మిన్ను భయంతో చెవులు మూసుకుంటోంది. ఉరిమితే పిడుగు పడుతుందేమోనని మిన్ను భయం. చిన్నతనం నుండీ ఆమెకాభయం పోలేదు. వర్షంవస్తే రామస్వామిని అంటిపెట్టుకునే ఉండేది. తండ్రి గుర్తు రాగానే మిన్ను మనసు బేలయిపోతుంది. భయంతో బిగుసుకుపోయిన తనను రెండు చేతులమధ్య తీసుకుని హృదయానికి దగ్గరగా చేర్చుకుని రక్షణనిచ్చేవాడు. పెట్టనికోటలాంటి ఆ రక్షణ ఇప్పుడు తనకేది? చెమ్మగిల్లిన కళ్లను ఒత్తుకుని డ్రాయింగ్ రూమ్‌వైపు చూసేసరికి ఎవరో యువకుడు గుమ్మందగ్గరే నిలబడి తనవంకే పరిశీలనగా చూడ్డం గమనించి మిన్ను తడబడింది. ఆరవిప్పిన పొడవైన కురులతో, తన విశాల నయనాలను మరింత విశాలం చేసి అతడివైపే చూసిన మిన్ను గతుక్కుమంది. ఆ గ్రే కలర్ ప్యాంట్ వాలా. ఒక్కసారి మిన్ను అతడినక్కడ చూస్తూనే మూగబొమ్మయిపోయింది. మనసంతా చేదు తిన్నట్టయింది. వర్షం వస్తున్నా సరే బయటకు వెళ్లిపోవాలన్నా కాళ్లెవరో కట్టేసినట్టయి చూపులు తిప్పేసుకుని అసహనంగా సోఫాలో కదిలింది. ఆమెను ఇట్టే గుర్తు పట్టేశాడు చిన్నీ. ఏమనుకున్నాడో ఆమెకెదురుగావచ్చి కూర్చున్నాడు. అతడికెదురుగా కూర్చోవాలంటే ముళ్లమీదున్నట్టే ఉంది. ఆయా వస్తే బావుండును అనుకుంది.

"హలో నేను గుర్తున్నానా? " చిన్నీ ప్రశ్నించాడు.

మిన్ను సమాధానం చెప్పలేదు.

"బహుశా గుర్తుండకపోవచ్చు ఉదయం లేచింది మొదలు నాలాంటివాళ్లనెందర్ని చూస్తారో ఏమో. అందరిలో నేను గుర్తుంటానంటే నమ్మకంలేదు. చిన్నీ మాటల్లో వ్యంగ్యం మిన్ను హృదయాన్ని సూటిగా తాకి గాయపర్చింది. 'ఇటువంటి మొరటు మనిషితో వాదించటంకంటే మవునం మంచిదనుకుంది'. అందుకే జవాబివ్వకుండా అయిష్టంగా ముఖం తిప్పుకుంది.



"అన్నట్టు శ్యామ్ ఆర్టిస్టు కదా అతడువేసే చిత్రాలకు మీరు మోడల్‌గా పనిచేసేవారను కుంటాను. గంటకు ఎంత పే చేసేవాడు?" అడిగాడు చిన్నీ.

ఉలికిపడింది మిన్ను. 'శ్యామ్ చిత్రాలకు తను మోడల్‌గా పనిచేసినట్టు ఇతడికెలా తెలిసింది. ఇప్పుడా ప్రసక్తిదేనికి. ఎటుపో తుందీ ధోరణి' మనసులో అలజడి మొదల యింది.

"నా ప్రశ్నకు మీరు జవాబివ్వలేదు"

"అది మీకనవసరమనుకుంటాను. అధిక ప్రసంగం చేసేవారంటే నాకసహ్యం" అంది పెడసరంగా.

"సారీ, మీరు నన్నపార్థం చేసుకున్నారు. శ్యామ్‌లానే నాలోను కళాపిపాసుంది. ఓ గంట నేను చెప్పిన భంగిమలో మీరు నా ఎదురుగా నిలబడితే నేను రెండు వేలి స్తాను. ఇది మీకు లాభకరమైన బేరమే కా బట్టి తప్పకుండా ఒప్పుకుంటారనే అనుకుం టాను" చిన్నీ అన్నాడు.

"ఒప్పుకోను"

"ఎందుకొప్పుకోరు. ఆ శ్యామ్‌కంటే నేనెం దులో తీసిపోయాను" అడిగాడు.

"ప్లీజ్ మాటిమాటికీ శ్యామ్ ప్రసక్తితెచ్చి అతడ్ని అగౌరవ పర్చకండి. శ్యామ్‌కు మీకు పోలికేమిటి. అతడు నిజమైన కళారాధ కుడు. మీ కళ్లల్లో పిపాస ఉంది తప్ప కళా పిపాస అన్నది మీ హృదయంలో పిసరంత యినా లేదు. నిజమైన కళారాధకుడు కళను వ్యాపార దృష్టితో చూడలేడు"

"సరే మీరన్నదే నిజమనుకుందాం. గంటకు రెండు వేలు పే చేస్తున్నప్పుడు మీకభ్యంతరం దేనికి. కళా హృదయమున్న వాడు కళతో వ్యాపారం చెయ్యకపోయినా వాళ్ల దగ్గర మీలాంటి అందమైన యువ తులు పనిచేసేది మాత్రం ఆ డబ్బుకోస మేగా" చిన్నీ మాటలకు మిన్ను మనసు

మండిపోయింది. కోపంతో కళ్లు ఎరుపెక్కాయి. పెల్లుబికే ఆగ్రహాన్ని పెదవిమధ్యే నొక్కిపట్టి మవునం వహించింది.

"మవునం అంగీకారసూచనా" చిన్నా రెచ్చగొట్టే ధోరణిలో అన్నాడు.

"కాదు... తిరస్కారానికి, అయిష్టానికి, అసహ్యానికి కూడా మవునమే మేలైన భాష" పదునుగా అంది.

పకపకా నవ్వాడు చిన్నీ. "మీలో అందాల అపరంజిబొమ్మేకాదు, అపరసత్యభామ కూడా దాగి ఉంది" అన్నాడు.

"థ్యాంక్స్" అని ముఖం తిప్పుకుంది. బయట వర్షం తగ్గే సూచనలు లేవు. ఇతడి వాలకం చూస్తే ఏదోలా ఆటపట్టించి వినోదించేలా ఉన్నాడు. ఇతడి వాగ్బాణాల వాడి కంటే బయట ముసురే మేలన్నట్టు విసురుగా లేచింది. "ప్లీజ్ వర్షంలో వెళ్లాలనా మీ ఉద్దేశ్యం. కూర్చోండి" చెయ్యి పట్టుకుని ఆపేశాడు.

"వదలండి మీ ఎదుట కూర్చోవాలంటేనే అసహ్యంగా ఉంది" చెయ్యి విదిల్చింది.

"అసహ్యమైనా ఇంత వర్షంలో మిమ్మల్ని వెళ్లనియ్యను" పట్టుదలగా అన్నాడు.

"నాకిష్టంలేనిపని నాచేత బలవంతంగా ఎవరూ చేయించలేరు" నిరసనగా అంది.

"ఆ మాటకొస్తే ఆ విషయంలో నేను మీకంటే మొండివాడిని" చెయ్యిపట్టు వదలకుండానే మొండిగా అన్నాడు చిన్నీ.

అతడి పట్టునుండి విదిలించుకుని ముందుకెళ్లాలనుకున్న ఆమె పట్టు సడలిపోయింది. బలంగా లాగిన అతడి పురుషత్వం ముందు ఆమె ఓడిపోయింది. ఎలా జరిగిందో తెలియదు ఆమె అతడి కౌగిట్లో ఇమిడిపోయింది. బలంగా పెనవేసుకున్న రెండు చేతులమధ్య గువ్వలా ఒదిగిపోయింది.

"ఈ ముద్దు పెదవుల్తో ఎప్పుడూ రెచ్చగొట్టకు. ఇలా ముద్దు పెట్టుకోవాలనిపిస్తుంది." ఆమె పెదవులపై చిరుముద్ర పడింది. "ఆ సోగకళ్లెత్తి కోపంగా చూడకు ఆ కోపాన్ని మంచులా కరిగించాలనిపిస్తుంది" పెదవుల్తో కలువరేకుల్లాంటి ఆ కళ్లను స్పర్శించాడు. "మాటల్తో ఎప్పుడూ రెచ్చగొట్టకు. ఇలా కౌగిట్లో శాశ్వతంగా బంధించాలనిపిస్తుంది" కౌగిలి మరింత బిగుసుకుంది.

అతడి స్పర్శలో, మాటలో ఏమత్తుందో తెలియదు మిన్ను మంచు బొమ్మే అయ్యింది. అతడినుండి దూరంగా జరగాలన్న స్పృహే లేనట్టు అతడి భుజంమీదున్న ఆమె చేతులు మరింత బిగుసుకున్నాయి. ఆమెకళ్లు తమకంతో మూతలుపడ్డాయి. వేడెక్కి చిన్నగా కంపించిన ఆమె శరీరం ఆ పురుష హృదయానికి ప్రేమ భాష్యాన్ని విప్పిచెప్పింది.

ముందుగా ఆ అవస్థ నుండి చిన్నీయే తేరుకున్నాడు. "ఐయామ్ సారీ. నానుండి ఎటువంటి భయాలు పెట్టుకోకు. నిశ్చింతగా కూర్చో వర్షంలో ఈ చీకట్లో ఒంటరిగా బయటకెళ్లే ప్రయత్నం చెయ్యకు. వర్షం తగ్గాక నేనే మీ ఇంట్లో దిగబెడతాను" మృదుస్వరంతో చెప్పి అక్కడనుండి గబగబా వెళ్లిపోయాడు చిన్నీ.

"ఏమయింది తనకీవేళ. ఎందుకలా ఆమె ముందు బలహీనుడైపోయాడు. ఏ విషయంలోనైనా నిగ్రహాన్ని ప్రదర్శించగల తనామె విషయంలో ఎందుకలా పొరపాటు చేశాడు. తన వ్యక్తిత్వాన్ని ఆమె తప్పుగా అంచనా వేస్తుంది. కానీ ఆమె స్పర్శలో హాయి, ఆ చిరుకంపనలో పులకింతలు, మత్తుగా వాలిన ఆ సోగకళ్లు తనను వివశుడ్ని చేశాయి. అందుకే స్త్రీ పురుషులకు ఏకాంతం ప్రమాదాన్ని తెచ్చిపెడుతుంది. అర్థంలేని ఆవేశాల్తో తప్పటడుగులు వేయించి జీవితగమనాన్నే మార్చేస్తుంది" చిన్నీ ఆలోచిస్తూ అనుకున్నాడు.

కాసేపటికి బయట వర్షం తగ్గింది. చిన్నీ డ్రస్సు వేసుకుని కిందకొచ్చేసరికి మిన్ను ఎక్కడా కన్పించలేదు. "ఆయా ఆమె వెళ్లిపో

యిందా?" పిలిచి అడిగాడు.

"ఆ వెళ్లింది చినబాబు. తను వెళ్లినట్టు మీతో కూడా చెప్పమంది"

"ఈ చీకట్లో ఒంటరిగా వెళ్లడం మంచిది కాదు, నేను డ్రాప్ చేస్తానని చెప్పానుగా. ఆ పిల్లకంత మొండితనం దేనికి" విసుక్కున్నాడు చిన్నీ.

"మీరు దిగబెడతానన్న విషయం నాకు తెలియదుగా అందుకే 'వెళ్లొస్తానండీ' అని చెప్పగానే "వెళ్లిరామ్మా" అని చెప్పాను. మీతోనూ ఓ మాట చెప్పాలన్న ఆలోచనే నాకు రాలేదు" అంది నొచ్చుకున్నట్టుగా.

"బావుంది ఆవిడగారికి లేని భయం మనకెందుకులే" విసుక్కుంటూ హాల్లో సోఫాలో కూర్చున్నాడు. ఎదురుగా ఆమె హేండ్ బ్యాగు టేబుల్ మీద కన్పించింది. ఆసక్తిగా బ్యాగ్ చేతులోకి తీసుకుని జిప్ తీసి చూశాడు. టిఫిన్ బాక్స్, కొద్దిగా చిల్లర, రెండు ఇరవై రూపాయల నోట్లతోపాటు విజిటింగ్ కార్డు కూడా బయటికొచ్చింది. ఆ కార్డుమీదున్న అడ్రస్ చూడగానే చిన్నీ కళ్లు చిట్లించాడు. భ్రుకుటి ముడుచుకుంది.

"కె. సుందరరామిరెడ్డి; ఆదిత్యనగర్, ఫోన్. నెం... ఆ విజిటింగ్ కార్డ్ ఈమె దగ్గరెందుకుంది?" తీవ్రంగా ఆలోచిస్తూనే ఏదో అనుమానం రాగా శ్రావణ్‌కు ఫోన్ చేశాడు.

"హలో ఎస్.ఐ. శ్రావణ్ హియర్" అవతల్నుండి శ్రావణ్ అనగానే "శ్రావణ్ నేను సిద్ధుని"

"ఏమిటి విషయం?"

"కె. సుందరరామిరెడ్డి ఎవరో నీకు తెలుసా?" అడిగాడు.

"తెలుసు... అమరేంద్రకు రైవల్. ప్రస్తుతం ఈ పట్టణాన్ని పరిపాలించే పెద్ద మనుషుల్లో ఈ ఇద్దరూ ముఖ్యులు కాబట్టి ఇద్దరికీ మధ్య శతృత్వం ఉంది. పచ్చిగడ్డి వేసినా పెట్రోలు వేసినట్టు భగ్గుమంటుంది. అయినా ఇంత హఠాత్తుగా ఈ రామిరెడ్డి నీ బుర్రలోకెలా వచ్చాడు" అవతల్నుండి శ్రావణ్ ఫన్నీగా అడిగాడు.

"రేపుదయం నీ దగ్గరకొచ్చి మాట్లాడతాను. ఫోన్ పెట్టేస్తున్నాను" చెప్పి రిసీవర్ క్రెడిల్ మీదుంచాడు చిన్నీ.

అప్పుడే బయటకెళ్లిన శివప్రకాష్ పోర్టికోలో కారాపి లోపలికొచ్చి అలసటగా సోఫాలో కూలబడ్డాడు. ఆయన్నాస్థితిలో చూస్తుంటే చిన్నీకి జాలి కలిగింది. వింధ్యనుండి ఫోన్‌రావటం, ఫోన్లో విషయం వింటూనే ఆయన కారేసుకుని బయటకు వెళ్ళడం గుర్తొచ్చి చిన్నీ ఆయన పక్కనే వచ్చి కూర్చుని "మామయ్యా టీ తెమ్మని ఆయాకు చెప్పమన్నారా?" అడిగాడు.

శివప్రకాష్ జవాబివ్వకపోటంతో చిన్నీ అక్కడనుండి మవునంగా లేచి వెళ్లిపోయాడు. ఆయన మానసికస్థితినిబట్టి ఒంటరిగా వదిలెయ్యటమే మంచిదనిపించింది.

ఉదయం చిన్నీ శ్రావణ్‌ను కలవటానికి రెడీ అవుతుండగా వింధ్య వచ్చింది. అప్పటికే శివప్రకాష్ స్నానాదికాలు ముగించి పూజలో కూర్చున్నాడు.

"శివ లేడా?" చిన్నీనడిగింది వింధ్య.

"మీరా అంటీ. పిలుస్తానుండండి" చిన్నీ లోపలికెళ్లి మేనమామను పంపించాడు.

"ఏమయింది శివా? అమ్మాయిని ఇంటికి తీసుకొచ్చావా?" వింధ్య అటూఇటూ పరికించి చూస్తూ అడిగింది వింధ్య.

శివప్రకాష్ ముఖం చిన్నబోయింది. పెదవి విరిచాడు.

"ఏం తను రానన్నదా. విషయం సరిగా వివరించలేదా?" అడిగింది వింధ్య.

"అదేం కాదు. నేను బయల్దేరాక వర్షం మొదలవటంతో నాకెక్కడా అమ్మాయి ఆచూకీ దొరకలేదు. వర్షం తగ్గేవరకు పిచ్చివాడిలా వీధులన్నీ వెదుకుతూనే ఉన్నాను. నో యూజ్" నిరాశగా చెప్పాడు.

"అయ్యో! నువ్వు అమ్మాయిని ఇంటికి తీసుకొచ్చేసుంటావని 'రాత్రి కంటి నిండా నిద్రపోయాను. ఇలా జరుగుతుందనుకో లేదు. నేనెంతటి దురదృష్టవంతురాలిని"

"దురదృష్టం నీది కాదు నాది. నువ్వు ఫోన్ చెయ్యగానే రెక్కలు కట్టుకొని మరీ కొండంత ఆశతో బయల్దేరాను. నిరాశను మూటగట్టుకుని తిరిగొచ్చాను" శివప్రకాష్ ఆవేదనగా అన్నాడు.

"బాధపడకు శివా. కళ్ళారా చూసి కూడా నీ కప్పగించలేని నా దౌర్భాగ్యస్థితికి సిగ్గుప డుతున్నాను. ఇదంతా నావల్లే జరిగింది. నా నిస్సహాయస్థితిని వెల్లడించలేను. నన్న ర్థంచేసుకొని క్షమించవూ" అంది వింధ్య.

"నిన్ను ఈ విషయంలో తప్పుపట్టను వింధ్యా. అమ్మాయిని కలుసుకునే అదృష్టఘ డియలు నా జీవితంలో ఇంకా రాలేదని సరిపెట్టుకుంటాను. కాని ఒక్క విషయం తెలిసింది. అమ్మాయి కూడా ఇక్కడే ఉందన్న విషయం రూఢిగా తెలిసింది. ఎప్పటికయినా నా బిడ్డను నా ఇంటికి తెచ్చుకోగలనన్న ఆశ నాకు కొత్త ఊపిరినిచ్చింది. మరెప్పుడైనా నీకు తటస్థప డితే శ్రమ అనుకోక ఆమె ఆచూకీ తెలిపే ప్రయత్నం చెయ్యి. అదే నిన్ను నేను కోరు కునేది" అన్నాడు.

"నువ్వంతగా చెప్పనక్కర్లేదు. మన బిడ్డను నీకందించేవరకు నాకు మనశ్శాంతి చిక్కదు. ఆ విషయంలో ఏ సందేహాలు పెట్టుకోకు" చెప్పి వెళ్లిపోయింది వింధ్య.

డ్రాయింగ్‌రూమ్‌నుండి వీళ్ళిద్దరి సంభా షణ అతిశ్రద్ధగా విన్న చిన్నీకి అసలు విషయం తెలిసింది. తన మావయ్య కూతురు అంటే తన మరదలు, చేసుకో బోయే అర్ధాంగి ఇదే ఊళ్లో ఉందన్న విషయం అతనికి థ్రిల్లింగ్‌గా అన్పించింది. ఎలాగైనా ఆమె ఆచూకీ తెలుసుకోవాలన్న పట్టుదల చిన్నీలో పెరిగింది.

వింధ్య వెళ్ళగానే శివప్రకాష్ పూజగదికి వెళ్ళడం చూసి శ్రావణ్ ఇంటికి బయల్దే రాడు చిన్నీ.

సిద్ధార్థ వెళ్ళేసరికి శ్రావణ్ అతడికోసమే ఎదురుచూస్తూ లాన్లో కూర్చుని కన్పిం చాడు. "గుడ్‌మార్నింగ్"

"ఫైన్ మార్నింగ్. రా సిద్దూ నీకోసమే వెయిట్ చేస్తున్నాను. రాత్రంతా ఆ రామిరె డ్డిని గురించి ఆలోచనలే. సస్పెన్సులో ముంచి చంపేవు కదా" శ్రావణ్ అన్నాడు.

"అంత టెన్సవటం దేనికి. ఉదయం వచ్చి చెప్తానన్నాగా" అన్నాడు సిద్ధార్థ.

"చెప్తానన్నావనుకో. అసలీ రామిరెడ్డి ఇం త అకస్మాత్తుగా నీ బుర్రలోకెందుకొచ్చాడా అని ఆలోచిస్తూ నిద్రపోలేదు" అన్నాడు శ్రావణ్.

"నిన్న సాయంత్రం ఓ తమాషా జరి గింది" అని మొదలుపెట్టి వర్షం రావటం, ఆ తరువాత మిన్ను యాదృచ్ఛికంగా ఇంట్లోకి రావటం, వర్షం వెలిశాక ఆమె హేండ్‌బ్యాగు మర్చిపోయి వెళ్ళటం, అందులో రామిరెడ్డి విజిటింగ్ కార్డు కన్పిం చటం అన్నీ వివరంగా చెప్పాడు చిన్నీ.

"మిన్నూ అంటే..."

"అదే శ్యామ్ చిత్రాలకు మోడల్‌గా పనిచే సేదని చెప్పానుగా ఆ అమ్మాయే మిన్ను"

"మైగాడ్! రామిరెడ్డికి, మిన్నుకు ఉన్న సంబంధ బాంధవ్యాలెటువంటివని నీ అభి ప్రాయం" ఆసక్తిగా అడిగాడు శ్రావణ్.

"అదే నేనెంతాలోచించినా అర్థంకాని విషయం. అతడి విజిటింగ్ కార్డ్ ఆమె దగ్గ రెందుకుందో, అసలతడు ఆమెకెలా పరిచ యమో ఆలోచించి తేల్చాల్సిన విషయం" సిద్ధార్థ అన్నాడు.

కొద్దిసేపు శ్రావణ్ మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తుండిపోయాడు. తరువాత అన్నాడు "ఆ అమ్మాయిని నువ్వు చూశావుగదా ఆమె గురించి నీకేమనిపించింది? " అడిగాడు.

నీలాంటి పెళ్ళయిన వాడు చూస్తే "ఓ గోల్డెన్ ఛాన్స్ మిస్సయ్యానే" అని నిట్టూర్పు

విడుస్తాడు. నాలాంటి బాచులరయితే ప్రతి రాత్రి స్వప్నంలో ఆమెతోనే విహరించి వస్తాడు" చెప్పాడు సిద్ధార్థ.

"నీ మాటలు వింటుంటే ఆ అమ్మాయినో సారి తప్పకుండా చూడాలనుంది" శ్రావణ్ అన్నాడు.

"నువ్వలా అంటావని నాకు తెలుసు" సిద్ధార్థ నవ్వుతూ అన్నాడు.

"అందచందాల విషయం పక్కకు పెట్టి ఆమె వ్యక్తిత్వం ఎలాంటిదో అర్థంచేసుకోగలిగావా? " అడిగాడు శ్రావణ్.

"చాలా తెలివైనది. మాటల్లో దొరకదు. మనసులో అభిప్రాయాలను ముఖంలో ప్రతిబింబించకుండా జాగర్త పడగలదు. వగరు, పొగరుతోపాటు కొండంత ఆత్మాభిమానమున్న మనిషి. ఒక్కటే చిన్న బలహీనతుంది"

"ఏమిటది"

"మనసులో కోపాన్ని ఆ అందమైన కళ్ళల్లో అసలు దాచుకోలేదు" చెప్పాడు సిద్ధార్థ.

"ఇంత డీప్‌గా వెళ్లావంటే ఆ అమ్మాయికి సంబంధించిన వివరాలన్నీ సేకరించావన్న మాట" శ్రావణ్ అన్నాడు.

"అక్కడే పప్పులోకాలేశావు. ఆ అమ్మాయి నిప్పటికి మూడుసార్లు కలుసుకున్నా ఆ అమ్మాయెవరమ్మాయో, ఎక్కడుంటుందో, అసలు పేరేంటో పిసరంతయినా ఇన్ఫర్మేషన్ తెలుసుకోలేకపోయాను"

"మంగళకు స్నేహితురాలేనని చెప్పావుగా. ఆమెనడిగి పూర్తి వివరాలు తెలుసుకోవాల్సింది" శ్రావణ్ అన్నాడు.

"అడిగాను. మంగళ ఆమె గురించి తనకు వివరాలేమీ తెలియవని చెప్పింది. అప్పుడప్పుడు ఆమెను శ్యామ్ ఇంట్లో కలుసుకోటం తప్ప ఆమె గురించి తనకేమీ తెలియదని చెప్పింది"

"బావుంది. అసలు తీగే దొరక్కుంటే డొంకని ఎలా కదల్చగలం" శ్రావణ్ విసుగ్గా అన్నాడు.

"ఆగాగు నా అంచనా తప్పు కాకుంటే రాత్రి తన హేండ్ బ్యాగ్ మా ఇంట్లో మర్చి పోయిన సంగతి తెలుసుకుంటుందిగా. ఈ పాటికే హేండ్ బ్యాగ్‌కోసం ఆమె మా ఇంటికి వచ్చే ఉండాలి. ఉండు ఒక్కసారి ఇంటికి ఫోన్ చేస్తాను" అంటూ సిద్ధార్థ శ్రావణ్ ఇంట్లోకి పరుగుపెట్టాడు.

డయల్ చెయ్యగానే ఆయానే ఫోన్ తీసింది.

"హల్లో! ఆయా నేను. విషయం ఏవిటంటే రాత్రి వర్షంలో మనింటికొచ్చిన అమ్మాయి గుర్తుందిగా. ఆ అమ్మాయి మనింట్లో హేండ్ బ్యాగ్ మర్చిపోయి వెళ్ళిపోయింది. బ్యాగ్ కోసం వస్తే జాగర్తగా అందచెయ్యి. నీకు తెలుసో లేదోనని ఫోన్ చేశానంతే" అన్నాడు.

"... ..."

"అలాగే. ఫోన్ పెట్టెయ్యి" చెప్పి మళ్ళీ శ్రావణ్ దగ్గరకొచ్చాడు.

"ఏం జరిగింది? " శ్రావణ్ అడిగాడు.

"నా ఊహ తప్పుకాలేదు. ఆ అమ్మాయి పది నిమిషాల కిందటే వచ్చి హేండ్‌బ్యాగ్ పట్టుకెళ్ళిందట. ఆయా చెప్పింది"

"అంటే..."

"రామిరెడ్డి విషయం ఇతరులకు తెలియటం ఆమెకిష్టం లేదని అర్థం. రాత్రంతా నిద్రపోయుండదు. తెల్లవారేసరికల్లా బ్యాగ్ కోసం ఇంటికొచ్చిందంటే ఆ విషయం గోప్యంగా ఉంచాలన్నదే ఆమె ఉద్దేశ్యం" విశ్లేషించాడు సిద్ధార్థ.

"ఇంతకీ ఆ రామిరెడ్డికి, ఈమెకు ఉన్న లింకేమిటన్నది ఊహకందడం లేదే" శ్రావణ్ సాలోచనగా అన్నాడు.

"ఇప్పటివరకు ఏదీ లేదు. బహుశా శ్యామ్‌కు రామిరెడ్డికి మధ్య విడదియ్యరాని అనుబంధమేదో ఉండి ఉంటుంది" అంటున్న సిద్ధార్థ మెదడులో చిన్న మెరుపు మెరిసినట్టయింది. "శ్రావణ్ తీగ దొరికింది

ఇంక డొంకనెలా కదులుస్తామో చూడు" ఆనందంతో సిద్ధార్థ ముఖం వెలిగిపోయింది.

"ఏమిటి నువ్వనేది"

"శ్యామ్ డైరీలో రాసిన మిష్టర్ ఆర్ అంటే ఈ రామిరెడ్డే ఎందుక్కాకూడదు? " ప్రశ్నించాడు సిద్ధార్థ.

"కావచ్చు కాకపోవచ్చు ఫిఫ్టీ ఫిఫ్టీ ఛాన్సెస్ మాత్రమే"

"వైనాట్"

"సుందర రామిరెడ్డి అంటే ఇతడు కాకపోవచ్చు రామిరెడ్డి అనుకుంటే ఇతడే కావచ్చు"

"సందిగ్ధంలో పెట్టావే. సరే నువ్విక్కడే ఉండు. పావుగంటలో వస్తాను" చెప్పి సిద్ధార్థ బయల్దేరపోతుంటే "పద నేనూ వస్తాను" అంటూ శ్రావణ్ తన స్కూటర్ బయటకు తీశాడు.

స్కూటర్‌ను ఓ పబ్లిక్ టెలిఫోన్‌బూత్ దగ్గర ఆపమన్నాడు సిద్ధార్థ. సిద్దూ వెడుతుంటే మవునంగా అతడ్ని అనుసరించాడు శ్రావణ్.

రామిరెడ్డి విజిటింగ్ కార్డ్‌నుండి నోట్‌చేసుకున్న అతడి పర్సనల్ ఫోన్ నెంబరుకు డయల్ చేశాడు.

"హలో రామిరెడ్డి హియర్" అవతల్నుండి అతడి కంఠం గంభీరంగా విన్పించింది.

"మీరేనా సర్. గుడ్‌మార్నింగ్" ఇవతల్నుండి సిద్ధార్థ గొంతు మార్చి విష్‌చేశాడు.

"మార్నింగ్ ఇంతకీ ఎవరు మీరు? " ప్రశ్నించాడు రామిరెడ్డి.

"సార్ ఎవరో ముఖ్యమైన వారినుండి కాల్‌కోసం ఎదురుచూస్తున్నారు కదూ, నేను మాటాడగానే డిసప్పాయింటయ్యారు కదూ" అంటున్నాడు.

"అదేంలేదు. మీరెవరో, ఎందుకు ఫోన్‌చేశారో చెప్పండి. కాలయాపన నాకు నచ్చదు"

"నా పేరు గణపతి. శ్యామ్‌కున్న ఒకే ఒక ప్రాణస్నేహితుడ్ని" అవతల్నుండి అది వినగానే రామిరెడ్డికి మరో మాట మాట్లాడ్డానికి కొంత వ్యవధి పట్టింది.

"అయితే కావచ్చు ఆ విషయం నాకు ఫోన్ చేసి మరీ చెప్పటం దేనికి" రామిరెడ్డి కాస్త కటువుగా అన్నాడు.

"అవసరం ఉంది సార్. శ్యామ్‌కు పరిచయస్తురాలైన ఆ అమ్మాయి పేరు మిన్నాయో ఏదో అనుకుంటాను. ఆ అమ్మాయితో మీరు పర్సనల్‌గా మాటాడ్డం నేను చూశాను. అందుకే ఫోన్‌చేశాను" తొణక్కుండా చెప్పాడు గణపతి ఉరఫ్ సిద్ధార్థ.

"ఆ అమ్మాయితో నేను మాట్లాడ్డం ఏమిటి? నేనెవరో ఏమిటో తెలియక ఫోన్ చేసుంటావు. నా టైమ్ వేస్ట్‌చేయక ఫోన్ పెట్టెయ్యి" ఆజ్ఞాపించాడు.

"తొందరపడకండి సార్. దేనికైనా నిదానం కావాలి. ఆ అమ్మాయిని మీరు కలుసుకొని మాట్లాడ్డం, విజిటింగ్ కార్డివ్వటం నేను కళ్లారా చూశాను. మీరిప్పుడెదురుచూస్తున్నది కూడా ఆమెనుండి వచ్చే ఫోన్‌కాల్ కోసమే. ఇది అబద్ధమంటారా? "

"... ... ..."

"మాట్లాడరేం నన్నింకా బుకాయించే ప్రయత్నం చెయ్యొద్దు"

"మాట్లాడాను. అయితే ఇప్పుడేమంటావ్. ఉదయం లేచింది మొదలు ఎందరితోనో మాట్లాడాల్సిఉంటుంది, మాట్లాడతాం. ఎంతయినా పబ్లిక్‌లో పేరున్నవాళ్ళంగదా" రామిరెడ్డి సమర్థించుకునే ప్రయత్నంగా అన్నాడు.

"అందరితో మాట్లాడ్డం వేరు, మిన్నాతో మాట్లాడ్డంవేరు. ఆమెతో మీరు మాట్లాడింది పూర్తిగా బిజినెస్ డీల్ అవునా"

"... ... ..."

"సరే మీ మవునంలోనే జవాబు దొరికింది. ఆ విషయం వదిలెయ్యండి. మీక్కావలసింది అదే మిన్నాని మీరడిగేదె

అది నా దగ్గరుంది"

"ఈజిట్!"

"యస్... మన మధ్య డీల్ కుదిరితే ఆ వస్తువు మీకప్పగించటానికి నేను సిద్ధంగా ఉన్నాను"

"కొత్తగా చెప్పేదేముంది. ఆ అమ్మాయికి ఫిఫ్టీ థౌసండిస్తానన్నాను. అయినా తన దగ్గర లేదు పొమ్మంది. ఒట్టి మొండిఘటంలా ఉంది"

"మీ ఊహ కరెక్టే. అయినా మీరిస్తానన్న ఎమౌంట్ మరీ తక్కువనుకుంటాను. మరో సారి రేటు విషయంలో ఆలోచించండి"

"తక్కువేముందయ్యా. శ్యామ్ నిజంగా ఫొటోలే అందచేసుంటే లక్ష రూపాయలిస్తానన్నాను. దానికే అతడంగీకరించి ఫిక్స్ చేసుకున్నాడు. నువ్విస్తానంటున్నది ఫోటో రీలుగాని ఫొటోలు కాదు. మళ్లీ అవి సీక్రెట్‌గా డెవలప్ చేయించి కాపీలు తీయించాలంటే నాకు మళ్ళీ కొంత ఖర్చవుతుంది. ఎందుకంటే అవిక్కడెక్కడా ప్రింట్లు వేయించడానికి కుదరదు. హైదరాబాదో, బెంగుళూరో వెళ్లాలి. అందుకే ఆలోచించు"

"నిజమే. మీ ఇబ్బందులు మీకుంటాయి. కాని బేరం విషయంలో మీరు మరోమాట చెప్పక తప్పదు. అవతలివాళ్ళు కూడా వాటి కోసమే వెతుకుతున్నారని మీకూ తెలుసు"

"అవతలి వాళ్ళంటే..."

"అదే సర్ అమరేంద్ర మనుషులు రషీద్, యాదగిరిలు. వాళ్ళ కొక్క ఫోన్ కొట్టేనంటే ఆలోచించకుండా రెండు లక్షలడిగినా ఇస్తారు. అందుకే ఛాయిస్ మీదే"

"సరే. శ్యామ్‌కిస్తానన్న ఫిగరే నీకూ ఇస్తాను. ఆ ఫొటోరీలు నాకందచెయ్యి. నువ్వెవరయినా సరే నీ విషయం మాత్రం రహస్యంగా ఉంటుంది. అయినా ఇటువంటి విషయాలు ఫోన్లో కాంటాక్టు చెయ్యటం అంతమంచిది కాదు. డైరెక్టుగా నా దగ్గరకే రావొచ్చు సాయంత్రం ఓ సారి వచ్చి కన్పించు. నువ్వే టయిముకొచ్చేదీ చెప్తే నీకోసం ఇంటిదగ్గరే వెయిట్ చేస్తాను" అవతల్నుండి రామిరెడ్డి అన్నాడు.

"సారీ సర్. ఇటువంటి విషయాలు ఫేస్ టు ఫేస్ కాకుండా ఫోన్‌లో కాంటాక్టు చెయ్యటమే నావరకు సేఫ్టీగా భావిస్తాను. మీకు శ్యామ్ తీసిన ఫొటోరీలు కావాలి. నాకు డబ్బు కావాలి. అదెప్పుడు, ఎక్కడ, ఎలా అందచేసేదీ వీలుచూసుకుని ఫోన్ చేస్తాను. ఈలోగా మీరు కేష్ రెడీ చేసుకోండి. డి.డి.లు, చెక్కులు నాకు నప్పవు" అన్నాడు.

"అలాగే మళ్లీ నీనుండి ఫోన్ కోసం వెయిట్ చేస్తానని మర్చిపోకు. ఇక డీల్ ఒప్పుకున్నావు కాబట్టి అమరేంద్రతో టాకిల్ చెయ్యవనే నా నమ్మకం" రామిరెడ్డి మాటల్లో హెచ్చరిక లాంటిది విన్పించింది.

"నేనెలాంటివాడినయినా ఇటువంటి వ్యవహారాల్లో నాకూ కొన్ని రూల్సున్నాయి. ఒక మాటకు కట్టుబడి ఉండేవాడినే. త్వరలోనే మళ్లీ మీకు ఫోన్ చేస్తాను. కాని ఒక్క మాట. ఆ ఫోటో రీలు కోసం ఆ అమ్మాయిని మాత్రం వెంటాడి వేధించకండి. వాటి గురించి ఆమెకు నిజంగా ఏమీ తెలియదు" అన్నాడు గణపతి ఉరఫ్ సిద్ధార్థ.

"నువ్వపార్థం చేసుకున్నావు మిష్టర్ గణపతీ. ఆ అమ్మాయిని నేననసలు వెంటాడి వేధించలేదు. అది నా పాలసీ కూడా కాదు. శ్యామ్ ఆరోజు అమరేంద్ర ఫారమ్ హవుస్‌లో ఫొటోలు తీశాక వెంటబడ్డ గార్డుకు చిక్కకుండా తప్పించుకు పారిపోయి ఆ అమ్మాయింటికే వెళ్ళాడని తెలిసింది. మావాళ్లు తీసుకొచ్చిన సమాచారాన్నిబట్టి ఫొటో రీలు ఆ అమ్మాయి దగ్గరే దాచి ఉంటాడన్న అభిప్రాయంతో ఉంటే ఇవ్వమని సానునయంగానే అడిగాను. ఏభయివేలుకు చెక్కు కూడా రాసిస్తానన్నాను"

రామిరెడ్డి చెప్తుండగానే "జరిగిందేదో జరిగింది. ఇక ఆ అమ్మాయిని ఇబ్బందిపెట్టకండి. మళ్ళీ వీలుచూసుకుని నేనే ఫోన్

చేస్తాను, ఉంటాను" ఫోన్ పెట్టేసి విజయ గర్వంతో బయటికొచ్చాడు సిద్ధార్థ.

"అంతా విన్నావుగా ఇక నీకు వివరించి చెప్పక్కర్లేదనుకుంటాను" ఇంటికొచ్చాక సిద్ధార్థ శ్రావణ్‌తో అన్నాడు.

"చాలా చక్కగా టాకిల్ చేశావు. నీకు తెలియని విషయాన్ని తెలిసినట్టుగా మానేజ్ చేసి విషయాన్ని అతడి నోటితోనే చెప్పించావు. నీలాంటి బ్రిలియెంట్స్ ఇంటిలిజెన్స్‌లో ఉండడంవల్లనే మా డిపార్ట్‌మెంటుకు కొంత ఉపయోగకరంగా, ఉందేమో"

"ఏం లాభం. రాజకీయనాయకులు మీ డిపార్ట్‌మెంటు వ్యవహారాల్లో పెత్తనం చేస్తున్నంతకాలం మీ మీదున్న అపప్రథ తొలగించుకోలేరు. అసలైన నేరస్తులు తప్పించుకొని దొరబాబుల్లా తిరుగుతారు. అమాయకులు అన్యాయంగా బలైపోతారు"

"నువ్వన్నదీ కొంతవరకు నిజమే. ఇంతకీ ఆ ఫొటోరీలు ఎక్కడున్నదని నీ ఊహ" అడిగాడు శ్రావణ్.

"మిన్నూ దగ్గరే ఉండి ఉంటుంది. ఇది నా ఎక్స్‌పెక్టేషన్ మాత్రమే"

"మైగాడ్! అమరేంద్ర మనుషులు ఈ విషయం పసిగడితే ఆమెనంత తేలిగ్గా వదుల్తారా. ఆమె కూడా ప్రమాదాల అంచున ప్రయాణిస్తున్నట్టేగా" శ్రావణ్ అన్నాడు.

"నిజమే... వాళ్ళంత తేలిగ్గా వదలరు. వాళ్ళకావిషయం తెలిసేలోగానే మనం దాన్ని మిన్నునుండి సంపాదించాలి" సిద్ధార్థ అన్నాడు.

"అదెలా సాధ్యం. ఆమె గురించి చిన్న ఇన్ఫర్మేషనయినా తెలియనప్పుడు ఆమె నుండి ఫొటో రీలు సంపాదించటం సాధ్యపడేదేనా" శ్రావణ్ నిరాశగా అన్నాడు.

"సాధ్యపడనిది సాధించటంలోనే థ్రిల్లుంటుంది. వారంరోజుల్లో మళ్ళీ కలుస్తాను" చెప్పి వెళ్ళిపోయాడు సిద్ధార్థ.



అమరేంద్ర సూట్‌కేసులో నాలుగు జతలు బట్టలు సర్దుకుని డ్రైవరును కారు తియ్యమని ఆదేశించి వింధ్యతో "నేను ఊటీ వెడుతున్నాను. నాల్రోజుల్లో వస్తాను. ఆలస్యమైనా కంగారుపడకు" అన్నాడు.

"ఊటీ వెడుతున్నారా. ఇంత అర్జంటుగా వెళ్ళాల్సిన అవసరం ఏమొచ్చింది" అడిగింది.

"ఏం లేదు. నిన్న హాస్టల్‌కు ఫోన్ చేశాను. ప్రిన్సిపాల్ ఒకసారి వచ్చి కలుసుకోమన్నాడు"

"అబద్ధం. మీరు నాదగ్గరేదో దాస్తున్నారు. నిజం చెప్పండి బాబు కేమయ్యింది. వాడిని చూడ్డానికేగా మీరు వెడుతున్నారు" వింధ్య అడిగింది.

"పోనీ అదే అనుకో ట్రైన్‌కు టయిమవుతోంది నన్ను వెళ్ళనీ"

"నన్ను కూడా తీసుకెళ్ళండి. ఈమధ్య తరుచు వాడు నా కలలోకి వస్తున్నాడు. నా మనసు వారంరోజులుగా కీడును శంకిస్తూ ఉంది. ఈబాధ నేను భరించలేను. నన్ను మీతో రానివ్వండి" బతిమాలింది వింధ్య.

"వింధ్యా... ప్లీజ్ నా మాట విను. వాడి

కొచ్చింది మామూలు జ్వరం. నువ్వూహించి నదేదీ జరగదు. వెళ్ళగానే నేను ఫోన్ చేస్తాను. నా మాట విను" వింధ్యను ఒప్పించి అమరేంద్ర వెళ్ళిపోయాడు.

"భగవంతుడా నిన్నెప్పుడూ పూజించటమే గాని చేతులుచాచి నిన్నేదీ కోరలేదు. కోరుకున్నవాడిని దూరం చేశావు. కసాయి భర్త నిచ్చావు. కడుపున పుట్టిన పిల్లలిద్దర్నీ నాకు లేకుండా చేశావు. అయినా నిన్నెప్పుడూ నిందించలేదు. ఇదంతా నా దురదృష్టమని, తలరాతని సరిపెట్టుకున్నాను. ఇప్పుడు నీ పాదాలు పట్టి వేడుకుంటున్నాను. నా ఆయుస్సు వాడికిచ్చయినా నా బాబును దక్కించు, కావాలంటే నా ప్రాణాలు నీకర్పిస్తాను. వాడు నిండునూరేళ్లు బతకాలి" కన్నీటితో భగవంతుడి పాదాలను అభిషేకించింది వింధ్య.

అమరేంద్ర వెళ్ళిన మర్నాడే ఫోన్ చేసి "బాబు బాగానే ఉన్నాడు. బెంగపడాల్సిన అవసరంలేదని" ధైర్యం చెప్పాడు.

అప్పటికి వింధ్య మనసు కుదుటపడ్డా, ఆమె మాతృమమకారం బిడ్డను కళ్ళారా చూడాలని తహతహలాడుతూనే ఉంది.

★ ★ ★

రెండు రోజుల్లోనే సిద్ధార్థ మిన్ను పనిచేస్తున్న స్టిచింగ్ సెంటర్ ఆచూకీ తెలుసుకోగలిగాడు. మరో రెండురోజులు పాటు స్టిచింగ్ సెంటర్‌కు ఎదురుగా ఉన్న రెస్టారెంట్లో కూర్చుని ఆమె రాకపోకలు, టైమింగ్స్ అబ్జర్వ్ చేశాడు.

ఇంచుమించు ఐదుగంటలు కాగానే ఓ పాతిక మందివరకు సెంటర్ నుండి బయటకొచ్చి ఎవరిదారిన వాళ్ళు వెళ్లటం గమనించాడు. సాధారణంగా మిన్నూ స్టిచింగ్ సెంటర్‌కు ఫర్లాంగ్ దూరంలో ఉన్న సిటీ బస్సెక్కి వెళ్ళటం కూడా అతడి దృష్టిలో పడింది.

ఓరోజు ఆమె ఇంటికి వెడుతున్నప్పుడు ఆమె కంటపడకుండా ఫాలో అయి మొత్తానికి ఆమె ఉండే కాలనీ పట్టుకోగలిగాడు. వీధి మొదట్లో ఉన్న పాన్‌షాపుదగ్గర నిలబడి ఆమె అదే వీధిలో కుడివైపున్న సందులోకి వెళ్ళటం చూసి కాస్త దూరంలో ఫాలో అవుతూ సందులోకి చూసీచూడనట్టుగా చూస్తూ ఆమె ఏ ఇంట్లోకి వెళ్ళిందీ గమనించి వెనుతిరిగి వచ్చాడు.

మరునాడు సాయంత్రం మిన్నూకంటే ముందే వచ్చి పాన్‌షాపు దగ్గర నిలబడి "ఓపాన్ కట్టవోయ్" ఆదేశించి పేపరు చూస్తూ ఓరకంట వీధిలోకి వస్తున్న జనాన్ని గమనిస్తున్నాడు.

ఓ పావుగంట గడిచాక మిన్నూ, ఆమెతో పాటు మరో యువకుడు మాట్లాడుకుంటూ రావటం చూశాడు. వాళ్ళు షాపు ముందు నుండే వెళ్ళాక "ఆ జంట చూడముచ్చటుగా ఉంది. వాళ్ళిద్దరూ భార్యాభర్తలా? " పాన్‌షాపతన్ని అడిగాడు.

"ఆమెకింకా పెళ్ళికాలేద్సార్. ఆమె ఒప్పుకుంటే చేసుకుందామనే అతగాడెదురు చూస్తున్నాడు. ఆమె 'ఊ' అని మాత్రం అనడంలేదు. ఇతడు ఆశ పెట్టుకోడమూ మానడు. ఆ పెళ్ళి జరుగుతుందో లేదో ఆ పైనున్న వాడికే తెలియాలి" అన్నాడు.

"ఐ.సీ. ఇంత కథుందన్నమాట. ఆ అబ్బాయి పేరేమిటి? "

"ఆనంద్. ఇక్కడే పేపరుమిల్లులో పనిచేస్తున్నాడు. కుర్రాడు చాలా బుద్ధిమంతుడు"

"కుర్రాడు బుద్ధిమంతుడంటున్నారు. తన మీద ఆశ పెట్టుకున్నాడని తెలిసి కూడా ఆమె ఎందుకు అభ్యంతరపెడుతోంది" అడిగాడు సిద్ధార్థ.

"నేను విడమరిచి చెప్పాలా సర్. ఈ రోజుల్లో ఆడపిల్లలు గాల్లో మేడలు కడతారేతప్ప నేలమీదున్న వాళ్లను పట్టించుకోరు. అందునా ఎర్రగా బుర్రగా ఉంది కదా. ఏ దొరబాబన్నా ఎగరేసుకుపోకపోతాడా అన్నది ఆ పిల్ల ఆశ అనుకుంటాను" ఎందుకో మిన్నూను అలా జమకట్టడం

సిద్ధార్థకు నచ్చలేదు.

"ఇంతకీ ఆ అబ్బాయెక్కడుంటాడు? " అడిగాడు.

"ఇద్దరూ పక్క పక్క రూముల్లోనే అద్దెకుంటున్నారు" చెప్పాడు.

★ ★ ★

ఆరోజు ఆదివారం. ఆనంద్‌కు డ్యూటీలేకపోటంతో మధ్యాహ్నం భోజనం చేశాక గదిలో బద్ధకంగా పడుకున్నాడు. ఇలా కునుకుపట్టిందో లేదో ఎవరో తలుపు తట్టటంతో వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా తల కాస్త పండి, గుబురుగా పెరిగిన గెడ్డంతో ఓ పెద్దవయసాయన నిలబడ్డం చూసి "ఎవరు కావాలండీ? " అడిగాడు ఆనంద్.

"ఆనంద్ బాబంటే నువ్వేనా నాయనా" కొద్దిగా వణుకుతున్న స్వరంతో అడిగాడు.

"నేనే. ఇంతకీ మీరెవరు? "

"ఇక్కడే పేపరు మిల్లులో పనిచేస్తున్నావని చెప్పి రంగాజమ్మగారు నీ అడ్రసు కూడా ఇచ్చారు"

"అంటే మీరు ఆలమూరునుండి వచ్చారా? " అడిగాడు ఆనంద్.

"అవున్నాయనా తీర్థయాత్రలకని బయల్దేరాను. ఈ ఊరొచ్చేసరికి ఒంట్లో కాస్త నలతచేసింది. ఎలాగూ మీ బామ్మ నీ అడ్రసు ఇచ్చారుకాబట్టి చూసిపోవాలని వచ్చాను"

"లోపలికి రండి" ఆహ్వానించాడు ఆనంద్.

ఆ పెద్దాయన లోపలికొచ్చాక "ఇలా మంచం మీద కూర్చోండి" అన్నాడు. ఆయన కూర్చున్నాక "బాబూ కాసిని మంచి నీళ్లిస్తావా టాబ్లెట్ వేసుకుంటాను" అన్నాడు.

"ఇవిగో తీసుకోండి" అంటూ కూజాలో నీళ్ళు గ్లాసులో వంపి చేతికిచ్చాడు. "మీ పేరేమిటో నేను తెలుచుకోవచ్చునా" అడిగాడు ఆనంద్.

"దానికేం భాగ్యం. నేను నువ్వు ఎరగని వాడిని కానులే మనవడా. తల్లావఝుల వారి గురించి వినే ఉంటావు. వారి వంశస్తుడినే"

"వినకేం. మా ఊళ్లో వారికి చాలా పేరుప్రతిష్టలున్నాయి. మీరు కావాలంటే ఓ రెండు రోజులిక్కడే రెస్టుతీసుకుని వెళ్ళండి" ఆనంద్ మర్యాదపూర్వకంగా అన్నాడు.

"రెండురోజులుండడం ఎలా కుదురుతుందబ్బాయ్. హృషీకేశ్ వరకు చూసి రావాలని బయలుదేరాను. ఆ సర్వేశ్వరుడు నాకా ఓపికిస్తాడో లేదో. మధ్యలోనే హరీమన్పిస్తాడో" నిట్టూర్చాడాయన.

"అంత మాటనకండి. ఇంతకీ మా బామ్మెలా ఉంది? " అడిగాడు ఆనంద్.

"ఏదో ఉందిలే. ఆమె బెంగంతా నీ గురించే సుమీ"

"నా గురించా? నేనేం చేశానని? ఇక్కడ హాయిగా ఉన్నాను" ఆనంద్ అన్నాడు.

"ఏం చేశావా? పెళ్లి మాటెత్తితేనే మండిపడతావట. ఎందుకోయ్ నీ కంత కోపం?

"పెద్దగా కారణమంటూ లేదనుకోండి. నాకు నచ్చిన పిల్ల దొరికితే నేనూ త్వరలోనే పెళ్లి చేసుకుని బామ్మ కోరిక నెరవేర్చాలనే అనుకుంటున్నాను" నసిగాడు.

"నీకు నచ్చిన పిల్ల అంటున్నావంటే పిల్లను నీకు నువ్వే చూసుకునే ప్రయత్నంలో ఉన్నావన్నమాట. ఆ మాటేదో మీ బామ్మతో స్వయంగా నువ్వే చెప్తే కాదంటుందటోయ్. పైగా చాలా సంతోషిస్తుంది కూడా. నేను తిరిగి మనూరెళ్లాక విషయం మీ బామ్మకు చెప్పి నీ పెళ్లికి ఒప్పించేలా చేసే పూచీ నాది. నీ ప్రయత్నాలేవో త్వరగా ఓ కొలిక్కి వచ్చేలా చూడు"

ఆయన సలహా ఆనంద్‌కు సంజీవిలా పనిచేసింది.

"బాబూ! కాసేపు నిద్రపోతాను. చాలా నీరసంగా ఉంది. అన్నట్టు రాత్రికి నాకోసం వంట ప్రయత్నాలేవీ చెయ్యకు. యాత్రల్లో ఉన్నవాడిని కాబట్టి ఒంటిపూట భోజనమే

నా నియమం. రెండోపూట రెండు అరటి పళ్లు, ఓ గ్లాసు పాలు ఉంటే చాలు. అరటి పళ్లు నా వెంట తెచ్చుకున్నాను గానీ పాలు మాత్రం ఎలా తంటాలు పడతావో కాస్త చిక్కటివి సంపాయించు" అని ఆదేశించి గోడ వైపు తిరిగి నిద్రలోకి జారుకున్నాడాయన.

ఓ గంట గడిచాక కాబోలు మిన్ను లోపలికొచ్చి మంచం మీద పడుకున్న వ్యక్తిని చూసి "ఈ చుట్టం ఎవరు? " అని అడిగింది ఆనంద్‌ను.

"ష్... గట్టిగా మాట్లాడకు. మా ఊరి పెద్దమనిషే. తీర్థయాత్రలకని బయల్దేరారట. ఈ ఊరొచ్చేసరికి ఒళ్లు నలత చేసిందిట. మా బామ్మ నా అడ్రసెలాగూ ఇచ్చిందిగదా అని నన్ను వెతుక్కుంటూ వచ్చారు" చెప్పేడు.

"ఆ కథంతా నువ్వు నమ్మేసి ఆయనగారిని రూమ్‌లో ఉండమని రిక్వెస్ట్ చేసేవన్న మాట. కొత్తగా వచ్చినవారిని నమ్మకూడదని చిన్నప్పుడు చదివిన తెలుగుపాఠం గుర్తులేదా? " అంది మిన్ను.

"అమ్మతల్లీ! అంత నోరెట్టకు. ఆయన వింటే బాధపడతాడు" ఆనంద్ నొచ్చుకున్నాడు.

"ఆయన మాటేమోగానీ ఆయనకంటే ముంధు నువ్వే బాధపడిపోతున్నావు. ఇంతకీ మీ అతిథి దేముడు ఎన్నిరోజులు తిష్ట వేస్తాడట? "

"నేనే రెండు రోజులుండమన్నాను. పాపం ఆయనేమో కుదరదు ఆరోగ్యం చక్కబడితే రేపే వెళ్లిపోతానంటున్నాడు."

"ఏం నీకు బెంగగా ఉందా? ఆయన ఆరోగ్యం మరో నాలుగురోజుల వరకూ చక్కబడదులే. ఈ అతిథి దేముడిని నాలుగు రోజులు సేవించుకునే భాగ్యాన్ని ఆయన నీకెలాగూ ప్రసాదిస్తాడుగానీ అనవసరంగా బెంగెట్టుకోకు. నాదో సలహా"

"ఏవిటది? "

"ఆ చెవిలా పారెయ్యి" అని ఆనంద్ చెవి దగ్గరగా నోరుపెట్టి, "ఎందుకైనా మంచిది బయటికెళ్లేటప్పుడు డబ్బు, దస్కం పర్సులో పెట్టుకుని వెళ్లు. ఇంట్లో మాత్రం పైసా కూడా ఉంచొద్దు. రోజులసలు బావుండలేదు. ఎవర్నీ నమ్మలేం. నువ్వాఫీసుకెళ్లాక డబ్బుతో ఉడాయిస్తే ఆనక ఘొల్లుమంటావు" అంది.

"నీకన్నీ అనుమానాలే. ఆయన ముఖం చూస్తే నీకా ఆలోచనేరాదు" అన్నాడు ఆనంద్.

"ఓ అమాయక చక్రవర్తీ దొంగముఖం మీద దొంగ అన్న ముద్ర ఉంటుందా ఏదన్నా అనుభవంలోకి వస్తేగాని తెలియదులే. సలహా చెప్పటం చెప్పాను. వింటే బాగుపడతావు. లేదంటే నీఖర్మ" మిన్నూ బయటకు వెడుతుంటే "మిన్నూ ఒక్కక్షణం ఆగు ఫ్లాస్కులో కాఫీ ఉంది తాగివెళ్లు" అన్నాడు.

"నేను నీ కాఫీకోసం రాలేదులే. ఎలాగూ సెలవేకదా సిన్మాకు తోడుగా వస్తావేమోనని అడగాలనొచ్చాను"

"పిక్చర్‌కయితే తప్పకుండా వెడదాం. ఎలాగూ ఈయన భోజనం చెయ్యరట. సిన్మాచూశాకే మనిద్దరం హోటల్లో భోంచేసి వచ్చేద్దాం" ఉత్సాహంగా అన్నాడు.

"ఈ సండే వద్దులే. నెక్స్ట్ వీక్ వెడదాం" ఆనంద్ ఇచ్చిన కాఫీ అందుకుంది.

"మిన్నూ ఒక్కమాటడుగుతాను, కోపం తెచ్చుకోవుకదూ" ఆనంద్ అభ్యర్థనగా అన్నాడు.

"నువ్వు కాఫీ లంచంగా ఇచ్చినప్పుడే ఇలాంటిదేదో ఉందని అనుకున్నాలే. చల్లకొచ్చి ముంత దాచటందేనికి. నువ్వడగాలనుకున్నదేదో అడిగెయ్యి" అంది.

"మన పెళ్లివిషయం ఇంకా నువ్వు ఓ నిర్ణయానికెందుకు రాలేకపోతున్నావు? "

"ఇదే విషయం చాలాసార్లడిగి నన్ను బోర్ కొట్టిస్తూనే వున్నావు. నీకు సమాధానం చెప్పటం నావల్లకాదు నందూ"

"ప్లీజ్ మిన్నూ నన్ను నువ్వెందుకు అంగీకరించలేకపోతున్నావో నీవైపునున్న రీజనేమిటో మనసువిప్పి చెప్పు. ఇక ఎప్పుడూ విసిగించను" ఆనంద్ బతిమాలాడు.

"అయితే విను, మొదటి కారణం నాకిప్పట్లో పెళ్లిచేసుకోవాలని లేదు. రెండోకారణం నీకున్న అర్హతలకు నేను తగను. మూడోకారణం పెళ్లనేది నా దృష్టిలో ఓ అందమైన స్వప్నం. ఆ స్వప్నం నాలాంటి వారికి సుదూరం కాబట్టి దాని గురించి ఆలోచించదల్చుకోలేదు" అంది.

"అంటే... ఏడు గుర్రాల రథంమీద రాకుమారుడు భర్తగా వస్తాడని కలలు కంటున్నావా? " ఆనంద్ సీరియస్‌గా అడిగాడు.

"అదిగో అప్పుడే కోపమా! ఏడు గుర్రాల రాకుమారుడు వస్తాడనెలా ఊహిస్తాను. అలా ఊహించి కలలుకనే ముందు నా అర్హతలేమిటో తెలియనంత అమాయకురాలిని కాను"

"నీ అందమే నీకున్న అర్హతగా నువ్వు భావించొచ్చుగా"

"శారీరక అందం శాశ్వతమైనదికాదు నందూ. మానసిక అందం ముఖ్యం. కాలం ఎవ్వరినీ యవ్వనంతో మిగలనియ్యదు. బాల్యం తరువాత యవ్వనం ఎంత వాస్తవమో, వృద్ధాప్యం కూడా అంతేగా" మృదువుగా అంది.

"మరి నీకల ఎలాంటిదంటావ్? "

"నువ్వు విని హర్టవనంటే చెప్తాను"

"అలాగే చెప్పు వింటాను"

"విషయం విన్నాక కూడా మనస్నేహం చెడదని మాటివ్వు" చెయ్యి చాపింది.

"ఇదిగో ప్రామిస్ చేస్తున్నా" చేతిలో చెయ్యేశాడు.

"భర్తగా వచ్చే వ్యక్తి ఆ స్త్రీని మానసికంగా స్పందింపచెయ్యాలి. నీ సమక్షంలో నేనెప్పుడూ ఎటువంటి ఒత్తిడికి లోను కాలేదు. నిన్ను చూస్తే నాలో సోదరవాత్సల్యం ఉబుకుతుందేతప్ప భర్త అనే ఊహనే భరించలేను. అందుకే నిన్నాదృష్టితో చూడలేనునందూ" అనునయంగా అంది మిన్ను.

ఆనంద్ చాలాసేపు మాట్లాడలేకపోయాడు. మౌనంగా కూర్చున్న అతడ్ని చూస్తే మిన్ను మనసు చివుక్కుమంది. "నందూ నువ్వలా మౌనంగా ఏదోలా ఉంటే నాకు బాధగా ఉంటుంది. ఇంతకాలం ఈమాట నిన్ను నొప్పించటం ఇష్టంలేకనే చెప్పలేదు. నేనేం చెప్పినా మనమధ్య స్నేహం చెడదని మాటిచ్చావు. నిజంగా నీ స్నేహ హస్తం నాకు అండగా లేకపోతే నేను అనాధవుతాను. నా మాటలేవీ మనసులో పెట్టుకోకు. చక్కగా బామ్మగారు చూసిన అమ్మాయి మెళ్లో తాళికట్టి నీదనే తోడు తెచ్చుకో. ఓ ఇంటి ఆడపడుచులా నేను మీ ఇంటికి వస్తూపోతూ ఉంటాను. ఆడబిడ్డననేసరికి అధికారం చలాయిస్తాననుకోకు. మీనుండి పిసరంత -ఆదరాభిమానాలు తప్ప మరేవీ కోరుకోను" మిన్నూ మాటలు ఆనంద్‌ను ద్రవింపచేశాయి.

"సారీ మిన్నూ! ఇన్నాళ్లూ నీ మనసు తెలుసుకోకుండా నిన్ను నా మాటల్తో విసిగించుంటాను. నన్ను క్షమించు" అన్నాడు.

"నో... నో... అటువంటి మన్నింపులకు మన మధ్య తావులేదు. ఇప్పటికైనా నీ కర్థమయ్యేలా చెప్పగలిగాను. ఈరోజు నాకు చాలా సంతోషంగా ఉంది. ఈరోజుకిక నువ్వు వంట చేసుకోకు. మనిద్దరికీ కలిపి నేనే చేస్తాను. కలిసి భోజనం చేద్దాం" అంది.

"నీ ఇష్టం"

"థాంక్స్ వస్తానుమరి" చెప్పి వెళ్ళిపోయింది మిన్ను.

అప్పటివరకు నిద్రలో ఉన్న ఆ పెద్దమనిషి ఓ పదినిమిషాలు గడిచాక బద్ధకంగా లేచి ఒళ్లు విరుచుకుని "భలే నిద్రపట్టిందిరా అబ్బాయ్. ఒళ్ళంతో తేలికపడినట్టుంది" అన్నాడు.

"లేచారా... ఫ్లాస్కులో కాఫీ ఉంది తాగు

తారా? " అడిగాడు.

"నాకటువంటివి అలవాట్లేదురా అబ్బీ. ఉదయమే ఓ గ్లాసుడు గుమ్మపాలు తాగి రెండు పూటలా భోంచెయ్యటం తప్ప ఈ కాఫీ, టీలాంటి అలవాట్లు లేవు. ఇదిగో ఈ తీర్థయాత్రల పుణ్యమా అని ఒంటిపూట భోజనమే. కాసిని మంచినీళ్లో, ఇంట్లో ఉందంటే కాస్త మజ్జిగ నీళ్లో ఇవ్వు చాలు". అన్నాడాయన.

ఆనంద్ గ్లాసునిండా మజ్జిగ కలిపి ఇచ్చాడు. మజ్జిగ తాగాక "ఒరే అబ్బీ నీకెందుకుగాని అనవసరమైన శ్రమ ఏదన్నా సత్రమో, మఠమో ఉంటే చూపెట్టరాదు. ఒళ్లు బాగయ్యేవరకు అక్కడే ఉంటాను" అన్నడాయన.

"ఒక్క ఊరివాళ్ళం. నన్ను పరాయిగా భావించకండి. సత్రం, మఠం ఇవన్నీ మీకొద్దుగాని నా ఇంట్లోనే ఉండండి. నాకెటువంటి శ్రమాలేదు" అన్నాడు ఆనంద్.

కాసేపు గడిచాక గదిగోడలు పరికిస్తూ, "ఇవేం కొంపలురా నాయనా! అవతలివారికి, మనకు మధ్యనున్న పార్టిషన్ గోడ అంత చిన్నదిగా కడితే వాళ్లింటి భాగోతం మనకు, మన గోల వాళ్ళకు విన్పించదా. పైన ఓ మిద్దెలేదు, పాడూలేదు. వేసవికాలం పైనుండి లోపలిక్కొట్టే ఎండ తాపానికి నాలాటి ముసలి ప్రాణమైతే హరీమంటుంది. నా మాట విని ఇల్లు మారిపో. ఇంటి యజమానికి డబ్బుమీద ఆశేగాని ఇంట్లో అద్దెకున్నవారి అగచాట్లు పట్టించుకునే పద్ధతున్నవాడిలా లేడు" అన్నాడు.

"ఓనరు మా బాధలు పట్టించుకున్నా, పట్టించుకోకపోయినా ఇల్లు మారడం కుదరదులెండి. మనం మరో ఇంటికి మారితే మరో ఏభయ్యో, వందో అదనంగా మన మీద భారం పడ్డం మినహా ఎక్కడైనా ఫెసిలిటీస్ ఇంతే. మనక్కావలసింది ఇంత నీడ, వాళ్ళక్కావలసింది బాడుగ. అంతకుమించి ఇల్లు గురించి, మన సౌకర్యాల గురించిగానీ పట్టించుకోవడానికి ఇవి మన ఊరులాంటి పల్లెలుకావు" ఆనంద్ వివరంగా చెప్పాడు.

"బాగానే ఉంది. కాస్త పొడుగైన మనిషయితే ఈ పార్టిషన్ గోడమీదనుండి అవతలింట్లోకి సునాయాసంగా దూకెయ్యచ్చు. అంత చిన్న ఎత్తులో ఉంది" అట్టే ఎత్తులేని ఆ పార్టిషన్ గోడనే పరికించి చూస్తూ అన్నాడాయన.

ఆయన చేతిసంచిలో ఉన్న అరటిపళ్ళు తీసి తింటుండగా మిన్ను హడావుడిగా లోపలికొచ్చి, "నందూ! కామాక్షమ్మగారోసారి రమ్మని కబురుపెట్టారు. నేను వాళ్ళింటికే వెడుతున్నాను. పనేంటో తెలియదుగదా నేను రావడంగానీ ఆలస్యమైతే నీకాకలిగా ఉంటే వెళ్ళి భోజనం వడ్డించుకో. లేదంటే నేనొచ్చేవరకు ఆగు. తాళాలివిగో, ఈ బల్ల మీద పెడుతున్నాను" అంటూ చెప్పి వచ్చినంత హడావుడిగానూ వెళ్ళిపోయింది.

"ఎవరా అమ్మాయి? పిల్ల చాలా చలాకీగా దబ్బపండులా ఉంది" అన్నాడాయన.

"మన పక్క రూములోనే అద్దెకుంటుంది. పేరు మిన్ను"

"ఉంటుందీ అంటే ఆ అమ్మాయి ఒంటరిగానే ఉంటోందా? అమ్మా, బాబు ఎవరూ లేరా? "

"లేరు. ఒంటరిగానే ఉంటోంది"

"అయ్యో పాపం! పిల్ల చూడముచ్చటగా ఉంది. కొంపదీసి ఈ పిల్లమీదే నువ్వు మనసు పారేసుకోలేదుగదా" అనుమానంగా అడిగాడాయన.

"అదేంలేదు"

"ఇంతకీ ఆ అమ్మాయుండేది ఈ రూమ్‌లోనా, అటుపక్క రూమ్‌లోనా? "

"అటువైపు కాదు. ఇటు పక్క రూమ్‌లోనే" కుడివైపు చూపించాడు.

మర్నాడుదయం ఎనిమిదిన్నరకే ఎవరు డ్యూటీకి వాళ్ళు బయల్దేరారు. "బాబాయిగారూ! మీకోసం అన్నం, కూరలు... అన్నీ ఆ బల్లమీద సర్దిపెట్టాను. మీకాకలి అన్పిం

చినప్పుడు లేచి భోంచెయ్యండి. కంచం, మంచినీళ్ళచెంబు అన్నీ అక్కడే ఉన్నాయి" చూపించాడు.

"నువ్వెళ్ళరా అబ్బీ. నాకు ఆకలి వేసినప్పుడు నేను తింటాలే. అన్నం తిన్నాక ఓ కునుకుతీస్తే, లేచేసరికి నువ్వే వచ్చేస్తావు. ఏదోలా కాలక్షేపమయిపోతుంది" అన్నాడాయన.

"మరి నేను వెడతాను" బాక్స్ తీసుకుని సైకిలుమీద బయల్దేరాడు ఆనంద్. అతడి వెనకే మిన్నూ కూడా తన రూమ్‌కి తాళం పెట్టి హేండ్‌బ్యాగ్‌లో వేసుకుని "వెడతానండీ, బాబాయిగారూ ఇల్లు జాగర్త" అని చెప్పి ఆనంద్ వెనుకే నడిచింది.

"అలాగే" వాళ్ళిద్దరూ వీధి మలుపు తిరిగేవరకూ చూసి లోపలికి వెళ్ళి తలుపు గడి వేసుకున్నాడు.

ఓ గంట గడిచాక అప్పటివరకూ నిశ్శబ్దంగా పడుకున్న ఆయన చప్పుడు కానివ్వకుండా లేచి బల్లమీదున్న గిన్నెలన్నీ కిందకు దించి బల్లను కుడివైపున్న గోడకు దగ్గరగా జరిపి బల్లెక్కి గోడ ఎత్తును కళ్ళతో కొల్చుకుని ఒక్కసారే బలంగా గోడమీదకు జంప్ చేసి అవతలి గదిలోకి చూశాడు. అదృష్టం కొద్దీ అటుపక్క గోడకు చేర్చి మడతమంచం కన్పించింది. రెండుచేతుల్తో గోడ అంచును పట్టుకుని మంచంమీద కాళ్ళు ఆన్చి నెమ్మదిగా బేలన్స్ తప్పకుండా కిందకు జారాడు.

గదంతా ఎవరికీ అనుమానం కలగనిరీతిలో అంగుళం, అంగుళం పరిశీలించి పరిశోధించినా అతడిక్కావలసిన వస్తువు లభించలేదు. సూట్‌కేస్‌లో సర్ది ఉన్న బట్టలు కూడా ఒక్కొక్కటీ తీసి దులిపి మళ్ళీ అలాగే సర్దేశాడు.

మిన్నూ విషయంలో ఈసారి తను ఫెయిలైనందుకు మథనపడుతూ సాలోచనగా పైకిచూసి, నెమ్మదిగా గెడ్డం గోక్కుంటూ నిలబడ్డ అతడికి ఇంటి పైకప్పుకు, గోడకు మధ్య ఉన్న ఖాళీలో ఉన్న పిచ్చుకగడ్డితో గుబురుగా పేర్చిన గూడు కన్పించింది. అతడి కళ్ళలో చిన్న మెరుపు మెరిసింది. గదిలో ఉన్న కుర్చీని గోడకి దగ్గరగా జరిపి చిన్న స్టూలుంటే ఆ కుర్చీమీద పెట్టి పైకెక్కి గూడునందుకునే ప్రయత్నం చేశాడు. కొద్దిగా పాదాలు ఎత్తి పెట్టేసరికి గూడు చేతికందింది. ఆ గడ్డిలో తడుముతున్న అతడి చేతికి పాతగుడ్డలో చుట్టిన ఫొటో రీలు ఒత్తుగా తగిలింది. చటుక్కున బయటకు తీసి విప్పి చూసిన అతడి కళ్ళు విజయగర్వంతో మెరిశాయి. దాన్ని జేబులో వేసుకుని స్టౌ పక్కనే ఉన్న ఖాళీ అగ్గిపెట్టెలను అదేగుడ్డలో చుట్టి యథాస్థానంలో ఉంచి కుర్చీమీదనుండి కిందకు దిగి ఎక్కడి కక్కడే అనుమానం కలక్కుండా సర్దేసి తిరిగి గోడ దూకి ఆనంద్ రూమ్‌లోకొచ్చి పడుకున్నాడు ఆ పెద్దమనిషి

సాయంత్రం ఆనంద్ వచ్చేవరకు ముళ్ళమీదున్నట్టే గడిపి అతడింటికొచ్చేటప్పటికి బయట వరండాలో అతడి రాకకోసమే ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

"ఏమిటక్కడ నిలబడ్డారు? రూమ్‌లో ఒంటరిగా ఏమీ తోచడంలేదా?" ఆనంద్ నవ్వుతూ అడిగాడు.

"నేనిక్కడ ఉండలేనురా అబ్బీ. ఈ పూట ఆరోగ్యం బాగుపడినట్టే ఉంది. నాకు సెల విప్పిస్తే వెడతాను" అన్నాడు.

"ఈరోజుకుండి రేపుదయమే వెళ్ళొచ్చుగా" ఆనంద్ అన్నాడు.

"రేపు ఉదయానికి తిరుపతి వరకు వెళ్ళిపోవచ్చు నాలాంటి ముసలివాడికి కాలం చాలా విలువయింది. కాస్త నీ చేత్తో ఓ గ్లాసుడు మంచినీళ్ళిచ్చేవంటే తాగి వెళ్ళిపోతాను. ఆ మాట నీతో చెప్పిపోవాలనే గంటనుండి నీకోసం ఎదురుచూస్తూ ఇక్కడ నిలబడ్డాను" అన్నాడాయన.

"పదండి" ఆనంద్ లోపలికొచ్చి మజ్జిగ కలిపి ఇచ్చాడు.

గడగడా తాగేసి ఖాళీగ్లాసు కిందపెట్టి

"మీ పక్కింటి పిల్ల ఇంకా రాలేనట్టుందే" అన్నాడు.

"లేదు"

"ఆ పిల్లొస్తే నేను వెళ్ళానని చెప్పు. ఆ పిల్లకోసం చూస్తూ కూర్చుంటే పుణ్యకాలం కాస్తా దాటిపోతుంది" చెప్పి చేతిసంచీ భుజాన తగిలించుకుని వణుకుతున్న శరీరంతో భారంగా అడుగులేసుకుంటూ వెళ్ళాడాయన.

మిన్నూ వస్తూనే, "ఏడి మీ అతిథిదేవుడు. నువ్వొచ్చేసరికే ఉడాయించేశాడుకదూ? " అంది ఆనంద్‌తో.

"అలాంటిదేంలేదు. నేనొచ్చేవరకు వెయిట్‌చేసి చెప్పి మరీ వెళ్ళాడు. నీతో కూడా చెప్పమన్నాడు"

"ఎందుకైనా మంచిది గదిలో అన్ని వస్తువులు భద్రంగా ఉన్నాయోలేదో చూసుకో" అంది పరిహాసంగా.

"ఆడబుద్ధి అని అందుకే అన్నట్టున్నారు. అన్నీ ఎక్కడివక్కడే ఉన్నాయి. దయచేసి ఆయన విషయంలో ఎటువంటి అనుమానాలు పెట్టుకోవద్దు. నాకు బాధగా ఉంటుంది" అన్నాడు.

"అవున్లే ఎంతయినా మీ ఊరువాడుకదా ఆ పాటి అభిమానముండడం సహజమే" మిన్ను తన రూమ్ తాళంతీసి లోపలికి వెళ్ళింది.

★ ★ ★

అక్కడినుంచి తిన్నగా శ్రావణ్ వద్దకు వెళ్ళి ఫొటో రీల్ ప్రహసనం చెప్పాడు. ఆశ్చర్యపోయాడు శ్రావణ్.

"సంపాదించావా? అసలెక్కడ దొరికింది? "

"నేను ముందే ఊహించి చెప్పానుగా! మిన్నూ దగ్గరే ఉంటుందని"

"రియల్లీ యూ ఆర్ గ్రేట్! అయామ్ ప్రౌడ్ ఆఫ్ యూ" అభినందించాడు శ్రావణ్.

"థాంక్స్!" అని.

"రామిరెడ్డికి సంబంధించిన వివరాలు క్లియర్‌గా సేకరించావా? " అడిగాడు సిద్ధార్థ.

"అగ్నికణం పత్రికపేరు విన్నావా? "

"విన్నాను. పెద్దమనుషుల నిజాలను నిగ్గుతేల్చే పత్రిక మాదని వాళ్ళు చెప్పుకుంటుంటారు.

"దానికి రామిరెడ్డి బావమరిది రామానుజం మేనేజింగ్ పార్ట్‌నర్. పేరుకు రామానుజం నడుపుతున్నా దాని విషయంలో పరోక్షంగా కీలకపాత్ర రామిరెడ్డిదే. ఊళ్ళో ఘరానావ్యక్తుల గుట్టుమట్లన్నీ బయటపెట్టడంవల్ల ఆ పత్రికంటే చాలామందికి హడల్. సాక్ష్యాధారాలతోసహా పత్రికకెక్కించడంలో విషయసేకరణకు మేఘశ్యామ్‌లాంటి అమాయకుల్ని పావులుగా వాడుకోవడం వాళ్ళపని. అమరేంద్ర రామిరెడ్డి రైవల్ కాబట్టి అతడికి సంబంధించిన సీక్రెట్ లైఫ్ మీద నిఘా ఉంచే పని శ్యామ్‌కు అప్పగించేడన్నమాట. శ్యామ్ ఎవరూలేని ఒంటరివాడు కావడం రామిరెడ్డికి ఎడ్వాంటేజయ్యింది. శ్యామ్ మరణానికి పరోక్షంగా రామిరెడ్డే కారకుడు" శ్రావణ్ చెప్పాడు.

"అయితే శ్యామ్‌కు రామిరెడ్డితో కంటే రామానుజంతోనే లింకు ఉండి ఉంటుంది. మిస్టర్ ఆర్ అంటే రామానుజం అనుకోటానికే ఎక్కువ అవకాశముందని నా అభిప్రాయం" సిద్ధార్థ అన్నాడు.

"యు ఆర్ రైట్. అయితే మేఘశ్యామ్‌ని మర్డర్ చేసింది మాత్రం రామానుజంగానీ, రామిరెడ్డిగానీ కాదు"

"అది తెలుసుకోవాలంటే వీటిని ప్రింట్స్ వేయించాలి. అంతవరకు మనం ఏదీ నిర్ధారించకూడదు" సిద్ధార్థ అన్నాడు.

"అందుకే ఆ పనేదో త్వరగా అయ్యేలా చూడు. ఈ కేసు విషయం ఎంత త్వరగా తేలితే మనకంత హేపీ" శ్రావణ్ అన్నాడు.

"నిజమే నేను ఆ ప్రయత్నంలోనే ఉన్నాను. హేపీ మాటెలా ఉన్నా ఈ

కేసులో మోటివ్ ఏమిటో తెలిసింది కాబట్టి శ్యామ్‌లా మరెవ్వరూ బలికాకూడదు" సిద్ధార్థ వెళ్ళడానికి లేచాడు.



బస్‌స్టాపులో బస్‌కోసం వెయిట్‌చేస్తూ ఏదో ఆలోచిస్తున్నట్టు నిలబడ్డ మిన్ను తనకు కాస్తదూరంలో చిన్నీ స్కూటరాపటం చూడనే లేదు.

"హలో" అతడే పలకరించాడు.

ఉలికిపడుతూ ఇటుతిరిగి చూసిన మిన్ను ముఖంకొద్దిగా ఘుడుచుకుని "హలో" అంది.

"బస్‌కోసం వెయిట్ చేస్తున్నట్టున్నారు. మీకభ్యంతరం లేకపోతే రండి మీ ఇంటివరకు లిఫ్ట్ ఇస్తాను" అన్నాడు.

"నో థ్యాంక్స్" ముఖం తిప్పేసుకుంది.

"ఆకలెయ్యనివాడికి పిలిచి అన్నంపెట్టాలనుకోటం పొరపాటే లెండి. వస్తా" స్కూటర్ స్టార్ట్ చేసుకుంటూ వెళ్ళిపోయాడు చిన్నీ.

అతడు కనుమరుగయ్యేవరకు వెనుకనుండి చూస్తూనే ఉంది. ఆరోజు అతడు చేసిన అల్లరి గుర్తురాగానే ఆమె చెంపలు రోజారంగుకు మారాయి. కళ్ళు బరువుగా కిందికి వాలిపోయాయి. శరీరం ఎందుకో బరువెక్కిన ఫీలింగ్. ఆరోజు... అతడి స్పర్శలో తనెందుకంతగా మైమరిచి పోయింది. ఒళ్లు మరిచి మరింత దగ్గరగా అతడ్ని హత్తుకుపోవటం ఇప్పటికీ ఆ దృశ్యం జ్ఞాపకానికొస్తే సిగ్గుగా అన్పిస్తుంది. తనను స్పందింపచేయగల మగాడేగాని తనకందనంత ఎత్తులో ఉన్నవాడు. అటువంటి ఆశను ఊహల్లోనైనా పెంచుకోటం ఆరోగ్యకరం కాదు"

ఆలోచిస్తుండగానే బస్‌రావటంతో గబగబా బస్ దగ్గరకు పరుగెత్తింది మిన్ను.

ఇంటికొచ్చేసరికి అప్పటికే ఆనంద్ మిల్లు నుండి వచ్చినట్టున్నాడు స్నానంచేసి ఫ్రెష్‌గా తయారై టీ తాగుతున్నాడు.

"ఈరోజు లేటయినట్టుందే" రూమ్ తాళం తీస్తున్న మిన్నూని అడిగాడు.

"సెంటర్‌నుండి బయటపడే సరికే ఐదున్నరయింది. బస్‌కోసం మరోఇరవై నిమిషాలు వెయిట్ చెయ్యాల్సొచ్చింది" అంది విసుగ్గా.

"టీ పెట్టకు. నీకోసం ఫ్లాస్కులో సిద్ధంగా ఉంది. ముఖం కడుక్కొచ్చి టీ తాగు" అన్నాడు.

"థ్యాంక్స్. ఇప్పుడు టీ కాచుకునే ఓపిక్కూడాలేదు. బాగా టైర్డ్‌గా ఉంది. ముఖంకడుక్కొస్తాను" టాయిలెట్ వైపు వెళ్ళింది మిన్ను.

మిన్ను వచ్చి టీ తాగుతుండగా "బామ్మ లెటర్ రాసింది. నర్సాపురంలో సంబంధమేదో ఉందట, ఆఫీసుకు రెండురోజులు సెలవుపెట్టి రమ్మని, పిల్లను చూడ్డానికి వెళ్ళాలని ఆర్డరు జారీచేసింది" ఆనంద్ చెప్పాడు.

"ఇంకేం బామ్మగారి మాట బంగారు బాటనుకో. మీ ఊరెప్పుడు వెడతావు" మిన్ను ఉత్సాహంగా అడిగింది.

"నాకయితే ఇప్పట్లో పెళ్లిచేసుకోవాలని లేదు. ఓ సంవత్సరం ఆగమని లెటర్ రాసి పోస్టుచేసేశాను" అన్నాడు.



"ఆ పెద్దావిడను ఈ వయసులో అలా బాధపెట్టడం అంతమంచిది కాదు. ఈ విషయంలో నువ్వు మరీ తెలివితక్కువగా బిహేవ్ చేస్తున్నావు" చిరుకోపంగా అంది.

"అలాంటిదేంలేదు గానీ లేనిపోని ఊహల్తో అనవసరంగా మధనపడొద్దు. అన్నట్టీరోజు ఓ విచిత్రం జరిగింది? " ఆనంద్ చెప్పాడు.

"ఏవిటూ విచిత్రం? "

"చిన్న మసీదు వెనక వీధిలో ఖాన్‌సాబ్ నడిపే చిన్న కాకాహోటలుంది తెలుసుగా" అడిగాడు ఆనంద్.

"తెలుసు ఓ రెండు మూడుసార్లు మనిద్దరం ఆ హోటల్‌కెళ్ళి టీ కూడా తాగేం"

"ఇందాక మా ఫ్రెండొకడు నాకూడా మాటాడుతూ వస్తుంటే ఇక్కడివరకు ఎలాగూ వచ్చాడు కదా అని వాడిని 'టీ తాగుదాం రమ్మని' ఆ హోటల్‌కు తీసుకువెళ్లాను. మేమిద్దరం టీ తాగుతుండగా ఇద్దరు వ్యక్తులు అదే హోటల్‌కొచ్చారు. ఇద్దరి ముఖాలూ రాటుతేలిన రౌడీ ముఖాల్లా ఉన్నాయి. వాళ్ళిద్దరూ వెళ్ళి ఖాన్‌సాహెబుతో మెల్లిగా మాటాడ్డం నేను దూరం నుండి చూస్తూనే ఉన్నాను. మాటాడుతూ, మాటాడుతూ ఖాన్‌సాహెబు మూలగా టేబుల్ ముందు కూర్చున్న నన్ను వేలు పెట్టి వాళ్ళకు చూపించాడు. నా గుండెలో రాయిపడింది. వాళ్లిద్దరు ఖాన్ సాహెబ్‌నొదిలి నా టేబుల్ దగ్గరకొచ్చారు. ఎంత ధైర్యం తెచ్చుకోవాలన్నా వస్తాదుల్లా ఉన్న వాళ్లను చూస్తే నా వల్లకాలేదు. వాళ్ళు దగ్గరకు వచ్చి "మిన్నూ అన్న పిల్ల నీకు తెలుసా? " అని అడిగారు. "తెలుసు" అన్నాను. "ఆ అమ్మాయి ఇల్లెక్కడుందో తెలుసా? " అని అడిగారు. "ఆ అమ్మాయితో మీకేం పని? " అడిగాను. "అది నీకనవసరం బే. అడిగిందానికే జవాబు

చెప్పాలి. మరొక్క మాట హెచ్చుమాటాడితే మాకు నచ్చదు" ఇద్దరిలో రెండోవాడు కరుగ్గా మాటాడేడు. నిజం చెప్పొద్దూ వాళ్ళ వాలకంచూస్తే నా పైప్రాణాలు పైకే పోయినట్టయింది. ఎందుకైనా మంచిదని చిన్న అబద్ధం చెప్పి తాత్కాలికంగా తప్పించేసుకున్నాను" చెప్పటం ఆపాడు.

"ఏ అబద్ధం చెప్పావు" మిన్ను అడిగింది ఆదుర్దాగా.

"ఇంకేం చెప్తాను. ఆ అమ్మాయి మొన్నటివరకు మా కాలనీలోనే ఉంది. అద్దె సరిగా కట్టకపోవటంవల్ల ఓనరు బలవంతంగా, ఇల్లు ఖాళీ చేయించటంవల్ల తప్పని పరిస్థితుల్లో వెళ్ళిపోయింది" అని చెప్పాను.

"ఆ పిల్ల ఖాళీచేసి ఎక్కడికెళ్ళిందో తెలుసా? " అని ఒకడు మళ్ళీ అడిగాడు.

"శాటిలైట్ సిటీ వైపెక్కడో ఇల్లు దొరికినట్టు చెప్పింది. నాకంతకుమించి తెలియదు" అని చెప్పటంతో ఒకరి ముఖాలొకరు చూసుకుని అక్కడనుండి వెళ్ళిపోయారు. అయినా నాకెందుకో ముందుచూపుతో వ్యవహరించటం మంచిదనిపించి నేను నేరుగా ఎప్పుడూ వచ్చే రూట్లో రాకుండా అలా చుట్టుతిరిగి వెనుకదారి నుండి వచ్చాను" వివరంగా చెప్తుంటే వింటున్న మిన్ను ముఖం వివర్ణమయ్యింది.

"వాళ్ళిద్దరూ ఎలా ఉన్నారు? " అడిగింది.

"చెప్పానుగా విలన్ ముఖాలు వాళ్ళూను రౌడీషీటర్స్‌లా ఉన్నారు. ఒకడికయితే పిల్లిగెడ్డం, మెళ్ళో వెండి తాయెత్తుతో, వాడి గొంతు వినటానికి భయంకరంగా డబ్బాలో గులకరాళ్ళు వేసినట్టుంది" అంటూ వాళ్ళ ఆకార స్వభావాలు వర్ణించాడు.

"ఇంతకీ వాళ్ళెవరయ్యుంటారు? " సాలోచనగా అంది.

"అది నాకెలాతెలుస్తుంది. ఏదన్నా ప్రశ్నించి వివరాలు రాబట్టాలన్నా వాళ్ళ వైఖరి చూస్తే ఒక్కమాటెక్కువ మాటాడినా ఓ పిడిగుద్దు గుద్దే ఫోజులో ఎలర్ట్‌గా కనిపించారు. అందుకే నోర్మూసుకుని వచ్చేశాను. నిజంగానే వాళ్ళ గురించి నీకూ తెలియదా? " అడిగాడు ఆనంద్.

"తెలియదునందూ"

"వాళ్ళకు నీగురించి ఆరా తియ్యాల్సిన అవసరం ఏమిటంటావ్? " సాలోచనగా అన్నాడు.

పెదవి విరిచింది. "నువ్వు చెప్పిందాన్నిబట్టి వాళ్ళు రౌడీషీటర్లని అర్థమయింది. అటువంటి ముఖాలనెప్పుడూ నేను చూడనేలేదు" అంది.

"ఏమైనా సరే నువ్వు చాలా జాగర్తగా ఉండాలి మిన్నూ. లేకపోతే చిక్కుల్లో పడతావు. నా మనసెందుకో కీడును శంకిస్తోంది" ఆనంద్ హెచ్చరించాడు.

మిన్ను మవునంగా తలూపింది.

"అయినా ఆ శ్యామ్‌తో స్నేహం వద్దని నేను ముందునుండీ చెప్తూనే ఉన్నాను. నా మాట వినలేదు. వాడెలా చచ్చాడో తెలియదు అర్థాంతరంగా చచ్చి ఊరుకున్నాడు. వాడు నిజంగా సూయిసైడు చేసుకున్నాడో, కక్షకట్టి ఎవరైనా హత్యచేశారో కూడా ఇప్పటికీ తేలలేదు. ఇప్పుడిలా ఈ గూండాలు నీ గురించి అడుగుతున్నారంటే నాకు చాలా భయంగా ఉంది" ఆందోళనగా అన్నాడు ఆనంద్.

"ఏం జరిగినా మనమేమీ చెయ్యలేం నందూ విధి రాతెలా ఉంటే అలానే జరుగుతుంది. దాన్నెవ్వరూ తప్పించలేరు" నిశ్చలంగా అంటుంటే ఆనంద్‌కు ఒళ్ళు మండింది. "అదే... అన్నిటికీ ఓ పెద్ద ఫిలాసఫర్లా ఆ వేదాంతధోరణే నాకు కోపాన్ని కల్గిస్తుంది. జరిగేది ఆపలేమని బోనులో ఉన్న పులిని బయటకొదిలి ఎదురుగా నిలబడం కదా. కాస్త నీ జాగర్తలో నువ్వుండడం మంచిది" విసుగ్గా చెప్పాడు.

"అలాగే నందూ. కోరి వెళ్ళి ప్రమాదాన్ని కౌగలించుకునేంత పిచ్చిదాన్ని కాదులే. నాకూ బతుకుమీద తీపి ఉంది, ఆశా ఉంది" మిన్నూ నవ్వుతూ అంది.

ఆ రాత్రంతా మిన్నూకు నిద్రపట్టనేలేదు. ఆనంద్ చెప్పిన ఆ ఇద్దరి ఆగంతకుల గురించే ఆలోచిస్తోంది. "ఒకవేళ వాళ్ళను ఆ రామిరెడ్డే పంపించాడేమో" ఆ ఊహ రాగానే ఒళ్ళు ఒక్కసారి జలదరించింది. వాళ్ళు తనకోసం ఆరాతీసేది ఆ ఫొటో రీలుకోసమే అయ్యుంటుంది. నీలినీడలు తనను వెంటాడి వేధిస్తూనే ఉంటాయి. దాన్ని తగులబెట్టి బూడిదచేసెయ్యాలి. అప్పుడే ఈ కథకు తనవైపునుండి తెరపడుతుంది" ఓ నిర్ణయానికొచ్చాక కాస్త నిశ్చింత చేకూరింది.

ఉదయమే నిద్రలేచాక పక్కింటివారినడిగి నిచ్చెన తెచ్చింది.

పిచ్చుకగూడును మొత్తం కిందకు తీసిపెట్టింది. ముందు జాగ్రత్తగా తలుపు గడియ పెట్టి పిచ్చుక గూడునంతా విప్పదీసి గుడ్డలో చుట్టబెట్టిన రీలుకోసం దులిపేసరికి అందులోనుండి రెండు ఖాళీ అగ్గిపెట్టెలు కిందపడడం చూసి షాక్ తింది. ఇంకా అనుమానం తీరక ఎంత వెదికి చూసినా ఫొటో రీలు కన్పించలేదు. మిన్ను మతితప్పినదానిలా వెళ్ళి మంచంమీద కూలబడ్డది.

"తను స్వయంగా దాచిన రీలు ఏమయినట్టు. అసలది తన దగ్గరే ఉన్న విషయం మరణించిన శ్యామ్‌కు, తనకు తప్ప మూడో వ్యక్తికి తెలిసే అవకాశం లేదు. రామిరెడ్డి అయినా ఏదో కాస్త ఊహను జోడించి "శ్యామ్ నీ దగ్గర దాస్తే ఇచ్చెయ్యమని రిక్వెస్టు చేశాడే తప్ప తన దగ్గరే ఉందని డిమాండ్ చేసి బ్లాక్‌మెయిల్ చెయ్యలేదు. మరెవరి పనో అయ్యుంటుందిది. తమ విషయం తెలిసిన మరో అజ్ఞాత వ్యక్తెవరో రంగంలో ఉన్నాడన్నమాట. తనింట్లోకి ఎవరూ, ఎప్పుడూ చొరబడిన దాఖలాల్లేవు. మరెలా మాయమైందది? శ్యామ్ సమాధిచేసెయ్యమన్న రహస్యం మరో వ్యక్తి చేతిలోకి వెళ్ళిపోయింది. ఇదెలా సంభవించింది" మిన్ను గది శుభ్రంచెయ్యటం కూడా మరిచి గదిలో సీరియస్‌గా పచార్లు చేస్తూ ఆలోచించింది.

సాయంత్రం స్టిచింగ్ సెంటర్‌నుండి ఇంటికొస్తూ దారిలో పబ్లిక్ టెలిఫోన్ బూత్ దగ్గర ఆగి పరిసరాల్లో ఎవరూ తనను గమనించడంలేదని నిర్ధారణకొచ్చాక లోపలికెళ్ళింది. విజిటింగ్ కార్డులో ఉన్న రామిరెడ్డి ఫోన్ నెంబరుకు డయల్ చేసింది.

అవతల్నుండి "హలో రామిరెడ్డి హియర్"

"నేను మిన్నూని మాట్లాడుతున్నాను" అంది.

"ఓ నువ్వా మిన్నూ... నువ్వు నా దారికొస్తావని తెలుసు. చెప్పు ఫొటోరీలు ఎప్పుడందచేస్తావు" అడిగాడు అట్నుండి.

"క్షమించండి. నేను చెప్పేది పూర్తిగా విన్నాక అప్పుడు మాట్లాడండి. మీరారోజు దారిలో నన్నాపి దాని గురించి అడిగినప్పుడు నాకా విషయం తెలియదని అప్పుడూ చెప్పాను. మళ్ళీ ఇప్పుడూ చెప్తున్నాను. నా దగ్గర లేదని ఎంత మొత్తుకున్నా మీ మనుషుల్ని పంపి నాకోసం ఎందుకు వెదికిస్తున్నారో చెప్పండి"

"మా మనుషుల్ని నీకోసం వెదికిస్తున్నానా. ఈ కల్పన ఎవరు చెప్పారు? "

"ఎవరు చెప్తేనేం అది నిజమా కాదా? మీ మనుషుల్ని పంపి నన్ను టార్చర్ చెయ్యటంలో మీ ఉద్దేశ్యమేమిటన్నది మీరు స్పష్టం చెయ్యాలి" గట్టిగానే అడిగింది.

"నువ్వీ విషయంలో పూర్తిగా పొరబడ్డావు. మనుషుల్ని నీ గురించి పంపేవాడినే అయితే నిన్ను టాకిల్ చెయ్యటానికి నేనే డైరెక్టుగా స్క్రీన్‌మీద కెందుకొస్తాను. పైగా నా విజిటింగ్ కార్డ్‌నీకెందుకిస్తాను. నీకేదో అపకారం చేసే ఉద్దేశ్యమే ఉంటే నా అంతట నేనే నీకు విజిటింగ్ కార్డిచ్చి మరీ పట్టుబడతానా. నిదానంగా ఆలోచించి చూడు" అన్నాడు శాంతంగా.

"సారీ నేనంత దూరం ఆలోచించలేదు" నొచ్చుకుంది.

"ముఖ్యంగా నేనూ నీ శ్రేయోభిలాషినే అని గుర్తిస్తే నామీద నీకే అపోహలూ రావు" అన్నాడు.

"నిజమే మీ విషయంలో నేనే పొరబడ్డాను. నా మాటమీద మీకు విశ్వాసముంటుందనే నా నమ్మకం. ఆ ఫొటో రీలు నిజంగా నాదగ్గరలేదు. కావాలంటే నా ఇల్లు అంగుళం, అంగుళం పరిశీలించినా నాకభ్యంతరంలేదు. వచ్చి సోదాచేసుకోండి. మీరు డబ్బిస్తానన్నాక కూడా నా దగ్గరుంటే మీకెందుకివ్వను. ఆ డబ్బు విలువెంతో ఏ ఆసరాలేని నాకు తెలుసు. క్షణక్షణం ఆకలి, పరిస్థితులతో పోరాడుతూ రాజీపడుతూ బతుకుతున్న ఈ ఒంటరి ఆడపిల్లకు మీరిస్తానన్న ఏభయివేలు కొండంత ఆసరా"

"నిజమే మిన్నూ. ఐపిటీయు. ఫొటో రీలు నీ దగ్గరలేదని కన్‌ఫర్మ్‌డ్‌గా నాకూ తెలుసు. వారంరోజులకిందటే అంటే నిన్ను కలిసి మాట్లాడిన మర్నాడే శ్యామ్‌ఫ్రెండ్ గణపతి నన్ను ఫోన్లో కాంటాక్టుచేసి ఆ ఫొటోరీలు అతడి దగ్గరుందని చెప్పాడు. అది నాకెప్పుడందచేసేదీ మళ్ళీ ఫోన్ చేస్తానని చెప్పాడు. ఇప్పటివరకు పత్తాలేడు. నేనూ అతడ్నుండి కాల్‌కోసం ఎదురుచూస్తున్నాను" వివరంగా చెప్పాడు.

"గణపతా! ఆయనెవరు? "

"శ్యామ్‌కు ముఖ్యమైన స్నేహితుడినని చెప్పాడు. అతడెవరైందీ నీకు తెలిసే ఉండొచ్చు"

"క్షమించండి... శ్యామ్ స్నేహితుల్లో గణపతనే వ్యక్తి ఉన్న విషయమే నాకు తెలియదు. వృత్తిరీత్యా శ్యామ్‌తో సత్సంబంధాలే తప్ప అతడి వ్యక్తిగత విశేషాలు, ఫ్రెండ్ సర్కిల్ ఇవేవీ నాకు తెలియదు" అంది మిన్నూ.

"అఫ్‌కోర్స్. చూడమ్మా లోకంపోకడ పూర్తిగా తెలిసినవాడిని, నువ్వు నీ జాగర్తలో ఉండాలి"

"ఏవిషయంలో సర్"

"నీకోసం వచ్చినవాళ్ళు, వెదుకుతున్న వాళ్ళు కిరాయి గూండాలు. ఎదుటివాడి ప్రాణాలు తియ్యటానికైనా వెనుకాడని క్రిమినల్స్. ఒట్టి కసాయివాళ్ళు"

"అంటే... వాళ్ళెవరో మీకు తెలుసా సర్" మిన్నూ అడిగింది.

"కన్‌ఫర్మ్‌డ్‌గా ఫలానావాళ్లని నేను చెప్పలేనుగాని ఊహిస్తున్నానంతే. మరో మాట. ఎప్పుడైనా నీకే విషయంలో నైనా నా సహాయం కావాల్సొస్తే మాత్రం నిర్భయంగా నువ్వు మా ఇంటికి రావచ్చు నాకు చేతనైనంతలో నీకు సహాయం చేస్తాను"

"థాంక్యూ అంకుల్... ఆ పాటిచేయూతనిస్తానన్నారు, ఆ మాటే చాలు. నాకు కొండంత బలాన్నిస్తుంది. ఫోన్ పెట్టేస్తున్నాను" చెప్పి ఫోన్ పెట్టేసి బయటికొచ్చింది మిన్నూ.

రామిరెడ్డితో జరిగిన సంభాషణ మరోసారి మననం చేసుకునేసరికి మతి తప్పినంత పనయ్యింది. "అసలు తన గదిలో ఫొటోరీలు అదృశ్యం కావటమే ఓ కన్‌ఫ్యూజన్ అయితే మధ్యలో వచ్చిన ఈ గణపతి ఎవడు? ఫొటోరీలు అతడిదగ్గరెలా ఉంది? శ్యామ్ గురించి తనకు బాగా తెలుసు. ఎక్కువగా ఒంటరితనాన్ని కోరుకునేవాడు. నిశ్శబ్దంగా ఉంటూ చుట్టూ ఉన్న ప్రకృతిని పరిశీలించటమంటేనే ఇష్టం. మంగళతో ప్రేమానుబంధం, తనపట్ల సోదరుడిలా వ్యవహరించటం తప్ప మరెవరితోనూ అతడు స్నేహం పేరుతో తన సర్కిల్‌ను పెంచుకున్నది లేదు. మరెవడీ గణపతి? "

మంగళకీ గణపతి విషయం తెలిసుంటుందేమోనన్న ఉద్దేశ్యంతో నేరుగా ఇంటికి వెళ్ళకుండా మంగళ ఇంటికి బయల్దేరింది మిన్నూ.

ఆటోఫేర్ చెల్లించి సందు దాటి లోపలకెళ్ళేసరికి మంగళ ఇంటిక్కూడా తాళంపెట్టి ఉంది. సాధారణంగా ఏదన్నా పనుండి బయటకు వెడితే ఇంట్లో తల్లి ఉన్నా కూడా ఆవిడ పరిస్థితి దృష్ట్యా తాళంపెట్టే వెడు

తుంది కాబట్టి మంగళ కోసం వెయిట్ చేస్తూ అక్కడే నిలబడింది మిన్ను.

పదినిమిషాలు గడిచేసరికి ఎదురింటావిడ ఏదో పనుండి బయటకొచ్చి గుమ్మందగ్గర నిలబడ్డ మిన్నూని చూసి "మీరు మంగళ స్నేహితురాలు కదూ? " అంది.

"అవునండీ మంగళకోసం వచ్చాను. ఆమె ఇంటికి తాళంపెట్టి ఎక్కడకు వెళ్ళిందీ చెప్పగలరా? "

"తెలియదమ్మా. వారంరోజులకిందట వాళ్ళమ్మకు ఎగ ఊపిరొచ్చి సీరియస్సయితే ఆసుపత్రికి తీసుకెళ్ళింది. ఆరోజు తరువాత ఒకటిరెండు సార్లు ఇంటికొచ్చింది. ఐదు రోజులుగా ఇంటికొచ్చిన జాడలేదు. ఎలా వేసినతాళం అలాగే ఉంది. వాళ్ళమ్మకెలాగుందో కూడా తెలియలేదు" చెప్పిందావిడ.

"ఏ ఆస్తుపత్రిలో జాయిన్ చేసిందో అదన్నా తెలుసాండీ" అడిగింది మిన్ను.

"ధర్మాసుపత్రిలోనే జాయిన్ చేసుంటుంది. ప్రైవేటు డాక్టర్లను తట్టుకునే శక్తి ఆమె కుండొద్దూ"

"సరే నేను వెడుతున్నాను. వీలుంటే ఇప్పుడే హాస్పిటల్‌కు వెళ్ళి మంగళను కలుస్తాను. లేదంటే రేపు సాయంత్రం వెడతాను. ఈలోగా మంగళొస్తే నేనొచ్చి వెళ్లానని చెప్పండి" ఆమెతో చెప్పి బయటికొచ్చాక ఓ రెండునిమిషాలు ఆలోచిస్తూ నిలబడి చివరకు జనరల్ హాస్పిటల్‌కు వెళ్ళాలనే నిర్ణయించుకుంది.

తమ కాలనీలోనే ఉంటున్న ఓ ఆంటీ జనరల్ ఆసుపత్రిలో ఆయాగా పనిచేస్తోంది. మిన్నూను ఆవిడ కనిపించినప్పుడల్లా ఆప్యాయంగా పలకరిస్తుంది. ఆమెను హాస్పిటల్లో కలుసుకుంటే మంగళ తల్లిని ఏ వార్డులో జాయిన్ చేసిందీ తప్పకుండా తెలుస్తుందన్న నమ్మకంతో తను వెళ్ళే సమయానికి ఆవిడ డ్యూటీలోనే ఉండాలని భగవంతుడ్ని ప్రార్థిస్తూ వెళ్లింది.

లక్కీగా ఆవిడప్పటికి డ్యూటీలోనే ఉంది. మంగళ గురించి అన్ని వివరాలు అందచేసి ఆమెనడిగితే ఆవిడ మరో నర్సుని పట్టుకుని సమాచారం సేకరించి ఏ వార్డులో జాయిన్‌చేశారో ఆ వార్డు సిస్టర్ దగ్గరకు మిన్నూను తీసుకెళ్ళి పరిచయంచేసింది.

"ఆ అమ్మాయి తల్లి జాయిన్‌చేసిన మూడో రోజునే చనిపోయింది"

"చనిపోయిందా!" మిన్ను షాక్ తిన్నది.

"చనిపోక ఏం చేస్తుంది. అప్పటికే ఆవిడ కండిషన్ చాలా బేడ్‌గా ఉంది. మూడోరోజునే చనిపోయింది"

"మరి... మంగళని చూస్తే ఒంటరిది. దహనసంస్కారం అదీ ఎవరు చూశారు? ఇప్పటికీ ఆమె తల్లిపోయిన విషయం ఇరుగుపొరుగువాళ్ళకి తెలియలేదు. ఆ అమ్మాయి ఐదు రోజులుగా ఇంటికే రావడంలేదంటున్నారు ఇదంతా ఎలా సంభవం" మిన్ను కలవరపడింది.

"ఆరోజు తల్లి పోయిందని నేను చెప్పగానే ఓ గంటవరకు ఏం చెయ్యాలో పాలుపోనట్టు విచారంగా ఇక్కడే బయట బల్ల మీద కూర్చుండిపోయింది. శవాన్ని త్వరగా తీసికెళ్ళే ఏర్పాట్లు చూడమని మావాళ్ళు పావుగంటకోసారి వచ్చి హెచ్చరిస్తూనే ఉన్నారు. ఆ అమ్మాయి పరిస్థితి నాక్కొంత అర్థమవటంవల్ల నేను దగ్గరకువెళ్ళి "మీ బంధువులున్నారేమో వెళ్ళి తీసుకురా. లేదంటే మా వాళ్ళు అన్నంత పనీ చేస్తారు. మార్చురీకి పంపించారంటే మళ్ళీ శవాన్ని కలెక్టుచేసుకోటానికి నువ్వు యాతనపడాలి. త్వరగా వెళ్ళి ఆ పనిచూడని" చెప్పాను. అంతలోనే దేవుడే పంపినట్టు ఆ అమ్మాయి బంధువులబ్బాయి కాబోలు ఒకతనొచ్చి సంగతి తెలుసుకుని ఆమెనోదార్చి ఆమె తల్లి దహనసంస్కారాలన్నీ అతడే దగ్గరుండి చూసుకున్నాడు. బహుశా ఆ అమ్మాయిని అతడే వెంటబెట్టుకు వెళ్ళుంటాడు" వివరంగా చెప్పిందామె.

"బంధువులబ్బాయా! సుమారు

అతడికెంతవయసుంటుందో, మనిషెలా ఉన్నాడో వివరంగా చెప్పగలరా? " మిన్ను రిక్వెస్టు చేసింది.

సిస్టర్ చెప్పిన తీరులో ఆ అబ్బాయి ఒడ్డు, పొడుగు, కవళికలు. అన్నీ పోల్చి చూస్తే అతడు నిశ్చయంగా ఆ గ్రే కలర్ ఫేంట్ వాలాయేనని నిర్ధారించుకుంది. "మెనీమెనీ థ్యాంక్స్ సిస్టర్. ఇన్ని వివరాలు శ్రమ అనుకోకుండా చెప్పారు. మీమేలు మర్చిపోలేను" అక్కడున్న వారికి కృతజ్ఞతలు తెలుపుకుని బయట పడింది మిన్ను.

నడుస్తున్న ఆమెలో ఎన్నో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. నాల్రోజుల కిందట బస్టాపులో నిలబడ్డ తనను "లిఫ్టిమ్మంటారా" అని ఆగి మరీ అడిగినవాడు కనీసం మంగళ గురించి తనకెందుకు చెప్పలేదు? అసలతడు మంగళను తనతో ఎందుకు తీసుకెళ్ళినట్టు. మొదట్నుండీ అతడి ప్రవర్తన తనకు అనుమానంగానే ఉంది. అటు ఎవరో ఇద్దరు వ్యక్తులు మంగళ ఇంటిని సోదా చెయ్యటం, ఇటు మరో ఇద్దరు తనకోసం వెదకడం ఇదంతా చూస్తుంటే తమ వెనుక పెద్ద గూడుపుఠాణీ ఏదో జరుగుతున్నట్టే తోస్తోంది. ఆ ఫేంట్ వాలా ఎందుకు అనుక్షణం నీడలా వెంటాడుతూ తమ ప్రతి చర్యనూ గమనిస్తున్నాడో, ఈ రామిరెడ్డి ఎందుకు కలిసేడో తమ వెనుక అల్లుకుంటున్న .సాలెగూడు లాంటి ఈ సంఘటన ఎందుకు జరుగుతున్నాయో ఆ భగవంతుడికే తెలియాలి"

మిన్ను అన్యమనస్కంగా ఇంటికొచ్చింది. అప్పటికే బాగా చీకటిపడింది. చేతివాచీ ఎనిమిదయ్యిందని సూచిస్తోంది. ఆనంద్ ఆమెకోసమే ఎదురుచూస్తూ వరండాలోనే నిలబడ్డాడు. నెమ్మదిగా నడిచొస్తున్న మిన్నూని చూడగానే అతడి గుండె తేలికపడ్డది.

"అమ్మయ్య వచ్చేశావా. ఇంతాలస్యమైనా రాకపోతే నాకు కాళ్ళూ చేతులు ఆడలేదు. మరోగంట చూసి నేనే వెళ్లి పోలీసు రిపోర్టిద్దామనుకుంటున్నాను" అన్నాడు.

"నయం అంతపనీ చేశావు కాదు. పనుండి ఆలస్యమైందని సరిపెట్టుకోవచ్చుగా. అంత గాబరా పడ్డందేనికి" విసుక్కుంది.

"దేనికా! తమరి గురించి ఇద్దరు ఆత్మీయులు తిరుగుతున్నారని తెలుసుగా అందుకు. ఆ వెధవలే ఏదో చేశారని హడలిఛస్తుంటే ఎంత తాపీగా చెప్తుందో చూడండి" వ్యంగ్యంగా అన్నాడు.

"చిన్న పనుండి మంగళ ఇంటికెళ్లాను. తీరా వెడితే వాళ్ళమ్మను ఆరోగ్యం బావుండక హాస్పిటల్లో అడ్మిట్ చేశారని తెలిసి అట్నుండి అటే హాస్పిటల్‌కు వెళ్ళి చూసొస్తున్నాను. అందుకే ఆలస్యమయ్యింది" విషయం అంతవరకే చెప్పింది.

"అయ్యో పాపం ఆమెకిప్పుడెలా ఉంది? " అడిగాడు సానుభూతిగా.

"లాభంలేదు రేపోమాపో అన్నట్టుంది ఆమె పరిస్థితి" అబద్ధం చెప్పింది.

"ఆమె పోతే మంగళ కూడా ఒంటరిదయిపోతుందన్నమాట. అదే జరిగితే మంగళను నీరూమ్‌కు తీసుకొచ్చెయ్యకూడదా? నీకూ తోడుంటుంది. వంట సమస్య తీరుతుంది. ఆమెను మనం ఆదుకున్నట్టు ఉంటుంది"

"చూద్దాంలే. మన దగ్గరకు రావటానికి ఆమె ఒప్పుకోవాలిగా" సంభాషణ పెంచటం ఇష్టంలేక రూమ్ తాళంతీసి లోపలికి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఉదయం అప్పటికి ఏడు గంటలయింది. చిన్నీకు మెలకువొచ్చినా బద్ధకంగా ఉండడం వల్ల టేప్ రికార్డర్లో రవిశంకర్ సితార వాదన వింటూ కళ్లు మూసుకుని పడుకున్నాడు.

ఇంతలో ఆయా లోపలికొచ్చి "చినబాబు" అని పిలవడంతో కళ్లు విప్పి ఏమిటన్నట్టు

చూశాడు.

"ఆ అమ్మాయొచ్చింది" దగ్గరకొచ్చి మెల్లని స్వరంతో చెప్పింది. టేప్ రికార్డర్ ఆఫ్‌చేసి "ఏ అమ్మాయి? " ఆసక్తిగా అడిగాడు.

"అదే ఆరోజు వర్షంలో మనింటికి తడుస్తూ వచ్చిందే ఆ అమ్మాయి" రహస్యం చెప్తున్నట్టు ఆమె చెప్పే పద్ధతి చూస్తే చిన్నీకి నవ్వొచ్చింది. "ఎవరికోసం వచ్చిందో అడిగావా? "

"అడిగాను. వస్తూనే మీ చిన్నబాబుగారున్నారా అని అడిగింది. ఉన్నారు అన్నాను. ఉంటే ఆయన్నోసారి పిలు అర్జంటుగా మాట్లాడాలన్నది. వెంటనే నేనిలా పరుగెత్తుకొచ్చాను" ఆయా వివరాలందజేసింది.

"మామయ్య ఎక్కడున్నారు? " అడిగాడు.

"కిందనే ఉన్నారు, స్నానం చేస్తున్నారు"

"పద వస్తున్నా" అంటూ ఆయాను పంపేసి తల దువ్వుకుని నైట్‌గౌను విప్పేసి షర్టు వేసుకుని కిందకొచ్చాడు.

హాల్లోకొచ్చి కనీసం కూర్చోనైనా కూర్చోకుండా వరండాలో స్తంభాన్నానుకుని నిలబడి గార్డెన్లోకి చూస్తున్న ఆమె సాలభంజికలా తోచి ఆమెను వెనుకనుండి రెప్పలార్పడం మరిచినట్టే ఒక్కక్షణం చూసి "హలో గుడ్‌మార్నింగ్" అన్నాడు పలకరింపుగా.

మిన్ను వెను తిరిగి "ఫైన్ మార్నింగ్" అంది బదులుగా.

"అక్కడే నిలబడిపోయారేం, లోపలకు రండి" ఆహ్వానించాడు.

"సారీ నాకంత టైములేదు. మీరలా నాతోపాటు గార్డెన్లోకొస్తే మాట్లాడి వెళ్లిపోతాను. ఐదు నిమిషాలు స్పేర్ చెయ్యండి చాలు" అంది.

"పదండి" చిన్నీ ఫౌంటెన్‌కటువైపుగా ఉన్న సిమెంటు బెంచీవైపు నడిచాడు. అతడా బెంచీమీద కూర్చుని "ఇప్పుడు చెప్పండి ఏం మాట్లాడతారో" అన్నాడు. మిన్ను వెంటనే మాట్లాడే ప్రయత్నం చెయ్యలేదు. అసహనంగా ఫౌంటెన్‌వైపు చూస్తూ నిలబడింది.

"ప్లీజ్ మీరూ కూర్చోండి" రిక్వెస్టు చేశాడు.

"నేను మీతో తీరిగ్గా కబుర్లు చెప్పి కాలక్షేపం చెయ్యటానికి రాలేదు. సూటిగా ఓ విషయం అడిగి తేల్చుకోవాలనొచ్చాను" కటువుగా అంది.

"అడగండి. మీరేమడిగినా జవాబు చెప్పటానికి నేను సిద్ధంగా ఉన్నాను"

"మంగళ ఎక్కడుంది? " అడిగింది.

"మంగళా! మంగళంటే..." ఏదో ఆలోచిస్తున్నట్టు ముఖం పెట్టడం చూస్తే ఒళ్లు మండింది మిన్నూకి.

"ఆహా! మంగళంటే ఎవరో తెలియనట్టు నటించాలనుకుంటున్నారా? మీ నటనకు నా జోహార్లు. మంగళను ఎందుకు తీసుకొచ్చారో, ఎక్కడ దాచారో చెప్పండి" మిన్ను గద్దించి అడిగేసరికి "సారీ మీరేదో ఆవేశంలో ఉన్నట్టున్నారు. మంగళను నేనెందుకు తీసుకొస్తాను. ఏంచేస్తాను. మీరనవసరంగా నన్నుమానిస్తున్నారు" అన్నాడు.

"నో. నేను నమ్మను. మంగళనేం చేశారో చెప్పండి"

"మళ్లీ అదే ప్రశ్నిస్తే నేనేం జవాబు చెప్పగలను. అర్థంలేని అనుమానాల్తో మనసు పాడుచేసుకుని నామీద నిందారోపణ చేస్తున్నారు. ఏదో కన్ఫ్యూజన్‌లో ఉన్నట్టున్నారు. ప్లీజ్ రిలాక్స్" అన్నాడు సౌమ్యంగా.

"అనవసరంగా మీమీద నిందారోపణ చెయ్యటంవల్ల నాకు ఒరిగేదేముంది. నేనన్ని వివరాలూ సేకరించిన మీదటే ఇక్కడికొచ్చాను. మీరెందుకు మమ్మల్ని వెంటాడి వేధిస్తున్నారు? అన్నెంపున్నెం ఎరుగని ఆడపిల్లలం. మామీద బ్రహ్మాస్త్రం ప్రయోగించటం దేనికి. నా హేండ్‌బ్యాగ్‌లో విజిటింగ్ కార్డు చూసి రామిరెడ్డి ఫోన్ నెంబరుకు టాకిల్ చేశారు. మరో ఇద్దరు మనుషుల్ని నాకోసం వెదకటానికి పంపించి

మరో కొత్త వల పన్నే ప్రయత్నం చేస్తున్నారు. మంగళను కంటికి కన్పించకుండా దాచేశారు. ఇదంతా మా నుండి ఏమాశించి చేస్తున్నారు. ఇకనైనా మీ వినోదపు ఆటకు స్వస్తి చెప్పి మాకు మనశ్శాంతినివ్వండి. అదే నేను మీకు చేతులు జోడించి ప్రార్థించేది" తను చెప్పదల్చుకున్నది చెప్పి చరచరా వెళ్లిపోయింది మిన్ను.

"మిన్నూ ఆగు ప్లీజ్ నేచెప్పేది విను" వెనుకనుండి చిన్నీ పిలుస్తున్నా విన్పించుకోకుండా విసురుగా వెళ్లిపోయింది మిన్ను.

"మైగాడ్! ఆవేశానికి, ఆవేదనకు ప్రతీకలా ఉంది" రామిరెడ్డితో ఫోన్లో మాట్లాడింది తనేనని గ్రహించగల్గిన ఆమె ఊహాశక్తికి జోహార్లర్పించకుండా ఉండలేకపోయాడు. ఆమె మాటాడిన ప్రతి అక్షరం అతడి మెదడులో ముద్రించుకుపోయింది. ఎవరో ఆమె కోసం వేటాడుతున్నారన్నది స్పష్టంగా తెలుస్తూనే ఉంది. వాళ్లు అమరేంద్ర మనుషులు కాదుగదా" ఆ ఊహ రాగానే అతడు ఒక్క ఉదుటున లేచి లోపలికెళ్లాడు.

పది నిమిషాల్లో స్నానాదికాలు ముగించి హోండా బయటకు తీశాడు.

పూజ ముగించి శివప్రకాష్ డైనింగ్ రూమ్‌కొచ్చాడు. తనకొక్కడికే ఆయా టిఫిన్ పెట్టడం చూసి "చిన్నీని కూడా రానీ ఇద్దరం కలిసే తింటాం" అన్నాడు.

"ఆయనింట్లో ఉంటేగా. టిఫిన్ తినండని పిలుస్తున్నా విన్పించుకోకుండా పావుగంట క్రితమే బయటకు వెళ్లిపోయారు" ఆయా చెప్పింది.

"ఇంత ఉదయాన్నే ఎక్కడికెళ్లినట్టు. ఎవరైనా ఫోన్ చేశారా" అడిగాడు శివప్రకాష్.

"ఫోన్‌కాదు... మరి" అంటూ సందేహంగా చెప్పలేక ఆగిపోటం చూసి "ఫరవాలేదు చెప్పు" అన్నాడు.

"ఆ అమ్మాయొచ్చి చినబాబుతో ఏదో రహస్యంగా మాటాడింది. ఆమె అటు వెళ్లగానే ఆ వెనుకే చినబాబు ఆదరాబాదరాగా పరుగెత్తారు" రహస్యాన్ని పరిశోధించినట్టే చెప్పింది.

"ఆ అమ్మాయంటే... ఆమెవరో నీకు తెలుసా? " అడిగాడు.

"పదిరోజులకిందట వర్షం వచ్చింది చూసేరా ఆ రోజా అమ్మాయి తడుస్తూ వచ్చి కారు షెడ్ దగ్గర నిలబడింది. అబ్బాయిగారేమో ఆ అమ్మాయిని లోపలికి పిలిచి కూర్చోబెట్టమన్నారు. నేనాయన చెప్పినట్టే చేశాను. ఆ అమ్మాయికి టీ పెట్టి ఇచ్చి మరీ లోపలకెళ్లి కిచెన్లో వంటపని చూసుకుంటున్నాను. ఓ అరగంట దాటేక నేను వంటింట్లో నుండి హాల్లోకొచ్చేసరికి..." అంటూ సగంలో ఆపేసి నీళ్లు నములుతుంటే "తరువాతేం జరిగిందో చెప్పు, ఈ సస్పెన్సు దేనికి"

"మీరేమీ అననంటే చెప్తాను. చినబాబుగారిని కూడా ఏమీ అడగనని మాటివ్వాలి"

"కండిషనా! అడగనులే చెప్పు, నువ్వేం చూశావో" శివప్రకాష్ నవ్వుతూ అన్నాడు.

"చినబాబుగారు ఆ అమ్మాయి చాలా దగ్గరగా ఒకరినొకరు పట్టుకుని, అంటే మనం సిన్మాలో హీరోహీరోయిన్లు ఎంత చనువుగా ఉంటారో చూస్తాంగదా అదే సీనులో కన్పించారు. నేను చూసినట్టు తెలిస్తే చినబాబు బాధపడతారని మళ్లీ లోపలికి వెళ్లిపోయాను" చెప్పింది ఆయా.

ఒక్కక్షణం శివప్రకాష్ మవునంగా ఉండిపోయాడు. "ఇంతకీ ఆ అమ్మాయెలా ఉంది? " ప్రశ్నించాడు.

"వంక పెట్టటానికి వీల్లేనంత అందంగా ఉంది. మన చినబాబుగారికి ఈడూజోడూగా చాలా ముచ్చటైన జంట అనిపించేలా ఉంది"

"సర్లే, ఈసారెప్పుడయినా ఆ అమ్మాయి మనింటికొస్తే నేనింట్లోనే ఉండి ఉంటే ఒకసారి నన్ను పిలువు. ఆ అమ్మాయితో మాట్లాడాలి" తాగిన పాల గ్లాసు కిందపెట్టి కుర్చీలోనుండి లేచాడు.

"ఒకవేళ మీరు లేనప్పుడొస్తే..." ఆయా సందేహానికి నవ్వుకుని "నేనొచ్చేవరకు కూర్చో బెట్టు" చెప్పి వెళ్లిపోయాడు శివప్రకాష్.

★ ★ ★

సాయంత్రం నాలుగు దాటింది. ఫ్రాకు మీద డిజైన్‌కు పెయింట్ చేస్తున్న మిన్ను దగ్గరకు అక్కడే పనిచేసే కుర్రాడొచ్చి "మిన్నూ అక్కా మీకోసం ఎవరో అబ్బాయి గారొచ్చారు. మేడమ్ మిమ్మల్ని పిల్చుకు రమ్మన్నారు" చెప్పి వెళ్లాడు.

"నాకోసం వచ్చిన ఈ అబ్బాయిగారెవరు? నందూ కాదుగదా! వెళ్లి చూద్దాం" చేస్తున్న పని కమలకు అప్పగించి ఆఫీసు రూమ్‌కొచ్చింది. మేడమ్‌కెదురుగా కూర్చుని నవ్వుతూ మాటాడుతున్న ఆ గ్రే కలర్ ఫ్యాంట్‌వాలాని చూడగానే ముఖం వన్నెతరిగింది.

"పిలిచారట" మేడమ్‌వైపు తిరిగి అడిగింది.

"ఇదిగో ఈయన మీ బంధువులేనటగా. నీతో ఓ అరగంట మాటాడి వెడతాను పర్మిషనిమ్మని అడుగుతున్నారు. అరగంట మాటాడేక ఇంకేం టయిముంటుందిగాని ఇక నువ్వు సెంటరుకు రావద్దు. అట్నుండి అటే ఇంటికి వెళ్లిపోవచ్చు" మేడమ్ పర్మిషనిచ్చింది.

"థాంక్యూ మేడమ్" కృతజ్ఞతలు తెలియజేసి "కమాన్ మిన్నూ" అంటూ అతడు బయటకు దారితీస్తుంటే బలిపశువులా అతడి వెనుకే బయటకొచ్చింది మిన్ను.

మెయిన్‌గేటు దాటి బయటకు రాగానే "ఆమెముందు మీ పరువు తియ్యటమెందుకని మౌనం వహించాను. ఉదయం అంత క్లాసిచ్చినా మీ బుద్ధి ఇక మారదన్నమాట. నాతో అసలు మీకు మాటలేమిటి? బంధువులబ్బాయినంటూ ఎందుకీ అబద్ధపు బంధాలు" పరుషంగా అడిగింది.

కోపంతో ఎర్రనైన ఆ సోగకళ్లు, అదిరే ఆ బుల్లిపెదవులు, ముడుచుకున్న ఆ కనుబొమలు, కెంపువర్ణాన్ని పులుముకున్న ఆ చెంపలు ఒక్కక్షణం తననుతాను మరిచినట్టే ఆమెవైపు ముచ్చటగా చూశాడు చిన్నీ. అతడి చూపులో చూపు కలపటం ఇష్టంలేనట్టుగా ముఖం తిప్పుకుంది మిన్ను.

"మిన్నూ ప్లీజ్ అనవసరంగా పబ్లిక్ ప్లేస్‌లో గొడవచెయ్యకు. నిన్నేదో అల్లరి పెడుతున్నాననుకుని జనం నా ఒళ్లు హూనం చేస్తారు" సౌమ్యంగా చెప్పాడు.

"సారీ, మీతో మాటలనవసరం. మీరేం చెప్పినా నేను వినదల్చుకోలేదు. నేను వెడుతున్నాను" విసురుగా వెళ్లబోతుంటే చటుక్కున ఆమె చెయ్యి పట్టుకుని ఆపాడు.

"ఏమిటీ పబ్లిక్ న్యూసెన్సు. ప్లీజ్ చెయ్యి వదలండి" ఎవరైనా తమను గమనిస్తున్నారేమోనని అటుఇటు బెరుగ్గాచూస్తూ అంది.

"పబ్లిక్ న్యూసెన్సు కూడదనే మర్యాదగా నిన్నాహ్వానిస్తున్నాను. నువ్వింకా అట్టే మొండితనం ప్రదర్శిస్తే రెండు చేతుల మధ్యఎత్తుకుని తీసుకెళ్లాల్సి వస్తుంది. అటువంటి అవకాశం నాకివ్వకూడదనుకుంటే బుద్ధిగా నాతోరా" ఆ కళ్లల్లో పట్టుదల చూస్తే అతడన్నంతపనీ చేసేవాడిలా కన్పించాడు. అతడితో వాదన వేసుకునే కంటే చెప్పేదేదో ఓపిగ్గా విని వెళ్లడమే మంచిదనిపించింది.

"వస్తాను పదండి... ముందు చెయ్యి వదలండి" అంది.

"చెప్పిన మాట బుద్ధిగా విని అర్థం చేసుకున్నందుకు థ్యాంక్స్" కొంటెగా అని కాస్త దూరంగా ఉన్న రెస్టారెంటుకు తీసుకెళ్లాడు చిన్నీ.

ఓ కార్నర్లో ఉన్న టేబుల్ ముందున్న ఛెయిర్స్‌లో ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు. వెయిటర్ రాగానే టిఫిన్‌కు ఆర్డరివ్వటం చూసి "నాకిప్పుడేమీవద్దు. ఓ కప్పు టీ చాలు. కావాలంటే మీరు తినండి నాకభ్యంతరంలేదు" అంది నిష్కర్షగా.

"వచ్చేవరకే నీ ఇష్టం. ఆ తరువాత నేను

చెప్పినట్టు వినవలసిందే. వినకుంటే వినేలా చెయ్యటమెలాగో నాకు తెలుసు. అటువంటి సీక్రెట్ ఫార్ములాలు నా డిక్షనరీలో చాలా ఉన్నాయి" అల్లరిగా నవ్వుతున్నట్టున్న కళ్లతో అన్నాడు.

"ఆహా! ఇప్పటికి ఎంతమంది అమాయకులమీద ఉపయోగించారేమిటి మీ ఫార్ములాలు" వ్యంగ్యంగా అడిగింది.

"అమాయకులమీద ఏ ఫార్ములాలూ ఉపయోగించవలసిన అవసరంలేదు. మాటల్తోనే వాళ్లను ట్రాప్‌లో వెయ్యొచ్చు. నీలాంటి అందమైన పెంకిపిల్లలకే ఫార్ములాలు అవసరమవుతాయి" ఆమె మాటను ఆమెకే తిప్పికొట్టాడు.

ఇతడితో మాటలు పెంచటం అనవసరమన్నట్టు తలొంచుకుని మవునంగా కూర్చుంది మిన్ను.

పదినిమిషాల్లో వేడివేడి టిఫిన్ తెచ్చి టేబుల్‌మీద పెట్టి వెళ్లాడు బాయ్. "తీసుకో" అంటూ ఓ ప్లేటు ఆమె ముందుకు జరిపాడు చిన్నీ.

"నాకొద్దని ముందే చెప్పానుగా. నేను తినను" తిరస్కరించింది.

"ఒక్కసారి చిన్న పిల్లవయిపోతానంటే నాకభ్యంతరంలేదు. నేనోపక్క తింటూనే నీనోటిక్కూడా అందించగల సహనం నాకుంది" సీరియస్‌గా అన్నాడు.

"అంటే ఏమిటి మీ ఉద్దేశ్యం? "

"బలవంతంగా నీచేత తినిపించగలనని చెప్తున్నాను"

"ఆ అవకాశం మీకివ్వనులెండి" ప్లేటు దగ్గరకు లాక్కుంది.

"గుడ్. గాళ్. ముందు మారాము చేసినా తర్వాత బుద్ధిగా వింటావు" అతడి కళ్లల్లో మెరిసిన విజయగర్వం చూస్తే ఆ టిఫిన్ ప్లేటు అతడి ముఖంమీదికి విసిరి బయటకు పరుగెత్తాలనిపించింది మిన్నూకి.

టిఫిన్ తిని టీ తాగేక కుర్చీలో రిలాక్స్‌గా వాలి తను చెప్పదల్చుకున్న విషయానికి నాందిపలుకుతూ, "ఉదయం తుపానులా వచ్చి నువ్వు నామీద చాలా ఆరోపణలు చేశావు. దాన్నిబట్టే నువ్వు నన్నెంతగా అపార్థం చేసుకుంటున్నావో అర్థమైంది" అతడి మాట పూర్తికానివ్వకుండానే "అపార్థం చేసుకోటంకాదు మిమ్మల్ని చూసి నేనసహ్యించుకుంటున్నాను" తప్పు సవరించింది.

కుర్చీలో నిటారుగా అయ్యాడు. టేబుల్ మీదకు కొంచెం వంగి "ఏయ్ ఇలా నా కళ్లలోకి చూసి మనస్ఫూర్తిగా చెప్పామాట. నువ్వు నన్నసహ్యించుకుంటున్నావా? " మంద్రస్థాయిలో అడిగాడు.

"అవును... అవును... అవును" అతడివైపు చూడకుండానే అంది.

"మూడు అవున్లు అక్కర్లేదు. ఆ మాట నీనోటి చివరినుండి మాత్రమే వస్తోందని వాలిన నీ కళ్లే చెప్తున్నాయి" కొంటెగా అంటుంటే చురుగ్గా కళ్లెత్తి "నాకేం భయం లేదన్నట్టు చూసింది.

"అలా చూడు ఆ కళ్లు నీ హృదయభాషను విప్పి చెబుతూ నాకు ప్రేమభాష్యాన్ని నేర్పుతాయి" మధురిమ నిండిన గొంతుతో అన్నాడు. అతడి మాటలు మిన్నూని స్వప్నలోకాలకు లాక్కెడుతున్నాయి. ఆమె మనసు మైనంలా కరక్కముందే నిగ్రహించుకుంటూ, "దయచేసి మీరు చెప్పదల్చుకున్నదేదో చెప్తే మంచిది. నేను ఇంటికెళ్లాలి" అంది.

"అసలు నన్ను చెప్పనిస్తున్నావా. ముందుగా నువ్వో విషయం గ్రహించాలి. నేను నీ స్నేహితుడినేగాని శత్రువునుకాను"

"ఎలా నమ్మేది? శ్యామ్ పోయినప్పట్నుండి మీరు నా గురించి, మంగళ గురించి అనుక్షణం ఆరాలు తీస్తూ నీడలా వెంటాడుతూనే ఉన్నారు. నా గురించి నందూని అడిగిన ఆ ఇద్దరు వ్యక్తులు మీ మనుష్యులు కారని నన్ను నమ్మమంటారా" అడిగింది.

"ఆరా తీసింది మీ ఇద్దరినీ ఏదో చెయ్యా

లనికాదు. శ్యామ్‌ది నిజంగా సూయిసైడా, మర్డరా అని తెలుసుకోవటం కోసమే. నువ్వు చెప్తున్న ఆ ఇద్దరు ఎవరో కూడా నాకు తెలియదు. నాకవసరమైన విష యాల్ని నేనే సేకరించగలను. మరొకరి సహాయసహకారాలు నాకవసరంలేదు. అయినా నన్ను చూస్తే ఓ కిడ్నాపర్‌లానో, రౌడీలానో కన్పిస్తున్నానా! నీ మనసును అడిగిచూడు ఏం జవాబు చెప్తుందో"

అతడలా తగ్గు స్వరంతో మాటాడుతుంటే సితార వాయిద్యం వింటున్నంత హాయిగా ఉంటుంది. పదేపదే ఆ గొంతు వినాలనిపి స్తుంది. అతడి సమక్షంలో తననుతనే మర్చిపోయి నాదస్వరం విన్న నాగినిలా అయిపోతుంది. ఈ స్పందనకు అర్థం ఏమిటి? మిన్నూ అతడు చెప్పేదేదీ వినడం లేదు. ఆమె లోకంలో ఆమె ఉంది.

"ఏమిటలా ఊహాలోకంలో విహరిస్తు న్నావు. నీ ధోరణిచూస్తే నా మాటలసలు పట్టించుకున్నట్టే లేదు"

"లేదు, వింటున్నా చెప్పండి" అంది తొట్రుపడుతూ.

"చెప్పేందుకేముంది. నన్ను మీ స్నేహి తునిగా, మీ క్షేమాన్ని కోరే వ్యక్తిగా చూడ మనే నా రిక్వెస్టు"

"ప్రయత్నిస్తాను"

"ప్రయత్నించటంకాదు, ఈ క్షణంనుండి నన్ను నీ శ్రేయోభిలాషిగా భావించాలి. అలా భావిస్తానని మాటివ్వు" చేయిచా పాడు.

"నాకిలాంటి ప్రామిస్‌లమీద నమ్మకం లేదు. ప్రయత్నిస్తానని చెప్పేను కాబట్టి ఇక ఆ విషయం వదిలెయ్యండి. ఇక నేనింటికి వెళ్లాలి" వెళ్లడానికని లేచింది.

"పద నీ ఇంటివరకు డ్రాప్ చేస్తాను"

"సారీ, మీబోటివారికి అటువంటి శ్రమ ఇవ్వటం నాకిష్టంలేదు. నేను బస్ మీద వెళ్లగలను" చెప్పి మరో మాటకు అవకాశ మివ్వకుండా తలొంచుకుని వెళ్లిపోయింది మిన్నూ.

"స్వీట్ డాల్" చిన్నగా మూల్గింది అతడి మనసు. ఆమె కనుమరుగయ్యేవరకు చూసి స్కూటర్ వెనక్కు తిప్పి స్టార్టు చేసుకుంటూ వెళ్లిపోయాడు.



శ్రావణ్‌తో మాటాడి ఇంటికొచ్చేసరికి రాత్రి ఏడుగంటలు దాటింది. శివప్రకాష్ మేనల్లుడికోసం ఎదురుచూస్తూ హాల్లోనే కూర్చున్నాడు.

"ఉదయం వెళ్లినవాడివి ఇప్పుడారావటం. మధ్యాహ్నం భోజనమైనా చేసేవాలేదా?" అడిగాడు.

"శ్రావణ్ బలవంతం చేస్తే వాళ్లింట్లోనే తిన్నాను"

"ఇంటిక్కూడా రాలేనంత బిజీవర్కా. నువ్వు రాలేదని నేనెంత కంగారు పడుతు న్నానో తెలుసా. మరెప్పుడూ ఇలా చెయ్యకు" చిన్నగా మందలించాడు.

"సారీ మామయ్యా! మధ్యాహ్నం ఓసారి ఇంటికి ఫోన్ చేసి విషయం చెప్పాల్సింది. నాదే పొరపాటు" నొచ్చుకుంటూ అన్నాడు చిన్నీ.

"సర్లే... వెళ్లి స్నానం చేసిరా. భోజనం చేద్దాం" అన్నాడు శివప్రకాష్.

"ఇదిగో అరగంటలో వచ్చేస్తాను" అంటూ చకచకా మెట్లెక్కి వెళ్లిపోయాడు చిన్నీ.

భోజనం చేస్తుండగా "పెళ్లి విషయంలో ఇప్పటికైనా ఓ డెసిషన్ తీసుకున్నావా లేదా? " శివప్రకాష్ మేనల్లుడ్ని అడిగాడు.

చిన్నీ భ్రుకుటి ముడిచి "నా నిర్ణయం ఏమిటో రెండు నెల్లకిందటే చెప్పానుగా" అన్నాడు.

"ఏదీ ఎలా ఉంటుందో కూడా తెలియని మీ మామయ్య కూతురు అనామికను చేసు కుంటాననా? "

శివప్రకాష్ మాటలకు చిన్నీ ముఖం చిన్నబోయింది. "మీరన్నది నిజంకాదు. మా మామయ్య కూతురికి మధురమైన రూపం ఉంది. మీరన్న గడువు లోపునే ఆమెను నా దాన్ని చేసుకోగలనన్న నమ్మ కమూ ఉంది" స్థిరంగా అన్నాడు.

"అది కాదురా చిన్నీ, నీ పెళ్లి ఎంత త్వరగా అయితే నాకంత మనశ్శాంతి. ఇంకా సంవత్సరం పాటు ఆగాలంటే నాకీ ఇంట్లో ఒంటరితనం శాపంలా ఉంటోంది. నా బాధనర్థం చేసుకో" అనునయంగా అన్నాడు.

"సంవత్సరంలో మూడునెల్లు అప్పుడే గడిచిపోయాయి. ఇంకా తొమ్మిది నెలలేగా అప్పటికీ నేను కీర్తనను పట్టుకోలేకపోతే మీరు చెప్పినట్టే బుద్ధిగా పెళ్లిచేసుకుం టాను. అప్పుడు కూడా నాకిష్టమైన అమ్మా యితోనే పెళ్లి జరుగుతుందని మాత్రం మర్చిపోకండి" అన్నాడు.

"అలాగేలే"

చిన్నీ భోజనం చేశాక మేడమీదున్న తన గదిలోకి వెళ్లిపోయాడు.

★ ★ ★

"హలో! ఆనందంటే మీరేకదూ? "

కాస్త ఒడ్డు, పొడుగు పర్సనాలిటీతో ఉన్న ఆ యువకుని వంక పరిశీలనగా చూస్తూ "అవును నా పేరే ఆనంద్, ఇంతకీ మీరె వరు? " అడిగాడు ఆనంద్.

"నా పేరు శ్రావణ్... మీరీ పేపరు మిల్లులోనే పని చేస్తున్నట్టున్నారు"

"అవును"

"చిన్న ఇన్ఫర్మేషన్ కావలసొచ్చి మీ దగ్గ రకొచ్చాను"

"ఏ విషయంలో"

శ్రావణ్ జేబులోనుండి రెండు ఫొటోలు తీసి ఆనంద్ చేతికిచ్చి "ఈ ఫొటోలో ఉన్న వ్యక్తుల్ని మీరెప్పుడైనా ఎక్కడైనా చూశారా? " అడిగాడు.

ఆ రెండు ఫొటోలు చూసి ఆనంద్ గతు క్కుమన్నాడు. వెంటనే ఏంచెప్పాలో తోచని వాడిలా వెర్రి చూపులు చూశాడు.

"ఇంతకీ చూసేరో లేదో జవాబు చెప్ప లేదు. రెట్టించాడు శ్రావణ్.

"చూశాను"

"ఎక్కడ? "

"ఇంతకీ మీరెవరో ఈ వివరాలన్నీ ఎందుకడుగుతున్నారో దయచేసి చెప్పండి" అన్నాడు.

"నానుండి మీకెటువంటి హానీ జరగదు. నేనెవరినైనా మీరు నిర్భయంగా నిజాన్ని వెల్లడించవచ్చు మీరేం చెప్పినా అది చాలా రహస్యంగా ఉంచబడుతుందని నేను మీకు హామీ ఇస్తున్నాను" శ్రావణ్ నమ్మబలికాడు.

"చిన్న మసీదు వెనుక వీధిలో ఖాన్‌సా హెబ్ నడుపుతున్న కాకా హోటలొక టుంది. అక్కడికే వీళ్లిద్దరూ వచ్చారు. నేనె రుగున్న అమ్మాయి గురించి ఖాన్‌సాహె బ్‌ను వాళ్లు వాకబుచేస్తే అతడు అక్కడే ఉన్న నన్ను చూపించి అడిగి తెలుసుకో మ్మని నన్ను ఇరకాటంలో పెట్టి అతడు తప్పించుకున్నాడు. అప్పుడే వీళ్లిద్దర్నీ మొద టిసారి చూశాను"

"మీకు తెలిసిన అమ్మాయి గురించి వీళ్లి ద్దరూ అడిగిన వివరాలేంటో చెప్పగలరా? "

"ఆ అమ్మాయి ఎక్కడుంటోంది? ఇల్లె క్కడ? అని అడ్రసు అడిగారు. ఆ అమ్మాయి ఈమధ్యే ఇల్లు మారి ఎక్కడికో

వెళ్లిపోయిందని, ఆమె ఎక్కడకు షిఫ్టయిందీ తెలియదని చెప్పాను. వాళ్లు వెళ్లిపోయారు. మళ్లీ ఈరోజువరకు వాళ్లు నాకెక్కడా తారసపడలేదు" ఆనంద్ చెప్పాడు.

"థ్యాంక్స్ ఫర్ యువర్ కైండ్ కోపరేషన్. మేము వీళ్లిద్దరికోసమే వెతుకుతున్నాం. ఎప్పుడో ఒకప్పుడు తప్పకుండా పట్టుబడతారు. ఏమైనా మీ జాగ్రత్తల్లో మీరుండడం మంచిది. నేనిలా అడిగిన విషయం కూడా గోప్యంగా ఉంచండి" చెప్పి వెళ్లాడు శ్రావణ్.

"ఇదెక్కడి గొడవరా బాబు" ఆనంద్ తల పట్టుకున్నాడు.

అంతవరకు సందుచివర స్కూటర్ మీదే ఉండి శ్రావణ్ కోసం వెయిట్ చేస్తున్న సిద్ధార్థ అతడు దగ్గరకు రావటం చూసి "ఏమన్నాడు గురుడు విషయం చెప్పాడా లేదా? "

"చెప్పాడు, మిన్ను గురించి అడిగింది కూడా వాళ్లిద్దరే. రషీద్, యాదగిరిలు. అంటే అమతేంద్రవైపునుండి కూడా వేట ప్రారంభమైందన్నమాట. విషయాన్ని చాలా త్వరగా నరుక్కుంటూ వస్తున్నారంటే వాళ్లు చాలా ఫాస్ట్‌గా ఉన్నారని అర్థమవుతోంది" శ్రావణ్ అన్నాడు.

"అవును... మంగళ ఇంటిని సోదాచేశారు. ఇప్పుడు వాళ్ల దృష్టి మిన్నూమీదుంది. రేపోమాపో ఆమె గురించి కూడా వాళ్లు తప్పకుండా తెలుసుకుంటారు" అన్నాడు సిద్ధార్థ.

"వాళ్లనుండి మిన్నుకి ఎటువంటి ప్రమాదాన్నయినా ఊహిస్తున్నావా? " శ్రావణ్ అడిగాడు.

"ఖచ్చితంగా ఎలా చెప్పగలను. ఏమైనా ఆమెకు రక్షణ ఇవ్వకతప్పదు. ఆ బాధ్యత మనం వహించక తప్పదు" సిద్ధార్థ అన్నాడు.

"అదెలా సాధ్యం"

"..."

"పోనీ విషయం పూర్తిగా ఆమెకు వివరించి కొన్నాళ్లపాటు మీ ఇంట్లో షెల్టర్ ఇవ్వకూడదా? " మళ్లీ శ్రావణ్ అన్నాడు.

"ఆమె నేనేం చెప్పినా నా మాటలు విశ్వసించదు. అంత తేలిగ్గా నా వెంట వస్తుందంటే నమ్మకంలేదు" అన్నాడు సిద్ధార్థ.

"అంతేనా మరేదన్నా కారణముందా" శ్రావణ్ సిద్ధార్థ హృదయాన్ని పసిగట్టినవాడిలా అడిగాడు.

సిద్ధార్థ చిన్నగా నిట్టూరుస్తూ "నువ్వు ఊహించింది నిజమే. ఆమె జ్ఞాపకాలే కలవరాన్ని రేపుతుంటే ఎదురుగా ఉంటే నిగ్రహించుకునేటంత ఋష్యశృంగుడ్నికాను. ఆమెలో లేనిపోని ఆశలు చిగురింపచేయటంకూడా మంచిదికాదు. ఆమె విషయం నాకొదిలెయ్యి. ఏం చెయ్యాల్సిందీ నేను చెప్తాను" స్కూటర్ స్టార్టు చేశాడు సిద్ధార్థ.

★ ★ ★

అకస్మాత్తుగా ఇంటికొచ్చిన వింధ్యను చూసి శివప్రకాష్ ఆనందపడ్డాడు. "దారి తప్పి వచ్చినట్టున్నావే. రా ఇలా కూర్చో మంచినీళ్లు తెమ్మంటావా" ఆమె సమాధానంకోసం చూడకుండానే ఫ్రిజ్‌లో వాటర్ బాటిల్ బయటకు తీసి గ్లాసులో ఒంపి తెచ్చి ఆమెకందించాడు.

విషాద చిత్రంలా ఉన్న ఆమె ముఖ కవళికలు చూసి కలవరపడుతూ "వింధ్యా అలా ఉన్నావేం? ఏం జరిగింది? " అడిగాడు.

ఆ ఒక్కమాటకే ఆమెలో దుఃఖం కట్టలు తెంచుకున్న ప్రవాహంలా బయటికొచ్చింది. "అంతా అయిపోయింది శివా. విధి నా జీవితంతో క్రూరంగా ఆడుకుంది. కాదు కాదు ఆ దుష్టుడు నా జీవితంలో దగ్ధ వసంతాన్నే మిగిల్చాడు" రోదించింది.

ఆమెలో వేదనకు శివ కరిగి నీరయ్యాడు. "వింధ్యా నీ సంతోషాన్నేగాని దుఃఖాన్ని చూసి భరించలేను. ఏం జరిగిందో చెప్పు ప్లీజ్" వింధ్య భుజంమీద చెయ్యేసి లాల

నగా అడిగాడు.

వింధ్య అతడి ఒడిలో తల దాచుకుని దుఃఖం తీరేవరకూ ఏడుస్తూనే ఉంది. దుఃఖం మనసును తేలికపరిచే దివ్యౌషధమని తెలుసుకాబట్టి ఏడుస్తున్నంతసేపూ ఆమె తల నిమురుతూ మౌనంగా ఓదార్పు నందించాడు. కాసేపటికి ఆమె తేరుకుంది. లేచివెళ్ళి ముఖం కడుక్కొని కర్ఛీఫ్‌తో తుడుచుకుని వచ్చి కూర్చుంది.

ఆయా రెండు కప్పుల్లో టీ తెచ్చి ఇద్దరి మధ్యా పెట్టింది. "వింధ్యా టీ తీసుకో" అంటూ ఓ కప్పు ఆమెకిచ్చాడు. టీ తాగాక "ఎందుకంతగా వర్రీ అయ్యావు. ఏం జరిగింది? " శివ అడగ్గానే ఆమె కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి. "శివా...! బాబు... నా బాబు చచ్చిపోయాడు. కనీసం వాడి శవాన్నయినా ఈ పాపిష్టి కళ్ళతో చూడనోచని దురదృష్టవంతురాల్ని" మళ్ళీ కన్నీరు పెట్టుకుంది.

శివ నిశ్చేష్టుడయ్యాడు. "ఇంత ఘోరం ఎలా జరిగింది? ఇంతమంది స్పెషలిస్టులున్నారు. మంచి మందులున్నాయి. ఇన్నుండి ఆ పసివాడిని రక్షించలేకపోయాయా? " రుద్ధకంఠంతో అన్నాడు.

"అన్నీ ఉన్నా వాడికి ఆయుష్షే లేదు శివా. వాడు పుట్టిందే ఓ పాపాత్మురాలి కడుపున. అందుకే పదేళ్ళకే నూరేళ్ళు నింపుకుని వెళ్ళిపోయాడు" విరక్తిగా అంది.

"ఎలా పోయాడు"

"జాండీస్. బాగా ముదిరిపోయిందట. ఎంత డబ్బున్నా బాబును దక్కించుకోలేకపోయాం" మళ్ళీ దుఃఖంతో కదిలిపోయింది వింధ్య.

"బాధపడకు వింధ్యా. ఇటువంటి సమయాల్లోనే ధైర్యం తెచ్చుకోవాలి" ఓదార్పుగా అన్నాడు.

"ఎలా ధైర్యం తెచ్చుకోగలను శివా. వధ్యశిలమీద నిలబడి కూడా నేను బతుకుతున్నది ఆ చిరుదీపపు వెలుగులోనే. అదే ఆరిపోయాక ఇక నాకు వెలుగెక్కడిది. బతకాలన్న ఆశ కూడాలేదు" నిర్లిప్తంగా అంది.

"ప్లీజ్ వింధ్యా అలా మాట్లాడకు. నేను తట్టుకోలేను" భరించలేనివాడిలా అన్నాడు.

"శివా ఇంతటి ప్రేమమూర్తివి కాబట్టే సంకెళ్ళు తెంచుకుని నీ వెంట రాలేని నా నిస్సహాయత నన్ను శాపగ్రస్తం చేసింది. జీవితమంతా దుఃఖాన్నే మోయమని నా నుదుట రాసుంది. నాది ఒక్క కోరికుంది తీర్చగలవా శివా" అనడిగింది.

"నీకోసం నా ప్రాణాలివ్వడానికైనా సిద్ధంగా ఉన్నాను వింధ్యా. నువ్వాదేశించు. నీ ఆజ్ఞ శిరసావహిస్తా"

ఒక్క క్షణం వింధ్య మాట్లాడలేదు.

"నన్ను నమ్మలేకపోతున్నావా? " శివప్రకాష్ చిన్నబుచ్చుకున్నాడు.

"అంత మాటనకు. నిన్ను శంకించటం కాదు. నా కోరిక విని నువ్వు హర్టవ్వకూడదు"

"నన్ను బాధపెట్టేదైతే చెప్పొద్దు" అయిష్టంగా అన్నాడు.

"నన్ను చెప్పనీ శివా. మరోసారి భగవంతుడిలా మనసు విప్పి నీతో మాటాడే అవకాశాన్నివ్వకపోవచ్చు.." వింధ్య ఇంకా ఏం చెప్పేదో చటుక్కున ఆమె నోటిని చేత్తో మూసేశాడు.

వింధ్య మరోసారి కన్నీటి కడలైంది. అతడి భుజంమీద తలవాల్చి నిశ్శబ్దంగా రోదించింది. శివప్రకాష్ కళ్ళు కూడా చెమ్మగిల్లాయి.

"శివా మనస్ఫూర్తిగా నిన్ను ప్రేమించినా త్రికరణ శుద్ధిగా నీకు అర్ధాంగినవ్వాలన్న ఆశ నెరవేరలేదు. కనీసం మరణాన్నయినా నీ సమక్షంలోనే పొందాలనుంది. నీ ఒడిలో చేరి చివరి శ్వాస విడవాలనుంది. చివరిక్షణంలో ఏ కోర్కెతో మరణిస్తే మరుజన్మలో భగవంతుడా కోర్కె నెరవేరుస్తాడట. మళ్ళీ జన్మలోనయినా నీ భార్యను కావాలని కోరుకుంటూ మరణిస్తాను. ఆ అవకాశం నాకివ్వవూ" వింధ్య మాటలకు శివప్రకాష్ చలించిపోయాడు.

"వింధ్యా ప్లీజ్ అలాంటి కోరిక కోరడానికి నీకు మనసెలా ఒప్పింది. నీ మాటల్తో నా గుండె కొయ్యకు. నువ్వు జీవించాలి వింధ్యా. నిండు నూరేళ్ళూ జీవించాలి" శివప్రకాష్ అన్నాడు.

"ఇక వెడతాను శివా. నీ సమక్షంలో మనసుతీరా ఏడ్చి నా గుండె బరువును తగ్గించుకుని సాంత్వన పొందాలనొచ్చాను. నా మనసిప్పుడు తేలికపడింది. అనవసరంగా నా దుఃఖాన్ని నీకు పంచి బాధపెట్టి వెళుతున్నాను. అదంతా మర్చిపో" వెళ్ళడానికి లేస్తూ అంది వింధ్య.

"వింధ్యా నానుండి ఏ సహాయం కావలసొచ్చినా నీకోసం పరుగెత్తుకొచ్చే ఈ స్నేహితుడున్నాడన్న విషయం ఎప్పుడూ మర్చిపోవుగా" అన్నాడు.

"మర్చిపోను శివా" వాగ్దానమిచ్చి వెళ్ళింది వింధ్య.

వింధ్య వెళ్ళాక నిశ్శబ్దంగా కూర్చుండిపోయాడు శివప్రకాష్.

"మామయ్యా. అలా వున్నారేం? " చిన్నీ ఎప్పుడొచ్చాడోగానీ అన్యమనస్కంగా బేలగా కన్పించిన మామయ్యను. చూసి కంగారుపడ్డాడు.

"ఏం లేదురా చిన్నీ. ఆ విధాత ఒక్కొక్కరి జీవితంలో చిత్రవిచిత్రమైన మలుపులు సృష్టించి ఎందుకింత వింతరాతలు రాస్తాడో అర్థంకాదు. పాపం! వింధ్య పుట్టెడు శోకంతో ఇక్కడికొచ్చింది. వాళ్ళబ్బాయి పోయాట్ట" చెప్పాడు శివప్రకాష్.

"అరె పాపం ఆంటీకెంత కష్టమొచ్చింది? " చిన్నీ సానుభూతిగా అన్నాడు.

"ఆమె దుఃఖాన్ని చూసి నేను తట్టుకోలేకపోయానురా చిన్నీ. ఆమె జీవిస్తున్నదే ఆ చిరు మొలకమీద ఆశతో. ఆ ఆశను తుంపులు చేసి వినోదిస్తున్నాడా పైవాడు" వేదాంతిలా మాట్లాడ్డం చూసి చిన్నీ మౌనంగా బయటకు వెళ్ళాడు.

★ ★ ★

ఉదయం ఆఫీసుకు బయల్దేరేటప్పుడే ఆనంద్, "మిన్నూ సాయంత్రం ఐదింటికల్లా మీ స్టిచింగ్ సెంటర్కొస్తాను. అట్నుండి అటే షాపింగ్కు వెడదాం" మిన్నూతో చెప్పాడు.

"షాపింగ్కు నేను దేనికి. మీ మగాళ్ళ డ్రస్ సెలక్షన్ నాకసలు తెలియదు" మిన్ను అంది.

"మొద్దూ నా డ్రస్ సెలక్షన్కి కాదు. మంచి చీర సెలక్ట్ చేస్తావని"

"చీరా! ఎవరికి? కొంపదీసి నాకు తెలియకుండానే ఎవరినైనా సెలక్ట్ చేసేసుకున్నావా? " హాస్యంగా అడిగింది.

"స్టాప్ టాకింగ్ నాన్సెన్స్. చీర మా సిస్టర్కోసం"

"నాకు తెలియని ఈ సిస్టరెక్కడ్నుంచి వచ్చిందబ్బా" బుగ్గమీద వేలుంచి మరీ ఆలోచిస్తుంటే, "అంత సీరియస్గా ఆలోచించాల్సిన అవసరంలేదు. ఎల్లుండేరోజు? "

"సండే"

"తల్లీ వారాలపేర్లు నిన్నడగడంలేదు. ఎల్లుండే రాఖీపండుగ. నువ్వు నాచేతికి రక్షాబంధనం కట్టి నా నోటికి స్వీటందిస్తావు. అప్పుడీ అన్నయ్య ఓ చీరను నీకు ప్రజంట్ చేస్తాడు. అదీ సీను. చీరకు నేను డబ్బులు పే చేస్తానుగానీ రాఖీకి, స్వీట్సుకి అయ్యే ఖర్చు మాత్రం నీదే" ఆనంద్ చెప్తుంటే మిన్నూ కళ్ళు ఆర్ద్రమయ్యాయి.

"నందూ" అంది మాటలు రానిదానిలా.

"నందూ కాదు అన్నయ్యా అని పిలువు"

"నేనలా పిలవను. నువ్వే నన్ను అక్కా అని పిలు"

"నాకంటే నువ్వు వయసులో చిన్నదానివి. అక్కా అని ఎలా పిలవగలను. చూసేవాళ్ళకు బావుండదు"

"ప్లీజ్ నందూ. నాకు చాలాకాలంగా ఓ తమ్ముడే ఉంటే నన్ను చక్కగా 'అక్కా' అని పిలిచేవాడు కదా అని అనుకునేదాన్ని. ఆ కోర్కె నువ్వు తీర్చవూ? " అంటూ బతిమా

# ఏరిన ముత్యాలు

★ కష్టాలను ముందుగా ఆశంకించేవాడు రెండుసార్లు వాటిని అనుభవిస్తాడు.

– పోర్టియస్

★ మేలుకున్నవారికే 'ఉషోదయం' అవుతుంది.

– గ్విల్‌ఫోయల్

★ పలుకుబడి అద్దంలాంటిది. ఒకసారి పగిలితే అది మరి ఉపయోగపడదు.

– స్కాట్

★ భగవంతుడిని దర్శింపచేసే విద్యే నిజమైన విద్య.

– రామకృష్ణపరమహంస

★ దుఃఖభారంతో క్రుంగిన గుండెకు దుర్బలమైన ఆశే ఆలంబనం.

–ఎ.బ్రౌన్

★ జీవించి ఉండాలనే ఆశగల ప్రతి మానవుడూ మరణభీతితోనే జీవిస్తాడు.

– ఆర్వెల్

★ మనకు తెలిసినది శూన్యం. తెలియనిది అనంతం.

– ఫెర్రేలా ప్లేస్

★ శాంతంకంటే శక్తివంతమైనది లేదు. నిజమైన శక్తికంటే శాంతం లేదు.

– ఫ్రాన్సిస్ ది సేల్స్

★ తన వ్యక్తిత్వాన్ని కోల్పోయిన వ్యక్తికి మిగిలేదేమీ ఉండదు.

– మహాత్మాగాంధీ

★ ఆర్థికాభివృద్ధే ఆశయం అయితే ఆశకు అంతం ఆకాశం.

– రవీంద్రనాథ్‌టాగూర్

★ మానవుని అంతరాత్మలో ప్రకాశించేదే దివ్యత్వమనే ధర్మం.

– వివేకానంద

★ ప్రజ్ఞాపాటవం లేకపోవడంకంటే అశ్రద్ధే అధికంగా కీడు కలిగిస్తుంది.

– ఫ్రాంక్‌లిన్

★ ఒంటరిగా విచారం సహించగలం. ఇద్దరుంటేనే సుఖం అనుభవించగలం.

– ఎల్‌బర్ట్‌హబ్బర్డ్

★ నమ్మటం కష్టసాధ్యం. నమ్మకపోవడం అసాధ్యం.

– విక్టర్‌హ్యూగో

★ ఆచరణలేని సత్యసూక్తులు విషపూరితాలుగా మారిపోతాయి.

– వి.జె

★ తెలిసేది అనారోగ్యం తెలియనిది ఆరోగ్యం.

– థామస్‌పుల్లర్

సేకరణ: – ఎ.ఎల్.సువర్చల

లింది.

"సరే, అక్కో, చెల్లో ఏదో ఒకటి. సాయంత్రం షాపింగ్‌కు ఖాయంగా వెడుతున్నట్టేగా"

"ష్యూర్, కానీ ఒక్క షరతు"

"ఏమిటదీ? "

"ఒన్ ఫిఫ్టీకి మించి చీర కొనకూడదు"

"అదీ నీ ఇష్టమేనా. చీరకు డబ్బిచ్చేది నేను" అన్నాడు.

"నువ్వయినా అంతకుమించి చీరకు డబ్బులు వేస్ట్ చేయడం నాకిష్టంలేదు. అందుకంగీకారమయితేనే వస్తాను" అంది మిన్ను.

"అలాగేలే. అయినా మరీ నూట ఏభై అంటూ ఈ ఆంక్షలేమిటి. ఓ ఏభై అటో ఇటో అవుతుంది" ఆనంద్ మాటలు పట్టించుకోనట్టే ముందుకు నడిచింది మిన్ను.

సాయంత్రం స్టిచింగ్ సెంటర్‌నుండి బయటికొచ్చేసరికే ఆనంద్ ఆమెకోసం ఎదురుచూస్తూ గేటుదగ్గరే నిలబడి ఉన్నాడు.

ఇద్దరూ నడుచుకుంటూ షాపింగ్ కాంప్లెక్స్‌వైపు వెళ్ళారు.

దూరంనుండి వెడుతున్న ఆ ఇద్దర్నీ చూస్తూనే సిద్ధార్థ పక్కనున్న శ్రావణ్‌ను చేత్తో తడుతూ, "శ్రావణ్ అదిగో ఆ వెడుతున్న ఆ అమ్మాయే మిన్నూ. పొగడ్డమే గానీ ఎప్పుడూ ఆ అమ్మాయిని చూపించలేదంటూ నిష్ఠూరంగా అనేవాడివిగా. ఇప్పుడు పరిశీలనగా చూడు" అన్నాడు మెల్లగా.

మిన్నూని చూసి చూపులు తిప్పుకోలేకపోయాడు శ్రావణ్.

"సిద్దూ! లేనిపోని సెంటిమెంటును పట్టుకుని వేలాడుతూ ఓ గోల్డెన్ ఛాన్స్‌ని మిస్సవుతున్నావేమోననిపిస్తుంది" షాపులోకి వెడుతున్న మిన్నూని చూసి మెల్లగా అన్నాడు.

"నాకూ ఆ విషయంలో బాధగానే ఉంది. ద్వైదీభావంలో వున్నాను" అన్నాడు సిద్ధార్థ.

అతడి మనసునర్థం చేసుకున్నవాడిలా శ్రావణ్ సానుభూతిగా చూశాడు.

"నువ్వేమీ అనుకోనంటే నువ్వు స్కూటర్ మీద ఇంటికెళ్ళిపో. నేను తర్వాత వస్తాను" సిద్ధార్థ అన్నాడు.

"ఇదో మానసిక ఆనందమన్నమాట. గో ఎ హెడ్. నే వెడుతున్నా" శ్రావణ్ వెళ్ళగానే అతడు కూడా మిన్ను వెళ్ళిన షాపువైపే అడుగులేశాడు.

"హలో మీరూ వచ్చారా షాపుకు? " చిన్నీ పలకరింపుతో ఇటుతిరిగి చూసింది మిన్ను. అతడ్ని అక్కడ చూడగానే ఆమె కళ్ళల్లో మెరిసిన మెరుపు అతడి హృదయాన్ని తాకి మంచుముద్దను చేసేసింది.

"అవును. మా నందూ నాకు చీర ప్రజంట్ చేస్తానన్నాడు. అతడి ముచ్చట కాదనటమెందుకని వచ్చాను. మరి మీరు..."

"నేనూ శారీస్ తియ్యాలనే వచ్చాను. సెలక్షన్లో కొంచెం సాయపడగలరా? " అడిగాడు.

"చీరలెవరికి? " అడిగింది మిన్నూ.

"మా మరదలికి. అంటే త్వరలో భార్య కాబోతున్న ఫియాన్సీకి" సిద్ధార్థ మాటల్తో మిన్నూ ముఖం కళ తప్పటం అతడి దృష్టిని తాకింది. అంతలోనే సర్దుకుని "ఆమెనే తీసుకురావలసింది. నా సెలక్షన్ నచ్చుతుందో లేదో" అంది సందేహంగా.

"ఫరవాలేదు. మిమ్మల్ని చూస్తే మీ సెలక్షన్ బావుంటుందనే అనిపిస్తుంది. ఎందుకంటే మీరు పనిచేస్తున్నది స్టిచింగ్ సెంటర్లో కాబట్టి మీ సెలక్షన్‌కు వంకపెట్టే వీలుండదనే నా నమ్మకం" ఆమెతో అని సేల్స్‌మెన్‌కు ఏ ఖరీదుల్లో శారీస్ చూపాలో ఆ ఫిగర్ చెప్పాడు.

"ఇంతకీ ఆమెలా ఉంటారు? "

"ఆమెలా ఉంటుందంటే" ఒక్కక్షణం ఆలోచించి మరోసారి మిన్నుని ఎగాదిగా చూసి, "మీ ఒంటి ఛాయకు దగ్గరగా ఉంటుంది" అన్నాడు.

"హైట్, వెయిట్ కూడా చెప్పండి" అంది.

"ఇది మరీ బావుంది. నేనేమన్నా ఆమె గారి హైట్ కొల్చుకొచ్చేననుకున్నారా? " అని కొద్దిగా మిన్నూపక్కకి జరిగి తన పక్క నున్న ఆమె హైట్ కళ్ళతోనే కొలిచి చూసి, "మీ అంత పొడవే ఉంటుంది. మీలాగే సన్నగా చువ్వలా ఉంటుంది. కాబట్టి వెయిట్ గొడవేదో మీరే చూసుకోండి" అన్నాడు.

మిన్ను చాలా చీరలు అటుఇటు తిరగేసి చూసి రెండుచీరలు దానికి మ్యాచింగ్ బ్లౌజు పీసులు సెలక్ట్ చేసింది.

"చాలా థ్యాంక్సండి. ఇంతకీ మీరొచ్చిన పని పక్కనపెట్టి నాకోసం శ్రమపడ్డారు. మీ చీర తీసుకోవాలన్నారుగా ఆ పని చూడండి. నేను మీ కోసం వెయిట్ చేస్తాను" అన్నాడు.

"ఫరవాలేదు. మా పనికి పది నిమిషాలు చాలు" అంటూ ముందు తనకోసం తీయిం చిన చీరల దగ్గరకు వెళ్ళిపోయింది మిన్ను.

ఆమె చెప్పినట్టే పావుగంటలోనే చీర, బ్లౌజు సెలక్ట్ చేసుకుని కౌంటర్లో బిల్లు చెల్లించి బయటపడ్డారు.

"మీరేమీ అనుకోనంటే టీ తాగి వెడదాం" చిన్నీ ఆనంద్‌తో అన్నాడు.

నందూ మిన్ను వైపు చూశాడు. "అంత అవసరమా? " మిన్నూ అడిగింది.

"తల పగిలిపోతోంది. ఓ కప్పు వేడి టీ తాగితేనేగానీ సర్దుకునేలాలేదు" కణతలు నొక్కుకున్నాడు చిన్నీ.

"సరే పదండి" అంటూ అతడి వెనకే ఆనంద్, మిన్ను అనుసరించి వెళ్ళారు.

రెస్టారెంట్లోకెళ్ళాక టీ ఆర్డరిచ్చిన తర్వాత "ఇంతకీ మీకాబోయే శ్రీమతి పేరు చెప్ప లేదు" మిన్నూ ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి అడిగింది.

"కీర్తన"

ఆ పేరు వినగానే ఆమె చిన్నగా నవ్వింది. "అదేం అలా నవ్వుతున్నారు. పేరు బాగోలేదా? "

"భలేవారు. నైస్ నేమ్. నాకా పేరంటే చాలా ఇష్టం" 'నాపేరు కీర్తనే' అని చెప్పా లన్న అభిప్రాయాన్ని తనలోనే దాచేసు కుంది మిన్ను.

"నాకూ అంతే. త్యాగరాజు కీర్తనలను ఇష్టపడనిదెవరు చెప్పండి. కీర్తన అనగానే మధురమైన సంగీతధ్వనిలా చెవులకు ఆ పేరు ఇంపుగా విన్పిస్తుంది" అన్నాడు చిన్నీ. మిన్ను అతడు చెప్పేది వింటుంటే ఆమె మనసెటో వెళ్ళిపోయింది. "తన తండ్రి కూడా అలాగే అనేవారు. ఆయనెంతో మక్కువతో తనకా పేరు పెట్టారు"

టీ తాగి బయటికొచ్చాక ఎవరిదారిన వారు విడిపోయారు.

"ఎవరతను? " దారిలో ఆనంద్ అడి గాడు.

"శ్యామ్ విషయంలో ఆయన్తో కొద్దిపాటి పరిచయం తప్ప అతడి గురించి నాకూ పెద్దగా తెలియదు" మిన్ను అంది.

ఆనంద్ మరేమీ ప్రశ్నించలేదు.

★ ★ ★

బాబు మరణం అమరేంద్రను కాస్త కది లించింది. ముఖ్యంగా మణిని ఓదార్చటం అతడివల్ల కావడంలేదు. వింధ్యగురించి అతడు పట్టించుకోకపోయినా పదేళ్ళు వాడి మీద మమకారం పెంచుకున్న మణిని అతడు ఒక్కక్షణమైనా వదిలి రావడంలేదు. ఒంటరిగా వదిల్తే ఏ అఘాయిత్యమైనా చేసుకుంటుందేమోనని అతడి భయం.

రషీద్, యాదగిరిలు ఆరోజు అమరేంద్ర కోసం రెండుసార్లు వచ్చి వెళ్ళడం చూసి వింధ్య అమరేంద్ర ఇంటికి ఫోన్ చేసింది.

వాళ్ళు అమరేంద్రను ఈ ఇంట్లో కలవడ మేగానీ ఆ ఇంటికెళ్ళే అలవాటు లేక ఇక్కడే అతడొచ్చేవరకూ కూర్చున్నారు. భర్త రాగానే వింధ్య మేడమీదకు వెళ్ళిపోయింది.

వాళ్ళిద్దర్నీ డ్రాయింగ్‌రూమ్‌కు తీసుకెళ్ళి

కూర్చోబెట్టి, "ఏమిటి విషయం" అడిగాడు అమరేంద్ర.

"అదే... చచ్చిన ఆ శ్యామ్ గురించే మాటాడాలనొచ్చాం" రషీద్ అన్నాడు.

"చెప్పండి"

"ఆరోజు రాత్రి మన గార్డు వాడిని మసీదువరకూ వెంటాడి వెళ్ళానని మసీదు వెనక్కి వెళ్ళాక చీకట్లో ఏమయ్యాడో కనబడలేదని చెప్పాడు గుర్తుందిగా. జాగ్రత్తగా కూపీ లాగితే మసీదు వెనక వీధిలో ఉన్న ఓ కాకా హోటల్లో దూరి మనోడు వచ్చేశాక ఆ దగ్గర్లోనే ఉన్న ఓ పిల్ల ఇంటికి వెళ్ళాడని తెలిసింది"

"ఎవరాపిల్ల? "

"పేరు మిన్ను. ఆ పిల్ల శ్యామ్‌కు స్నేహితురాలేనట. ఆ పిల్లతో ఓ అరగంట మాటాడి రూమ్‌కొచ్చేశాడని నమ్మకంగా తెలిసింది. వాడు రూమ్‌కు రాగానే పైకి పంపేసిన సంగతి మీకూ తెలిసిందేగా" వివరించాడు యాదగిరి.

"ఇంతకీ ఆ పిల్ల ఎక్కడుంటుందో తెలుసుకున్నారా? " అడిగాడు అమరేంద్ర.

"మొన్నోసారి ట్రై చేశాం. ఓ బచ్చాగాడు ఆ పిల్ల ఇల్లు మారిపోయిందని చెప్పాడు. అది నిజమని నమ్మి మేం వెనక్కు వచ్చేశాం. నిన్నరాత్రి మళ్ళీ వెళ్ళి ఆ హోటల్ యజమాని ఖాన్‌గాడికి డాగరు చూపించి బెదిరించేసరికి ఆ పిల్ల ఎక్కడుండేదీ అడ్రస్ చెప్పాడు"

"ఇంకేం అడ్రసు తెలిసిందిగా. దానిల్లంతా వెదికి చూడండి. శ్యామ్‌గాడు ఆ ఫొటో రీలు దానికే ఇవ్వడం జరిగితే ఇంట్లో దాచుకోక ఏం చేస్తుంది? ఆ రామిరెడ్డికి ఆ పిల్ల విషయం తెలియకముందే మీరు పని పూర్తి చేసుకురండి" అన్నాడు అమరేంద్ర.

రషీద్ ఏదో చెప్పాలన్నట్టుగా బుర్ర గోక్కుంటూ నిలబడ్డం చూసి, "ఈ విషయంలో ఏమన్నా సందేహిస్తున్నారా? " అడిగాడు అమరేంద్ర.

"అది కాద్సార్" అంటూ యాదగిరి కూడా ఏదో చెప్పాలని కూడా చెప్పలేకపోవడం చూసి, "మీకిద్దరికీ ఏమైందిరా దేనికలా భయపడుతున్నారు. మీ మనసులో ఏముందో చెప్పి చావండి" విసుక్కున్నాడు అమరేంద్ర.

"ఇల్లు వెదకడం కాదుగానీ ఆ అమ్మాయిని ఎత్తుకొచ్చేస్తాం" అన్నాడు రషీద్.

"ఏవిటి కిడ్నాపా? వద్దు అంత రిస్క్ తీసుకుని పోలీసుల దృష్టిలో పడ్డం నాకిష్టం లేదు. ఆ తరువాత జరిగేదానికి నేను చాలా అవస్థలు పడాలి. అయినా కిడ్నాపంటే అది చాలా పెద్దకేసవుతుంది. ఎంపీలదాకా వెళ్ళి హోంమినిష్టరు కాళ్ళు పట్టుకోవడం, లక్షలకు లక్షలు వాళ్ళకు ధారపోయడం నాకిష్టంలేదు" అన్నాడు అమరేంద్ర.

"అటువంటిదేదీ జరగదని మేం హామీ ఇస్తున్నాం. ఈ విషయంలో మామాట కాదనకండి సాబ్"

"ఆ పిల్లనెత్తుకురావాలన్న ఆలోచన మీకెందుకొచ్చింది. ఫొటో రీలు శ్యామ్ నిజంగా ఆమెకే ఇచ్చి ఉంటే ఇప్పటివరకూ దగ్గరే అట్టేపెట్టుకుంటుందన్న నమ్మకం నాకులేదు. శ్యామ్ మరణం చూశాక కూడా రిస్క్ తీసుకుంటుందా? ఈ పాటికి దాన్ని కాల్చి బూడిద చేస్తుంది. అలా జరిగితే మన చేతికి మట్టి అంటకుండా పని పూర్తయినట్టే. అలా జరగక్కపోతే మీరే వెదికి తెస్తారు. అంతటితో మనకీ తలనొప్పి వదిలిపోతుంది. కిడ్నాప్ ఆలోచనతో నన్ను రొంపిలోకి దింపే ప్రయత్నం చెయ్యకండి" వారించాడు అమరేంద్ర.

ఇంత చెప్పినా వాళ్ళు నిలబడ్డ చోట్నుంచి ఒక్క అంగుళమైనా కదలకపోవడం చూసి, "ఇంకా ఏమిటాలోచిస్తున్నారు? " అడిగాడు విసుగ్గా.

"సాబ్ ఆ పిల్ల దాని అందం చూడాలేగానీ నోటితో చెప్పేదికాదు. ఇంతకాలం మీకు నమ్మినబంటుల్లా విశ్వాసంగా పని

చేశాం. ఆ పిల్లమీద మా ఇద్దరికీ మనసయింది. మీరు ఊ అంటే మీమీదకేమీ రాకుండా మా తంటాలేవో మేం పడతాం. ఈ ఒక్కసారికీ మామాట కాదనకండి" యాదగిరి చెయ్యెత్తి దండం పెట్టి మరీ చెప్పాడు.

"అదా మీ ఏడుపు. సరే ఎలాగో చావండి. దాన్ని తీసుకొచ్చి ఎక్కడ దాస్తారు" అడిగాడు అమరేంద్ర.

"ముందిక్కడకే తెస్తాం. మీరడగాల్సిన నాలుగుముక్కలు అడిగి తెల్సుకున్నాక మా బాధలేవో మేమే పడతాం. మీ మీదకు ఏ. గొడవా రాకుండా చూసే పూచీ మాది" హామీ ఇచ్చాడు రషీద్.

"సరే... చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి సుమా. దొరికిపోయేరా మీ ఒళ్ళు హూనమవుతుంది. చిప్ప కూడు తినాల్సొస్తుంది" హెచ్చరించి పంపాడు.

కాసేపటికి వింధ్య కిందకొచ్చి డ్రాయింగ్ రూమ్‌లో భర్త ఒక్కడే ఉండడం చూసి, "వాళ్ళు వెళ్ళిపోయారా? " అనడిగింది.

"వెళ్ళారు"

"మళ్ళీ ఎవరి కొంపకు పెడుతున్నారు నిప్పు" వ్యంగ్యంగా అడిగింది వింధ్య.

"ఎవరో అమ్మాయిమీద మనసుపడ్డారట. ఆ అమ్మాయిని తెచ్చుకుని ఖుషీ చేస్తామంటూ కాళ్ళావేళ్ళా పడ్డారు"

"అందుకు మీరొప్పుకున్నారా? "

"ఒప్పుకోక ఏం చెయ్యమంటావు. మన గుట్టుమట్లన్నీ ఆ వెధవల చేతుల్లో ఉన్నాయి. మనం కాదంటే అవన్నీ రచ్చకీడ్చి మన పరువు మర్యాదలు నడిబజారులో విక్రయిస్తారు" అమరేంద్ర విసుక్కుంటూ అన్నాడు.

"ఇప్పటికైనా అర్థమైందా మనం అర్థంలేని పరుగులు పెట్టి అలసటతో కూలబడ్డామని. సవ్యమైన రాజబాట నొదిలి ముళ్ళకంచెల మీద నడిచే ప్రయత్నం చేసి ఓడిపోయిన వాళ్ళమని అర్థం చేసుకున్నారా. ఇక ఈ పరుగును ఆపెయ్యండి. ఎవరిని ఉద్ధరించాలని కాలంతో ఈ పందెం? విధి ఆడిన ఆటలో చిత్తుగా ఓడిపోయినవాళ్ళం. చరమాంకాన్నైనా మనశ్శాంతిగా బతకాలనుకుంటే వీళ్ళందర్నీ దూరంగా ఉంచండి. మీలో చెడు ఆలోచనల్ని వదిలెయ్యండి" సౌమ్యంగా భర్తకు హితవు చెప్పింది.

"అబ్బబ్బ నీ వేదాంతంతో ఎదుటివాడి బుర్రను తింటావు. ఈ మధ్య నీ ఛాయలకు రావాలంటేనే భయంగా ఉంది. ఎప్పుడూ కాలంతో పందెంవేసి పరుగుపెట్టటమే అలవాటుగా చేసుకున్నవాడు ఒక్కసారి పరుగాపి కూలబడలేడు. ప్రమాదాల అంచున నడిచేవాడికి ఆ క్రీడ వినోదాన్నిస్తుంది తప్ప ఎదురయ్యే ప్రమాదాలను ఊహించి ఫీట్స్ చెయ్యడం మానలేడు. జీవితంలో రాజీపడ్డం, ఓడిపోవడం నాకు చేతకాదు" చెప్పి విసురుగా వెళ్ళిపోయాడు అమరేంద్ర. వెడుతున్న భర్తవంక నిశ్చేష్టురాలై చూసింది వింధ్య.

★ ★ ★

ఉదయం టిఫిన్ పెట్టాక కిచెన్‌నుండి డైనింగ్ హాల్‌కు, డైనింగ్‌హాల్‌నుండి కిచెన్‌కు కాలుకాలిన పిల్లిలా అటు ఇటూ తిరుగుతున్న ఆయాను చూస్తే ఏదో విషయం ఉంది అనుకున్నాడు చిన్నీ. ఓరకంట ఆమెను గమనిస్తూ టిఫిన్ తినసాగాడు.

"అయ్యగారూ!" పిల్చింది ఆయా.

"ఊ..." శివప్రకాష్ తలెత్తకుండానే ఆమె తరువాతి మాటకోసం ఎదురు చూస్తున్నాడు.

"మా వాళ్ళు తీర్థయాత్రలకు వెడుతున్నారు"

"అలాగా..."

మళ్ళీ కాసేపు మౌనంగా ఆగిపోయింది. ఆమె పడుతున్న అవస్థకు చిన్నీకి నవ్వు ఆపుకోవడం కష్టంగానే ఉంది.

"నేనూ వెడదామనుకుంటున్నాను" నసుగుతూ అంది.

"వెళ్ళు" యథాలాపంగా అనేసి, "ఏమిట

న్నావు?" అప్పటికి ఆయా చెప్పింది తలకె క్కినట్టుంది మళ్ళీ అడిగాడు శివప్రకాష్.

"నేనూ తీర్థయాత్రలకు వెళ్ళాలనుకుంటు న్నాను. అదీ మీరు వెళ్ళమంటేనే" ఆయా బెదురుగా అంది.

"నువ్వు తీర్థయాత్రలకు వెడితే మేమేం చెయ్యాలి. హోటల్ మెతుకులు తినాలా"

"అయ్యయ్యో... మిమ్మల్ని అంత అవస్థ పెడతానా? ఈ ఇంటిపని, వంటపని చూసుకోవడానికి మా మేనకోడల్ని ఇక్కడ అప్పగించే వెడతాను" అంది.

"ఇంతకీ యాత్రలు పూర్తి చేసి రావడానికి ఎన్నిరోజులు పడుతుంది?"

"నెలరోజులు"

"బస్సులోనా, ట్రైన్‌లోనా?"

"బస్‌మీదే బాబూ! తిండి సదుపాయ మదీ వాళ్ళే చూసుకుంటారట" చెప్పింది ఆయా.

"టిక్కెట్టెంతట?"

"నాకు వివరంగా తెలియదు బాబూ. ఓ పదివేలు ఖర్చులకుంటే సరిపోతుందన్నారు మా వాళ్ళు. నా దగ్గర ఐదు వేలవరకూ ఉంది. మిగిలింది మీరు అప్పుగా ఇప్పిస్తే ఆ పుణ్యం కూడా మీదే. నెలనెలా జీతంలో కొద్దికొద్దిగా తీర్చుకోవచ్చు" అంది ఆయా.

"చూద్దాంలే. ఇంతకీ ప్రయాణమెప్పుడు?"

"ఇప్పటికి సరిగా పదిహేను రోజుల్లో ఉంటుంది. ఈలోగా ఉత్తరం రాయించి మా మేనకోడల్ని రప్పిస్తాను. ఓ వారంరో జులు దగ్గరుండి అన్నీ నేర్పిస్తే నేనొచ్చేవ రకూ అదే మిమ్మల్ని కనిపెట్టుకుని ఇల్లు చక్కబెడుతుంది" చెప్పింది ఆయా.

"అలాగే. మనిషి ఫరవాలేదు కదా" శివ ప్రకాష్ అడిగాడు సంశయంగా.

"దాని విషయంలో మీరు డౌటు పడక్క ర్లేదు. నాకంటే కూడా చాలా తెలివైందీ, చురుకైంది.

ఏదన్నా ఇట్టే పట్టేస్తుంది. దాని పనితనం మీరే చూస్తారుగా. నేను తిరిగొచ్చాక 'నువ్వొద్దులే ఆయా నీ మేనకోడలు చూసు కుంటుందిలే' అని మీరన్నా ఆశ్చర్యపోను" అంది ఆయా.

"సరే చూద్దాం అదేమిటో" అన్నాడు శివ ప్రసాద్.



"మామయ్యా! ఎల్లుండి నేను హైదరా బాదు వెడుతున్నాను. వీలుంటే అట్నుండి అటే అక్క దగ్గరకు వెడతాను" చెప్పాడు చిన్నీ.

"వీలుంటే అని కాదు, వీలు కల్పించుకుని మరీ వెళ్ళి అక్కను, పిల్లల్ని చూసిరా" శివప్ర కాష్ చెప్పాడు.

"నా పనినిబట్టి ఆలోచిస్తాను. హైదరాబా దులోనే నాలుగు రోజులుండాల్సొస్తే ఆయా తీర్థయాత్రలకు వెడుతోంది. కాబట్టి మీరు ఒంటరిగా ఉండాలి. అందు గురించైనా నేను త్వరగా వచ్చేస్తాను"

"నీయిష్టం" శివప్రకాష్ డైనింగ్ రూము నుండి బయటకు వెళ్ళిపోయాడు.

"ఆయా నీ మేనకోడలికి ఎంత వయసుం టుందేమిటి?" రహస్యంగా అడిగినట్టడి గాడు.

"ఎంతోనా నామీద ఐదారేళ్ళు చిన్నదుం టుందంతే" అంది ఆయా.

"చచ్చాంపో" చిన్నీ బయటకు పరుగుపెట్టినట్టే వెళ్ళిపోటం చూసి ఆయా మనసారా నవ్వుకుంది. 'చినబాబు భలేగడుగ్గాయి. ఆ ముక్కుకు తాడేసే పిల్ల ఎవరో, ఎక్కడుందో' అనుకుంటూ ఖాళీప్లేట్లు, గ్లాసులు ట్రేలో సర్ది పట్టుకెళ్ళి సింక్‌లో పడేసింది.

చెప్పినట్టుగానే రెండురోజుల్లోనే మనిషినెవర్నో పంపి అనకాపల్లినుండి మేనకోడల్ని రప్పించేసింది ఆయా.

ఆయా చెప్పినట్టు ఆమె ఏక సంథాగ్రాహి. పనిచెయ్యటంలో చాలా చురుకు. ఇట్టే ఆ ఇంటి విషయాలు, ఎవరి అవసరాలు ఎప్పుడు ఎలా చూడాలో ఇల్లెలా చక్కదిద్దాలో అన్నీ పట్టేసింది. ఆయా ప్రయాణం రెండు రోజులుందనగా ఇక ఏ పనీ ముట్టుకోకుండా ఇంటి బాధ్యతంతా మేనకోడలి మీదే వదిలేసింది. ఆ రెండురోజుల్లోనే ఆమె పని తీరు శివప్రకాష్‌కు సంతృప్తిగానే అన్పించింది.

చిన్నీ చెప్పినట్టుగానే ఆయా కంటే నాల్రోజులముందుగానే బయల్దేరి హైదరాబాదు వెళ్ళాడు. శ్రావణ్ కూడా స్టేషన్‌కొచ్చాడు.

"ఫొటోరీలు పట్టుకెడుతున్నావా? " జ్ఞాపకం చేశాడు శ్రావణ్.

"బ్యాగులో ఉంది. అన్నట్టు మిన్నూని కాస్త కనిపెట్టి చూడు" అన్నాడు సిద్ధార్థ.

"కనిపెట్టడమంటే ఏం చెయ్యగలను మఫ్టీలో ఉన్న కానిస్టేబుల్ని ఎవర్నయినా రాత్రిపూట నిఘాకు పంపించాలి" శ్రావణ్ అన్నాడు.

"నువ్వేం చేస్తావో నాకు తెలియదు. నేనొచ్చేవరకు ఆమె భద్రత నీదే"

"అలాగేలే నువ్వు నిశ్చింతగా వెళ్ళిరా" ఫ్రెండ్‌కు వీడ్కోలు చెప్పాడు శ్రావణ్.

★ ★ ★

కిందహాల్లోనుండి ఎవరో పరుగెడుతున్న కలకలం మేడమీదున్న వింధ్యకు విన్పిస్తూనే ఉంది. అలాంటి సమయాల్లో తను కిందకు వెళ్లడం అమరేంద్రకు సుతరామూ ఇష్టముండదని తెలుసుకాబట్టే గదిలోనే బంధించినట్టుండిపోయింది. ఉండుండి ఎవరో సన్నగా రోదిస్తున్న రోదన ఆమె చెవిని పడింది. "పాపిష్టివాళ్ళు అన్నంత పని చేశారన్నమాట. ఆ పిల్లను ఎత్తుకొచ్చారన్నమాట" జాలిగా అనుకుంది.

ఆ భవనం ఎందరో ఆర్తుల కన్నీటి కడలిలో పుట్టిన తామర పువ్వని మిన్నూకి అర్థమైంది. ఒకప్పుడు తనాశ్రయం కోరి వచ్చిన ఈ ఇల్లు విషపు కోరల్ని దాచుకున్న నెత్తుటి మందిరమని ఇప్పుడర్థమైంది. ముగ్గురు రాక్షసుల్ని తను ప్రతిఘటించలేదు. అలాగని తన జీవితాశను సమిధను చేసి ఈ అగ్నికి ఆహుతి కావాలనిలేదు.

పమిట స్థానభ్రంశం పొందితే రెండు చేతుల్తో కప్పుకుంది. ఆ అమాయకురాలు మానాభిమానాలు కోల్పోయే క్షణం మరో ఇద్దరికి రాక్షసక్రీడగా, వినోదపు వేటలా ఉంది.

"ఇది నిజం ఒప్పుకోదురా. కానివ్వండి మీ పని" అమరేంద్ర ప్రాణంలేని శిల్పంలా నిలబడ్డ మిన్నూని క్రూరంగా చూస్తూ ఆదేశించాడు.

"అమ్మ తనకందనంత దూరంలో లేదు. ఈ పాపాన్ని చూడలేక ఎక్కడో ఈ మేడలో తలదాచుకునే ఉంటుంది. రషీద్ చెయ్యి ఆమె వీపుమీద పడగానే "అమ్మా" ఆవేదనగా పిల్చింది. ఆ కేకకు భవనమంతా ప్రతిధ్వనించింది. మరోసారి 'అమ్మా' అన్న ఆర్తనాదం వింటూనే వింధ్య అంతరంగపు పొరల్లో దాగిఉన్న మాతృత్వం పొంగి బయటికొచ్చింది. ఇక నిలవలేనట్టు గదిలోనుండి బాల్కనీలోకొచ్చి కింద హాల్లోకి చూసి షాక్ తింది. వాళ్ళెత్తుకొచ్చి నాశనం చెయ్యాలనుకున్న దెవర్నో కాదు, తన చిట్టితల్లిని. ఎంతో అపురూపంగా తన ప్రేమకానుకగా శివకు అందించాలనుకున్న తన కన్నకూతుర్ని. ఆ కోమలకుసుమాన్ని నలిపి నాశనం చెయ్యకముందే తను రక్షిం

చుకోవాలి. ఈ దమనకాండను ఆపాలి.

ఎంత వేగంగా వచ్చిందో అంత వేగంగానూ లోపలికెళ్ళి బీరువాలో దాచిన రివాల్వర్‌తో బయటికొచ్చింది. "ఆగండి" అపరకాళిలా అరిచింది వింధ్య.

"లోపలికిపో" అమరేంద్ర ఉరిమిచూశాడు.

"ఆ అమ్మాయిని తీసుకునే లోపలికి వెడతాను. నీకేం భయంలేదు. ఇలా రామ్మా" పిల్చింది వింధ్య.

కన్నీటిమధ్య కన్నతల్లిని చూస్తోంది మిన్ను. అమ్మా అని పిలుస్తూ అల్లుకుపోవాలనుంది. కాని సంఘం గీసిన గీతదాటి తల్లి తనకోసం రాలేదు. తను వెళ్ళలేదు.

"కదిలేవో పీక నులిమేస్తాను" అమరేంద్ర మిన్నూ వైపు క్రూరంగా చూస్తూ అన్నాడు. మిన్ను నిస్సహాయంగా వింధ్యవైపు చూసింది.

"రామ్మా నీకేం భయంలేదు. ఆ బెదిరింపులను పట్టించుకోకు. ఈ తోడేళ్ళు నిన్నేం చేయలేవు" మిన్ను అడుగు కదిపిందో లేదో రషీద్ ముందుకు రాబోతుంటే పైనున్న వింధ్య ట్రిగ్గర్ నొక్కింది. రషీద్ కుప్పకూలిపోయాడు. మిన్నూ ఒక్కంగలో మెట్లెక్కి పైకి వెళ్ళి తల్లి వెనక్కు వెళ్ళి నిలబడింది.

"వింధ్యా ముందా రివాల్వర్ కింద పారేస్తావాలేదా? " అమరేంద్ర గర్జించాడు.

"పారేస్తాను. ఈ ఘోరాన్నాపి మర్యాదగా బయటకు వెళ్ళండి" వింధ్య కటువుగా అంది.

"ఓహో మంచిగా చెప్తే వినవన్నమాట. నిన్నేంచెయ్యాలో ఎలా వంచాలో నాకు బాగా తెలుసు" అమరేంద్ర కిందమెట్టు దగ్గరకొచ్చేసరికి "వద్దు అక్కడే ఆగిపో ఒక్క మెట్టెక్కినా నిర్దాక్షిణ్యంగా నా చేతిలో చస్తావు" భద్రకాళిలా, మండుతున్న జ్వాలలా ఉంది వింధ్య.

"నీకేమన్నా పిచ్చిపట్టిందా. నన్ను చంపుతావా. నేను నీ భర్తను" అమరేంద్ర ఆవేశంగా అన్నాడు.

వింధ్య నవ్వింది. "భర్తా... ఆ పదానికర్థం తెలుసా. నువ్వెలాటి భర్తవో నీకే బాగా తెలుసు. నీలో భర్తను కాదు ఓ రాక్షసుడినే నేను చూడగలిగాను"

వింధ్య మాట్లాడే ప్రతి మాటా వాడిబాణాల్లా అమరేంద్ర హృదయాన్ని తూట్లుపొడిచాయి.

"నీకీవేళ ఏదో దయ్యం పట్టినట్టుంది. నీ పిచ్చి వదలగొట్టే చిట్కాలు నా దగ్గర చాలా ఉన్నాయి" కోపంతో ఊగిపోతూ మరో మెట్టెక్కాడు.

"వద్దు. రావద్దు. మర్యాదగా బయటకు నడు. భర్తను చంపిన భార్యగా నన్ను ముద్రవెయ్యకు. నీ పాపాలకు ఇప్పుడే ఫుల్‌స్టాఫ్ పడకూడదు. జీవితాంతం నరకయాతనలు అనుభవిస్తూ చావాలి. అందుకే మర్యాదగా వెనక్కు వెళ్ళిపో" హెచ్చరించింది. అమరేంద్ర లెక్కచెయ్యకుండా మరో మెట్టెక్కే ప్రయత్నం చెయ్యబోతుంటే వింధ్య వరుసగా మూడుసార్లు రివాల్వర్ పేల్చింది. అమరేంద్ర పెద్దగా కేకపెడుతూ వెనక్కు విరుచుకుపడిపోయాడు. తన కళ్ళముందే కూలిపోయిన ఆ ఇద్దర్నీ చూసి యాదగిరి బయటకు పరుగుతీశాడు.

రక్తపు మడుగులో పడి ఉన్న భర్తను చూశాక స్పృహలోకొచ్చింది వింధ్య.

"అమ్మా నువ్వేం చేశావో తెలుసా" మిన్ను తల్లిదగ్గరగా వచ్చి ఆమె తలమీద చెయ్యేసి జాలిగా అడిగింది.

"మంచిపనే చేశానమ్మా. తనకళ్ళముందే కూతురి శీలాన్ని కిరాతకంగా దోచేస్తుంటే ఏ కన్నతల్లి మనసు అంగీకరిస్తుంది"

"ఈ నేరం నువ్వు చెయ్యలేదు. నేను చేశానని చెప్తాను. మాన సంరక్షణకోసం ఎవరినయినా చంపినా పెద్దగా శిక్షవెయ్యరు. అందుకే ఈ నేరం నామీద వేసుకుంటాను" రివాల్వర్ తీసుకుని వింధ్య చేతిముద్రలు లేకుండా శుభ్రంగా తుడుస్తుంటే వింధ్యకు

# ఏరిన ముత్యాలు

★ పురోగతి నేటి కార్యకలాపం అయితే వాగ్దానం రేపటి కార్యకలాపం.

– ఎమర్సన్

★ దయ అన్నది మూగవాడు మాట్లిడి చెవిటివాడు విని అర్థం చేసుకునే భాష.

– సి.ఎన్.బోవీ

★ సమయం చాలా దుర్లభమైనది. సమయాన్ని పాటించలేనివాడు దేనినీ సరిగ్గా నిర్వహించలేడు.

– పీటర్‌డ్రకర్

★ మీరు ఎటుపోతున్నారో తెలియకపోతే మీరు మీ గమ్యాన్ని ఎలా చేరగలరు?

– పాల్కీవాలా

★ సంఘర్షణలు లేకుండా ప్రతిరోజునూ తాజాగా జీవించ గలిగినప్పుడే మనం ఉత్తములుగా తయారవుతాం.

– మాక్స్‌వెల్

★ గొప్పతనాన్ని అన్వేషించాలనుకున్నప్పుడు గొప్పతనాన్ని మరిచిపోయి నిజాన్ని కోరండి. అప్పుడు మీకు గొప్పతనం, నిజం రెండూ దక్కుతాయి.

– హోరెస్‌మాన్

★ చాలా ఎక్కువ శబ్దం చేసే డోలులో గాలి తప్ప మరేమీ ఉండదు.

– చిన్మయానంద

★ ఈ భూమిపై ఉన్నందుకు మీ గుర్తును వదిలివెళ్లండి.

– స్వామీ వివేకానంద

★ మీరు పట్టుదల గలవారా? అయితే ఈ క్షణాన్ని మీ వశం చేసుకోండి

– గోధె

★ ఓపిక అన్నది చేదుగా ఉంటుంది. కానీ దాని ఫలితాలు మాత్రం తియ్యగా ఉంటాయి.

★ దయను పంచడం అన్నది చాలా కష్టతరమైన పని. అయినా ఆ దయని మనం మాత్రం కోరుకుంటాము.

– మహమ్మద్ ప్రవక్త

★ మంచిపట్ల ఆశ, చెడుపట్ల భయం... ఈ రెండే మానవ మేథస్సును ముందుకు తీసుకుపోయే గొప్ప శక్తులు

– శామ్యూల్ జాన్సన్

★ మన ఆశయాలు, మన అదృష్టం ఎప్పుడూ పరస్పర విరుద్ధంగానే ఉంటాయి.

– అండ్రేమొరై

సేకరణ: – పి.వి.రమణ కుమార్



కన్నీరాగలేదు.

"అమ్మా కీర్తనా ఒక్కసారి నిన్ను మన సారా కౌగలించుకోనీ. నిన్ను నా గుండెల కత్తుకోనీ. ఇలా దగ్గరగా రామ్మా" తల్లి చాపిన చేతుల్లో గువ్వలా ఒదిగిపోయింది.

"పాపిష్టిదాన్ని, ఈ ఇల్లు నీకు రక్షణనివ్వదనే ఆశ్రయం కోరివచ్చినా కాదని కసాయిదా నిలా నెట్టేశాను"

"లేదమ్మా నిన్నెప్పుడూ తప్పుగా అనుకో లేదు. నీ గర్భాన రూపుదిద్దుకున్ననాడే నన్ను హత్య చెయ్యకుండా ఈలోకాన్ని చూసే అదృష్టాన్నిచ్చినందుకు ప్రతి రోజూ నిన్ను గుర్తుతెచ్చుకుంటూనే ఉండేదాన్ని. నీ ఒడిలోనుండి జారిపడ్డా నీ జీవితాధ్యా యంలో పొదగబడ్డ అక్షరాన్ని. నీ దయే లేకుంటే నాకసలు అస్తిత్వమేదమ్మా. నువ్వంటే నా గుండెలో కొండంత ప్రేమ తప్ప మరో భావమేదీ లేదమ్మా" మిన్నూ మాటలకు ఆ కన్నతల్లి గుండెల్లో అను రాగం, మమకారం నిండుగా పొంగిపొర్లాయి.

"నా బంగారు తల్లివి. నిన్ను బయటకు పంపేశానేగాని ఇన్ని రోజులుగా నీకోసం వెదుకుతూనే ఉన్నాను. నీకు జన్మకారకుడైన తండ్రి ఈ ఊళ్లోనే ఉన్నారు. ఆయనకెలా గైనా నిన్నప్పగించాలన్నదే నా ప్రయత్నం. ఈ ప్రయత్నంలో నేను గెలిచానమ్మా. ఇప్పుడు నీ తండ్రిదగ్గరకు నిన్ను చేర్చి ఈ సంఘంలో నువ్వు గర్వంగా తలెత్తుకునేలా చేస్తాను. మనిషికి డబ్బు, నా అనే అండ దండలు ఉంటే చాలు. అవే గౌరవాన్ని ఆపాదిస్తాయి. నువ్వెళ్ళి చీర కట్టుకో. నేను మీ నాన్నగారికి ఫోన్‌చేసి వెంటనే బయల్దేరి రమ్మని చెబుతాను" అంటూ తన గదిలోకి వెళ్ళింది వింధ్య.

మిన్నూ చీరకట్టుకుని పమిటచెంగు నిండుగా కప్పుకుని తల్లి గదిలోకి వెళ్ళేసరికి

ఆమె అప్పటికే సీరియస్‌గా కాగితంమీద ఏదో గబగబా రాస్తోంది.

"అమ్మా కీర్తీ కింద హాల్లోకెళ్ళి శివప్రకాష్, అంటే నీ తండ్రిగారువస్తే నా గదిలోకి తీసుకురా" అంటూ కూతుర్ని కిందకు పంపేసింది.

ఫోన్లో వింధ్య చెప్పింది వింటూనే శివప్రకాష్ వెంటనే బయల్దేరి వచ్చేశాడు. "వింధ్యా" పిలుస్తూ హాల్లోకొచ్చిన శివప్రకాష్ శవాలుగా మారిన అమరేంద్రను, రషీద్‌ను చూసి స్టన్నయ్యాడు.

"శివప్రకాష్ అంటే మీరేగా" మిన్నూ అడిగింది.

"అవును నేనే. ఇదంతా ఏమిటి? వింధ్య ఎక్కడుంది? " అడిగాడు గాభరాగా.

"మేడమీదున్నారు. మీరొస్తే పైకి తీసుకు రమ్మంది. రండి వెడదాం" అంటూ ఆయన్ను తీసుకుని మేడమీదకెళ్లింది మిన్ను.

అప్పటికే వింధ్య మంచంమీద అడ్డంగా పడుకుని మరణయాతన అనుభవిస్తోంది. నల్లగా మారిపోతున్న ఆమెను చూడగానే పాయిజన్ తీసుకుందని అర్థమైంది.

"వింధ్యా..." వెర్రిగా కేకపెట్టి ఆమెను ఒడిలోకి తీసుకున్నాడు.

"వచ్చావా శివా. నీకు మాటిచ్చినా నిలబెట్టుకోలేకపోయాను. భర్తను చంపిన నేరాన్ని అంగీకరించి చట్టంముందు ఛిద్రమైన నా బతుకును వీధిలో పడెయ్యలేక ఈ పని చేశాను. కన్నకూతుర్ని చూసుకుంటూ నాకు బతకాలని ఉన్నా కాలం నాకు చేదునే తప్ప తీపిని మిగలనియ్యలేదు. టేబుల్‌మీద కాగితం రాసిపెట్టి ఉంచాను. అది నా మరణవాఙ్మూలం. అదిగో మన ప్రేమఫలం కీర్తన. అమ్మా కీర్తీ ఇలా రామ్మా" కూతుర్ని దగ్గరగా పిలిచి చెయ్యందుకుని శివప్రకాష్ చేతికందించింది.

"శివా! నా జ్ఞాపకంగా నేనిస్తున్న కానుక నందుకో. పదిలంగా గుండెలో దాచుకో. నాకిప్పుడెంతో తృప్తిగా ఉంది. నీ బిడ్డను నీకందించాను. అంతే కాదు చివరిశ్వాస నీ ఒడిలో విడవాలన్న నా తుదికోరిక నేరవేరుతున్నందుకు చాలా సంతోషంగా ఉంది. శివా మళ్ళీ జన్మలో నీ భార్యనవుతాను. మరోకీర్తికి, బాబుకి జన్మనిస్తాను" ఇంకా ఏదో మాట్లాడబోతూనే ప్రాణం వదిలేసింది వింధ్య.

"వింధ్యా" ఆమె ముఖాన్ని రెండుచేతుల్లో ఇమిడ్చి ఘొల్లుమన్నాడు శివప్రకాష్. తల్లంటే తండ్రికి ఎంతప్రేమో అర్థమై తండ్రి దగ్గరగా చేరి "ధైర్యం తెచ్చుకోండి నాన్నా. మీరే ఇలా డీలాపడితే నా పరిస్థితేమిటి. ముందు జరగాల్సిందేదో చూడండి" కన్నీరు తుడుచుకుంటూ తండ్రికి ధైర్యం చెప్పింది.

"ఏమన్నావమ్మా"

"మీరు నాకు జన్మనిచ్చిన తండ్రేగా అందుకే నాన్నా అని పిలిచాను"

"మళ్ళీ పిలువు తల్లీ. నీ పిలుపు ఎంతో మధురంగా విన్పిస్తోంది. నిన్ను నా చేతికి గర్వంగా అందించాలని ఆశపడింది. ఈ స్థితిలో మనం కలుసుకోవడం అపురూప వరం అనుకోవాలో, విషాదగీతమనుకోవాలో నాకే తెలియడంలేదు తల్లీ. ఓ వంక నా బిడ్డ లభించిందన్న ఆనందం, మరోపక్క ప్రేమైక మూర్తి దూరమైందన్న వేదన మనిషి జీవితం ఈ సుఖదుఃఖాల నడుమ ఊగిసలాడే నావలాంటిదనుకుంటా" కూతుర్ని దగ్గరగా తీసుకుని ఆవేదనగా అన్నాడు.

ఆ తరువాత ఎస్.ఐ. శ్రావణ్‌కు ఫోన్ చేసి విషయం చెప్పటం, క్షణాలమీద రావటం, శవాల్ని స్వాధీనం చేసుకుని ఫార్మాలిటీస్ పూర్తిచేసి పోస్టుమార్టమ్‌కు పంపటం జరిగింది.

వింధ్య చివరగా రాసిన లెటర్‌ను శ్రావణ్ తీసుకుని కేసు ఫైల్ చేసుకున్నాడు. పోస్ట్‌మార్టమ్ అయ్యాక వింధ్య శవాన్ని శివప్రకాష్ తీసుకుని దగ్గరుండి దహనసంస్కారం చేశాడు. అమరేంద్ర డెడ్‌బాడీని మణికి

అప్పగించారు. మరో ఇరవైనాలుగ్గంటల్లో యాదగిరిని కూడా పోలీసులు అరెస్టు చెయ్యగలిగారు.

దహనసంస్కారం చేశాక మిన్నూని తనింటికి తీసుకెళ్లాడు శివప్రకాష్. ఆ ఇల్లు చూడగానే ఏదో సందేహంతో సతమతమవుతూ "నాన్నగారూ ఈ ఇల్లెవరిది? " విస్మయంగా అడిగింది.

"మనదేనమ్మా"

"మనది అంటే ఎవరిదగ్గరైనా మీరు కొన్నారా? దగ్గరుండి కట్టించారా? " ఏదో తెలుసుకోవాలన్న ఉద్దేశ్యంతో అడిగింది.

"కట్టించలేదు. ఎవరో అమ్మేస్తుంటే కొన్నాను" చెప్పి "రంగీ" అని పిలిచాడు.

"వత్తున్నానండయ్యా" అంటూ వచ్చిన పని మనిషిని చూడగానే మిన్ను డౌటు క్లియరయ్యింది. తను చూసినప్పుడు ఈ ఇల్లు ఆ గ్రేకలర్ ప్యాంట్‌వాలాదేగాని ఇప్పుడు తన తండ్రిది. అతడీ ఇల్లు అమ్మేసి ఎక్కడికో మకాం ఎత్తేసుంటాడు. ఇల్లతనిదే అయితే ఆయాగా ఉండాల్సింది ఈమెకాదు. తనప్పుడీ ఇంట్లో చూసింది మరొకామెను" మనసులో అనుకుంది.

"రంగీ అమ్మాయిగారికి బాత్‌రూమ్ అదీ చూపించు" అని చెప్పి "వెళ్లి స్నానం చేసిరా" అంటూ కీర్తనను పంపించాడు శివప్రకాష్.

ఫ్రెష్‌గా స్నానం చేసి వచ్చాక ఇల్లంతా పరిశీలించింది మిన్ను. "కీర్తి నీకు బట్టలవీ లేవుకాబట్టి ఆనక షాపింగ్‌కు వెడదాం. నచ్చిన వాటిని సెలక్టుచేసుకోవచ్చు" అన్నాడు కూతురుతో.

"ఇప్పుడు నాకు చీరలెందుకు చెప్పండి. ఒకసారి రూమ్‌కు వెళ్ళి నా బట్టలవీ తెచ్చుకుంటాను. నేను కనబడకపోటంతో ఈ పాటికి ఆనంద్ కంగారుతో పిచ్చివాడే అయిపోతాడు" అంది.

"ఆనంద్ ఎవరమ్మా? "

"ఆనంద్ నా రూముపక్కనే అద్దెకుంటున్నాడు నాకు మంచి స్నేహితుడు. మొన్న రాఖీ పండగరోజున నాచేత రాఖీ కట్టించుకుని అన్నయ్య కూడా అయ్యాడు. నా కష్టసుఖాలు తనవిగా భావించి నన్నాదుకున్న సహృదయుడు. నేనంటే అతడికి చాలా అభిమానం" చెప్పింది మిన్ను.

"కీర్తీ ఈ పరిస్థితుల్లో నువ్వు బయటకెళ్ళడం మంచిదికాదమ్మా. నువ్వు నేనెంతో తపనపడి ఇంటికి తెచ్చుకున్న ప్రేమ ఫలానివి. మరోసారి నిన్ను జారవిడుచుకొని నా దురదృష్టాన్ని నిందిస్తూ బతకలేను. డ్రైవరును పంపిస్తాను ఆ రూమ్ అడ్రసు చెప్పు. ఓ చిన్న లెటర్ కూడా డ్రైవరుతో పంపించు" అన్నాడు శివప్రకాష్.

"అలాగే నాన్నగారూ! లెటరివ్వనుగాని ఆనంద్‌నే దగ్గరుండి తీసుకురమ్మని డ్రైవరుతో చెప్తాను" అంది.

"చెప్పటం మరిచాను. సిద్ధార్థ నీకు బావ వరసవుతాడు. నా అక్కబిడ్డలు వాళ్ళిద్దరూను. తల్లిదండ్రులు చిన్నప్పుడే పోతే నేనే పెంచి పెద్దచేశాను. అమ్మాయికి పెళ్ళిచేసి పంపేసినా ఈ మొండివాడిని మాత్రం పెళ్ళికి ఒప్పించలేకపోయాను" అన్నాడు మేనల్లుడిని తల్చుకుని.

"ఎందుకొప్పించలేకపోయారు? అతడికి పెళ్ళిచేసుకోటం ఇష్టంలేదటనా? "

"కాదమ్మా. వింధ్య అప్పుడప్పుడు నా దగ్గరకొచ్చి మాటాడి వెడుతుండేది. మాటల్లో నా రక్తం పంచుకుపుట్టిన నీ గురించి చెప్పుండగా వాడామాటలు విన్నాడు. చేసుకుంటే మామయ్య కూతుర్నే చేసుకుంటానని పట్టుబట్టి కూర్చున్నాడు. నీ ఆచూకీ తెలుసుకోటానికి ఆమధ్య వింధ్యా వాళ్ళూరు నందమూరు, ఆ చుట్టు పక్కలగ్రామాలు, నీ ఫ్రెండెవరో కాకినాడలో ఉందని తెలిసి అక్కడక్కూడా వెళ్ళొచ్చాడు"

"అరె అంత అభిమానందేనికి, నా ముక్కూ ముఖం తెలియకుండానే అంతటి నిర్ణయం తీసుకున్నాడంటే అతడికి మీరంటే అంత అభిమానమన్నమాట" అంది

మిన్ను.

"అవును... వాడికి నేనంటే చాలా ప్రేమ"

"ఒకవేళ నేను అందంగా లేకుండా అనాకారిలా ఉంటే చేసుకునే వారేనటనా? " అడిగింది మిన్ను.

"ఏమో ఆ విషయం నువ్వే అడుగు. ఎల్లాగూ ఈవేళో, రేపో వస్తాడుగా" నవ్వుతూ అన్నాడు శివప్రకాష్.

ఆనంద్‌కు కూడా డ్రైవర్‌ని పంపి ఇంటికి రమ్మని ఖబురుపంపి జరిగిన విషయాలన్నీ చెప్పింది మిన్ను. ఆశ్చర్యంతో, ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడతడు.

ఏదో ఓరోజు మిన్నూని ఇలాంటి అదృష్టం వరిస్తుందని అతను అనుకునేవాడు. మిన్నూ, శివప్రకాష్‌ల అభ్యర్థనపై వాళ్ళ ఔట్‌హౌస్‌కి షిఫ్టయిపోయాడు ఆనంద్.

★ ★ ★

అప్పటికి రాత్రి సుమారు పదకొండు గంటలు దాటింది. హైదరాబాదు వెళ్లిన సిద్ధార్థ టాక్సీలో ఇంటికొచ్చాడు. మాలి వీధివైపున్న గేటు తెరిచి మళ్లీ తాళం పెట్టేశాడు.

కింద హాల్లోనే నిద్రపోతున్న శివప్రకాష్ మేనల్లుడు వచ్చిన అలికిడికి కళ్లు తెరిచి "చిన్నా నువ్వేనా" అన్నాడు.

"నేనే మామయ్యా" అంటూ లైటు స్విచ్ వేసి "మీరింకా నిద్రపోలేదా? " అడిగాడు.

"నువ్వొచ్చిన అలికిడి విన్నాకే మెలకువచ్చింది" అంటూ లేచి కూర్చుని "చిన్నా ఒక శుభవార్త చెప్పాలనే నీకోసం కళ్లు కాయలు కాచేలా ఎదురుచూస్తున్నానురా" అన్నాడు.

"ఏమిటి మామయ్యా ఆ శుభవార్త" చిన్నీ సూట్‌కేసు కిందపెట్టి మామయ్యకెదురుగా కుర్చీలాక్కుని కూర్చున్నాడు.

"చిన్నా నీ పెళ్లికి ఈ నెల్లోనే ముహూర్తాలు పెట్టించెయ్యాలనుకుంటున్నాను. నీకభ్యంతరం లేదుగదా"

"నాకా! పెళ్లా? ఎవరితో? " అడిగాడు చిన్నీ.

"నువ్వు కోరుకున్నట్టే మీ మామయ్య కూతురు, నీ మరదలు కీర్తనతోనే" శివప్రకాష్ నవ్వుతూ అన్నాడు.

"అంటే మైగాడ్! కీర్తన్ను తెలుసుకోగలిగారా? ఇదంతా ఎలా జరిగింది? " ఆశ్చర్యంగా అడిగాడు.

"నేను తెలుసుకోటంకాదు. వింధ్యే నా కూతుర్ని అప్పగించి తన జీవితాన్ని మనకోసమే త్యాగం చేసింది" అంటూ జరిగింది క్లుప్తంగా చెప్పాడు.

"మైగుడ్‌నెస్, నేను వెళ్లాక ఇన్ని విచిత్రాలు జరిగాయన్నమాట. కీర్తన ఇప్పుడు ఎక్కడుంది? " అడిగాడు.

"మనింట్లోనే ఉంది. నా బిడ్డను నా ఇంటికి తెచ్చేసుకున్నాను. ఇక పెళ్లికి నీనుండి అభ్యంతరం ఉండదనే అనుకుంటాను" అన్నాడు.

"నా ఆలస్యమేంలేదు మామయ్యా. అంతా మీ ఇష్టం" నవ్వుతూ అన్నాడు.

ఇంతలో రంగి అక్కడికొచ్చి "బాత్రూమ్‌లో నీళ్లు పెట్టాను చినబాబూ! స్నానం చేసొస్తే భోజనం వడ్డిస్తాను" అంది చిన్నీతో.

"ఇప్పుడు భోజనమేమిటి? రెండు బ్రెడ్‌స్లయిస్ తిని పాలు తాగుతాలే! నేనొచ్చేసరికి అవి సిద్ధం చెయ్యి" చెప్పి టాయిలెట్‌కు వెళ్లాడు చిన్నీ.

స్నానం చేసి నైట్‌గౌన్ వేసుకుని పాలు తాగి మళ్లీ మేనమామ దగ్గరకొచ్చాడు.

"ఇంతకీ అక్క దగ్గరకు వెళ్లేవా లేదా? " అడిగాడు శివప్రకాష్.

"వెళ్లడానికి కుదరలేదు. హైదరాబాదులో పని త్వరగా పూర్తవకపోవటంవల్ల ఆగిపోయాను. ఇంతకీ కీర్తనతో నా గురించి చెప్పారా మామయ్యా" ఏదో తెలుసుకోవాలన్న ఆసక్తితో అడిగాడు.

"చెప్పాను"

"నన్ను పెళ్లిచేసుకునే అభిప్రాయం తనకుందోలేదో అడిగి తెలుసుకున్నారా? "

చిన్నీ కుతూహలానికి నవ్వుకుంటూ "ఆ

విషయం అమ్మాయిని నువ్వే స్వయంగా అడిగి తెలుసుకుంటే బావుంటుంది" అన్నాడు.

"అలాగే నేను మేడమీదకు వెడుతున్నా. మీరు నిద్రపొండి గుడ్‌నైట్" అంటూ లైటార్పి మెట్లెక్కబోతుంటే "అమ్మాయి నీ గదిలోనే పడుకుంది. మరదల్ని చూడాలన్న కుతూహలం ఉంటుంది కాబట్టి ఓసారి చూసుకో" అన్నాడు.

మేనమామ మాటలకు చిన్నీ ముఖం సిగ్గుతో ఎర్రనైంది. చిన్నగా నవ్వుకొంటూ "ఇంతకీ కీర్తన ఎలా ఉంటుందో" ఎంతో యాంగ్జయిటీతో దగ్గరగా వేసి ఉన్న తలుపు తెరిచి లోపలికడుగుపెట్టాడు.

మెత్తటి ఫోమ్ బెడ్‌మీద పాలరాతి శిల్పంలా అందమైన భంగిమలో పడుకున్న కీర్తన ముఖంలోకి కుతూహలంగా తొంగి చూసిన వాడల్లా ఆ ముఖారవిందాన్ని చూడగానే తుళ్ళిపడ్డాడు.

"మిన్నూ... మిన్నూలా ఉందే" నైట్ బల్బ్‌కాంతిలో మరింత గుచ్చిగుచ్చి చూశాడు. నిజంగా మిన్నూయే. అంటే తను కోరుకుని ఆరాధించే ప్రేయసే తన ఫియాన్సీ కీర్తనన్నమాట. యురేకా" గట్టిగా అరిచి ఒక్క గెంతు గెంతాలన్న కోరికను నిశ్శబ్దంగా అణుచుకున్నాడు. అక్కడలా మిన్నూని చూసేసరికి అతడిలో చిన్న చిలిపి ఊహ కదిలింది.

నెమ్మదిగా ఆమె తలవైపు కూర్చుని చెక్కిలిని సున్నితంగా నిమిరాడు. తుళ్ళిపడి కళ్ళు తెరిచి తన తల దగ్గరున్న పురుషాకృతిని చూసి కెవ్వున అరవబోయింది. చటుక్కున తన చేత్తో ఆమె పెదవుల్ని మూసేశాడు.

విసురుగా అతడ్ని నెట్టేసి లేచివెళ్ళి లైటు వెలిగించింది. ట్యూబ్‌లైటు పరుచుకున్న వెల్తురులో తనవైపు చిలిపిగా చూస్తున్న చిన్నీను చూసి "తమరా మహాశయా ఇంత అకస్మాత్తుగా ఎలా దయచేశారు" అడిగింది వ్యంగ్యంగా.

"నా హృదయాన్ని దోచుకున్న ఓ అందాలభరిణ ఇక్కడే ఉందని తెలిసింది. అందుకే పరుగెత్తుకొచ్చాను" అన్నాడు.

"ప్లీజ్ మీరిలా రావటం మర్యాదకాదు. మా నాన్నగారు చూస్తే బావుండదు. దయచేసి ఇక్కడనుండి వెళ్ళిపోండి" అంది.

"బావుంది... నువ్వొచ్చింది నా గదిలోకి. నన్ను బయటకు పొమ్మంటే ఎలా? " అన్నాడు.

"సరే... నేనే వెడతాను!" వెళ్ళబోతుంటే ఒక్క అంగలో ఆమెను సమీపిస్తూ "ఆగు మిన్నూ!" అంటూ తలుపు గడియపెట్టి రెండు చేతుల మధ్య ఆమెను పసిపాపలా ఎత్తిపట్టి బెడ్‌మీద పడుకోబెట్టాడు.

"ఏమిటిది, ప్లీజ్ నన్ను వెళ్ళనీయండి" లేవబోయింది. చటుక్కున ఆమెను తన కౌగిట్లో బంధించేశాడు. "వద్దు వదలండి. మీరంటే నాకసహ్యం. ఐ హేట్ యు" అంది అతడ్ని నెట్టేస్తూ.

"అలాగా ఆమాట నా ముఖంలోకి చూసి చెప్పు" ఆమె వీపు నిమురుతూ అన్నాడు. ఆ మాటల్లో మధురిమ ఆమెను మంత్రించి వేసింది. ఆ స్పర్శ ఆమెను మూగబొమ్మగా మార్చేసింది. ఆ కళ్ళు తన మేనులో అణువణువును స్పర్శించినట్టే తడిమిచూస్తాయి. ఆ చూపులకు తన మనసు మైనంలా కరిగి నీరయిపోతుంది. తన చుట్టూ పెనవేసుకున్న ఈ చేతులమధ్య జీవితాంతం ఒదిగిపోయి విశ్రాంతిగా సేద తీరాలనుంటుంది. తనకు తెలియకుండానే అతడ్ని మరింత హత్తుకుపోతున్న మిన్నుని చూసి పకపక నవ్వేశాడు. అతడి నవ్వు చూస్తే ఉక్రోషం వచ్చింది. అతడ్ని దూరంగా నెట్టేయబోతే అతడి కౌగిలి మరింత బిగుసుకుంది.

"ఎందుకంత ఉడుకుమోత్తనం. నా మాట, ఉనికి, స్పర్శ నిన్ను స్పందింపచెయ్యలేదని చెప్పు నేనే నీకు దూరంగా వెళ్ళిపోతాను" మంద్రస్థాయిలో అన్నాడు.

మిన్నూ మాట్లాడలేదు. "నాకు తెలుసు నీ మనసు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావనటానికి నీ కళ్లే మౌన సాక్ష్యాలు. చిన్నగా కంపించే నీమేని పులకింతలు నా పురుష హృదయాన్ని రెచ్చగొడుతుంటే నీలోని స్పందనను నానుండి దాచుకునే ప్రయత్నమెందుకు. నువ్వు నాక్కావాలి మిన్నూ డియర్" తమకంగా తను చెప్పాలనుకున్నది చెప్పేశాడు.

"..."

"నాతో మాట్లాడ్డం ఇష్టంలేదా? లేక నేనంటే ఇష్టంలేదా? " అన్నాడు.

"అదేంలేదు, మీరు మాటాడుతుంటే వినడమే నాకిష్టం. ఆ క్షణంలో నేను మాటలు మర్చిపోయిన మూగబొమ్మనైపోతాను. మంద్రంగా విన్పించే మీ మృదుస్వరం సంగీతంలా విన్పిస్తుంది" అంది అతని చేతిని సుతారంగా నొక్కుతూ.

★ ★ ★

ఉదయం మిన్నూ నిద్రలేచి మేడదిగి వస్తూ అప్పటికే ఫ్రెష్‌గా తయారై ఫోన్లో మాట్లాడుతున్న చిన్నీను చూసి ఆగి ఆ సంభాషణ వినసాగింది.

నెమ్మదిగా వచ్చి అతడి పక్కకు చేరి "బావా ఓ విషయం అడుగుతాను నిజం చెప్తారా" మెల్లగా అడిగింది.

"బావా... ఈ పిలుపెప్పట్నుండి. అయినా వినబుల్‌గానే ఉందిలే" అన్నాడు చిలిపిగా. "ఒక్కమాటకాదు వందడుగు చెప్తాను" అన్నాడు.

"మంగళ ఎక్కడుందో మీకు తెలుసు కదూ? " అడిగింది.

"తెలుసు. మంగళను నేనే బెంగుళూరులో నర్సు ట్రైనింగ్‌లో జాయిన్ చేశాను. ఆమె క్షేమంగానే ఉంది. మంగళ విషయంలో నీకు బెంగ అవసరంలేదు. కావాలంటే ఆమె అడ్రసిస్తాను లెటర్ రాసి క్షేమ సమాచారాలు తెలుసుకో సరేనా"

"మరో విషయం అడగొచ్చా"

"అడుగు"

"శ్యామ్ నా దగ్గర దాచిన ఫోటో రీలు మాయమవటంలో మీ పాత్ర ఎంతవరకుందో చెప్తారా"

ఉలికిపడ్డాడు. తర్వాత పకపకనవ్వేస్తూ "ఒరే ఆనందూ, నేనురా అబ్బీ! తల్లావఝుల వారి వంశస్తుడిని" అంటూ టోన్ మార్చి మాట్లాడగానే మిన్నూకి విషయం అర్థమైంది.

"బావా ఆ ఫోటో రీలేం చేశారు? " అడిగింది.

"కాల్చి బూడిద చేశాను. కాలగతిలో కలిసిపోయిన కథకు సాక్ష్యాలెందుకు? " అన్నాడు.

"ఇంతకీ శ్యామ్‌ది మర్డరేకదూ? " అంది.

"మర్డరేనని నీకూ తెలుసుగా. నువ్వీ కేసులో మౌనసాక్షివి. శ్యామ్ చివరగా కలుసుకున్న వ్యక్తివి నువ్వేనని నాకు తెలుసు. తన భార్య శీలంతో వ్యాపారం చేసేవాడు అమరేంద్ర. ఆ వ్యాపారానికి సంబంధించిన ఫోటోరీలే శ్యామ్‌వద్ద వుండడం తెల్సి శ్యామ్‌ను చంపించాడు. ఈ విషయం యాదగిరి పోలీసులముందు ఒప్పుకున్నాడు. కేసు శ్రావణ్ ఫైలు చేసుంటాడు" అన్నాడు సిద్ధార్థ.

"పాపం! అమ్మకి తీరని అన్యాయం జరిగింది. నాకెప్పటికీ అది తీరనిలోటే. శ్యామ్ అన్నయ్యను తల్చుకుంటే కూడా నాకు బాధగా ఉంటుంది. మంగళకు తీరని అన్యాయం చేశాడా భగవంతుడు" బాధగా అంది మిన్నూ.

"మిన్నూ ఆ విషయాలన్నీ మరిచిపోదాం. అదొక విషాద చిత్రం. ఆ చిత్రాన్ని చించి ముక్కలు చేసి కొత్త జీవితాన్ని ప్రారంభిద్దాం. నీకు జీవితం మీదున్న ఆశలు, పెంచుకున్న స్వప్నం నాకు తెలుసు. నీ జీవిత భాగస్వామిగా ఆ కలను నిజం చెయ్యటం నా బాధ్యత. నా మీద భరోసాతో నువ్వు నిశ్చింతగా ఉండు. ఇకనుండి ఆ చేదును మర్చిపోయి తీపినే ఇద్దరం పంచుకుందాం" అంటూ మిన్నూని దగ్గరగా తీసుకున్నాడు సిద్ధార్థ. వారించకుండా అతడి గుండెలో గువ్వలా ఒదిగిపోయింది మిన్నూ.

☆




# అగ్గిపుల్లతో శిల్పాలు....



రేకార్క్ హాబీ శిల్పాలు చెక్కడం. అంగుళంలో 16వ వంతు పరిమాణంలో ఉండే అగ్గిపుల్లలను తీసుకుని పుల్లకి వెనకవైపు ఇతను రకరకాల భంగిమలలో శిల్పాలను చెక్కుతాడు. అయితే జిగురు వాడడు. లండన్ నగర నివాశి అయిన కార్క్ కేవలం బ్లేడును ఉపయోగించి వాటిని చెక్కుతాడు. ఒకటి పూర్తికావడానికి 6 గంటల సమయం పడుతుందతనికి. "ఓర్పు, ఏకాగ్రత నేను అధికంగా వాడే పరికరాలు" అంటాడీకళాకారుడు నవ్వుతూ.

# చతుర కతలు

## కర్తవ్యం

పార్వతి కొడుకు రజనీకాంత్ అమెరికా నుంచి వచ్చాడు. రెండేళ్ళ తర్వాత వచ్చిన వాడు తీరికగా ఇంట్లో కూర్చుని, వండినవి



తిని, కబుర్లు చెప్పక... ఉదయం భోంచేసి వెళ్ళి సాయంకాలం పొద్దుపోయాక వస్తున్నాడు. ఎక్కడికెడుతున్నాడో వాడు చెప్పనూ లేదు. తను అడగనూలేదు. ఎవరైనా గర్ల్ ఫ్రెండ్ వుందేమోనని తన అనుమానం. ఆ సంగతి చెప్పడానికి వాడు భయపడుతున్నాడేమో. ఖర్మకాలి ఏ సుముహూర్తాన కులం గాని ఏ పిల్లనో పెళ్ళి చేసుకుంటాననే శుభ వార్త చెబుతాడేమో అని హడిలిపోతోంది.

"కని, పెంచి, పెద్దచేసి, పెద్ద చదువులు చదివించినందుకు మనకి ఇష్టమైన అమ్మాయిని కోడలిగా తెచ్చుకునే అవకాశం లేదా? బోలెడంత డొనేషన్ కట్టాం. అమెరికాలో చదవాలంటే, లక్షలు ఖర్చుపెట్టాంగదా" అంది భర్తతో.

"కలెక్టర్ కూతుర్నో, మినిస్టర్ మనవరాలినో తెచ్చి పెళ్ళి చేయగలమా ఏమిటి? వాడేం కుర్రకుంకా?" అని కొట్టిపారేశాడు భర్త.

పార్వతి రకరకాలుగా ఆలోచించి, చివరికి మర్నాడు రజని బయల్దేరగానే ఫాలో అయింది.

రజనీ వెళ్ళేచోట్లు తెలియగానే ఆమెకు నవ్వాలో ఏడ్వాలో తెలీక కోపం వచ్చేసింది.

అక్కడే నిలదీసి ఛడామడా తిట్టి, గొడవ చేయాలనుకుంది. తననుతాను కంట్రోల్ చేసుకుని, ఇంటికి వచ్చాక కొడుకుని అడిగింది.

"కన్నవాళ్ళం, మాకంటే వాళ్ళే ఎక్కువైపోయారా? నీకోసం ఎంత డబ్బు ఖర్చు

చేశాం? నువ్వు చేస్తున్నదేమిటి? ఆ హోంలలో ముసలాళ్ళమీద ఏమిటీ అంత ప్రేమ? "

"ఎవరికైనా 'కర్తవ్యం' ముఖ్యం అమ్మా. అది నెరవేర్చాలి గదా" అన్నాడు రజని.

"అంటే...? " అర్థంకాక అడిగింది.

"నన్నింతవాణ్ణి చేసి నువ్వూ, నాన్నా నాపట్ల కర్తవ్యం నిర్వర్తించారు. అలాగే గతంలో తాతయ్యా, నానమ్మలను 'ఓల్డేజ్ హోమ్‌లో' చేర్పించి మీ కర్తవ్యం నెరవేర్చు కున్నారు. ఇది బాగానే ఉంది. అమెరికాలో అచ్చం ఇలాగే చేస్తున్నారు. అక్కడ అమెరికాలో సెటిలవుదామనుకుంటున్నా గదా. కర్తవ్య నిర్వహణలో బిజీ అయిపోయి, తరచుగా మిమ్మల్ని చూడడానికి ఈ దేశం రాలేకపోవచ్చు.

అందుకని మీకు సకల వసతులూ కల్పించి వెళ్దామనుకున్నాను. మన ఓల్డేజ్ హోమ్‌లు, వాటి నిర్వహణా పద్ధతులు ఎలా ఉన్నాయో తెలుసుకుని, ఉన్నవాటిలోకెల్లా ఏది మంచిదో, మీకు ఏది తగినదో తెలుసుకోవాలని, ఇలా ఓల్డేజ్ హోమ్‌లు సర్వే చేస్తున్నాను. ఇన్నాళ్ళ నా అన్వేషణ ఫలితంగా చివరికి మీరు సెలక్ట్‌చేసిన తాతయ్యా, నాన్నమ్మలున్న హోమ్ బాగుందనిపించింది. భవిష్యత్‌లో ఈ హోంలకూ డిమాండ్ పెరిగిపోతుంది. ఓ పదేళ్ళు ముందే మీకోసం ఓ రూం రిజర్వ్ చేసి వుంచాలనుకున్నాను" అన్నాడు రజనీకాంత్ అతి వినయంగా.

—ఎ. అన్నపూర్ణ

---

## నూట నలభయ్యొకటోది...

సాయంత్రం ఆఫీసునించి ఇంటికి రాగానే కాఫీ అందిస్తూ అర్థాంగి చెప్పిన మాట విని నిర్ఘాంతపోయాను.

సుందరం నా ఆత్మీయుడు. అతని ఏకైక సంతానం గోపి. ఎంసెట్‌లో ఇంజనీరింగ్ సీటు దొరక్క బికాం చదువుతున్నాడు. మూడ్రోజుల క్రితం కాలేజీకి వెళ్లినవాడు ఇంతదాకా తిరిగి రాలేదుట!

సుందరం ఇంటికి బయల్దేరాను.

వాళ్లని చూడగానే మనసు చివుక్కుమంది. పెద్దగా కలిగిన వాళ్లు కాకపోయినా



చీకూచింతా లేని కుటుంబం. తాము నవ్వుతూ ఎదుటివారిని నవ్వించే మన స్తత్వం వారందరిదీ. నన్ను చూడగానే ఏడుపుని అతికష్టంమీద ఆపుకున్నారు భార్యాభర్తలిద్దరూ.

వాళ్లు చెప్పిన వివరాల్నిబట్టి చూస్తే గోపి ఇంట్లోంచి వెళ్లిపోవడానికి కారణం ఏమీ కన్పించడంలేదు. మరేమైనట్లు?

"పద, పోలీస్‌స్టేషన్లో కంప్లెయింటిద్దాం" సుందరాన్ని కదిపాను. ఇక దుఃఖం ఆపుకోవడం కల్యాణి వశంకాలేదు.

మధ్యతరగతి మనుషులకి పోలీస్ స్టేషనంటే 'భయమే మరి.

ఎస్.ఐ. మేము చెప్పిందంతా విన్నాడు. ఓ వందన్నర ప్రశ్నలు వేసి తన అనుమానాలన్నీ నివృత్తి చేసుకున్నాడు. ఆలోచించి మూడ్రోజుల తరువాత కన్పించమన్నాడు.

బయటకు వచ్చాక "దొరుకుతాడంటావా?" అని మా వాడి నోట్లోంచి వెలువడిన మాటలు నా గుండెను చీల్చాయి.

"ఛ! ఛ! తప్పకుండా వస్తాడు. ధైర్యంగా వుండు" అంటూ ధైర్యం చెప్పాను.

మూడు రోజుల తరువాత పోలీస్ స్టేషనుకెళ్లాం. ఎస్.ఐ నవ్వుతూ పలకరించాడు.

"ఏమైనా తెలిసిందాండీ?" నేనే గొంతు పెగుల్చుకుని అడిగాను.

"అదే చెప్పబోతున్నాను. పెద్ద ప్రోగ్రెస్ లేకపోయినా ఇంటరెస్టింగు విషయమొకటి తెలిసింది. మీలాంటి కంప్లెయింట్స్ మరో నాలుగొచ్చాయి"

నాకు మతిపోయింది. ఏమయ్యారు వీళ్లంతా? కలిసికట్టుగా ఎక్కడికేనా పారిపోలేదుకదా?

అంతటి బాధలోనూ గోపికి తోడుగా మరొక నలుగురున్నారనేది కాస్త ఊరట కలిగించింది.

ఆ మర్నాడు ఎస్.ఐ.గారు పిలుస్తున్నారంటూ కానిస్టేబులు మా ఇంటికొచ్చాడు. నేను సుందరాన్ని తీసుకుని పోలీస్ స్టేషన్‌కెళ్లాను.

ఎస్.ఐ. సాదరంగా ఆహ్వానించాడు.

"సుందరంగారూ! మీరు కాస్సేపు బైట కూర్చోండి" అనడంతో సుందరం బైటకెళ్లిపోయాడు.

అతనలా వెళ్లగానే ఎస్.ఐ. ప్రారంభించాడు. "మీ అబ్బాయి దొరికినట్టేనండీ, కానీ..."

"పర్వాలేదు చెప్పండి" నేను అందుకున్నాను.

"విడిపించుకు రావడానికి ఓ మూడు లక్షలవుతుంది"

నేను షాక్ తిని, నిదానంగా తేరుకుని అడిగాను.

"కిడ్నాపింగ్ కేసా! మా వాడెవరిక్కావాలి. వాడి బాబు కోటీశ్వరుడు కూడాకాదే!"

"అలాంటిదే అనుకోండి. అంతకంటే ప్రస్తుతానికేమీ చెప్పలేను. ఇదో కొత్తరకం కేసులెండి"

"ఓ రెండ్రోజుల టైమిస్తారా?"

"ఆలస్యం చెయ్యకండి"

నాకేమీ అర్థం కావటంలేదు. కిడ్నాపర్లు సాధారణంగా పోలీసులకు తెలియడానికొప్పుకోరు. మరి ఇదేంటి? సాక్షాత్తూ ఎస్.ఐ. ధోరణే కిడ్నాపర్ల తరపున మాట్లాడుతున్నట్లుంది.

చేసేదిలేక తప్పదుగదా అనుకుంటూ సుందరం ఇల్లమ్మేశాడు. ఆరులక్షలు చేసే ఇంటికి నాలుగు లక్షలే వచ్చినా కొనేవాళ్లు రెడీకేష్ ఇస్తామనటంతో వెంటనే రిజిస్ట్రేషన్ కూడా అయిపోయింది.

సుందరాన్ని తీసుకుని వెళ్లి ఎస్.ఐ.గారికే కాష్ ఇచ్చేశాను.

ఆ కేష్ వైపు చూస్తూ ఎస్.ఐ. నిట్టూరుస్తూ ఇలా అన్నాడు.

"కాస్త బాధాకరమే. అయినా తప్పడం లేదు. మీకు సుబ్బయ్యగారు తెలుసనుకుంటాను. చింతపండు వ్యాపారంలో కోట్లు గడించాడు. ఎవరో అతనికి కాలేజీ పెట్టమని సలహా ఇచ్చారు. లెక్కలు వేసి చూసుకుని ఇది భలే లాభసాటి వ్యాపారం అని తెల్సుకుని వెంటనే ఓ కాలేజీ ప్రారంభించేశాడాయన. ఇతన్ని చూసి గోవిందారావుగారు కూడా కాలేజీ పెట్టేశారు. ఎలిమెంటరీ స్కూల్ టీచర్లకు ప్రత్యేకంగా ట్రెయినింగులిప్పిస్తున్నారు.

"వీళ్లు కాలేజీలైతే పెట్టేశారు. వాళ్లేమో ట్రయినింగవుతున్నారు గానీ స్టూడెంట్సు మాత్రం రావడంలేదు. ఎక్కడినుంచొస్తారు? అందుకే వాళ్లు ఎలాంటి ఇబ్బందీ లేకుండా ఏర్పాట్లు చేసుకుని రాజకీయ నాయకుల్ని కాకాపట్టి స్టూడెంట్సుని కిడ్నాప్ చెయ్యడం ప్రారంభించారు. సుందరంగార్ని భయపడొద్దని చెప్పండి. నాలుగేళ్ల బి.టెక్. కోర్సు పూర్తవగానే గోపీనొదిలేస్తారు. ఈ లోపున వదిలితే వేరే కాలేజీవాళ్లు మళ్లీ కిడ్నాప్ చేసే ప్రమాదముంది. అందాకా ఈ ఫొటో ఉంచుకోండి ఎన్లార్జ్ చేసి గోడకు తగిలించి రోజూ చూస్తుండండి".

ఆతృతతో ఆ ఫొటో అందుకుని చూశాను. ఓ పదిమంది మధ్యలో గోపీ నీరసంగా చూస్తున్నాడు. అతని వెనకనే వున్న తాటాకుల పాక మీద "బిన్‌లాడెన్ ఇంటర్నేషనల్ ఇంజనీరింగ్ కాలేజీ" అనే బోర్డు వేలాడుతోంది.

– సుబ్బశ్రీ

## కల్తీలేనిది

ఆ మధ్య చచ్చేవాళ్ళ సంఖ్య విపరీతంగా పెరిగిపోవడంతో త్రిమూర్తులవద్దకు పరుగెత్తుకొచ్చాడు యమధర్మరాజు.

"మహాప్రభో! ఈమధ్య ఎందుకోగానీ మృతజీవులు ఉప్పెనలా వచ్చిపడుతున్నారు. యమలోకంలోని ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ యుగాల ఆరంభానికిముందు ఏర్పరచబడినది. మాడర్నైజేషన్‌కి నేను పెట్టుకున్న అర్జీల అతీగతీలేదు. రిటైరవుతున్న స్టాఫ్‌కి రీప్లేస్‌మెంటూలేదు. ఈ సడెన్ ఎక్సోడస్‌ని తట్టుకోవడం యమయాతనగా వుంది" అంటూ మొరపెట్టుకున్నాడు.

సృష్టికర్తవంక ప్రశ్నార్థకంగా చూశాడు విష్ణుమూర్తి.

"ఇందులో నా తప్పేమీలేదు. యమలోకంలోని ఫెసిలిటీస్‌నీ, స్టాఫ్‌నీ దృష్టిలో పెట్టుకునే జీవుల నుదుటి రాత రాస్తున్నాను నేను. అయినా శివాజ్ఞలేనిదే చీమైనా కుట్టదుగదా!" అంటూ చల్లగా నెపం శంకరుడిమీదికి తోసేశాడు బ్రహ్మ.

"నో... నో... ఈమధ్య శివతాండవంలో పాప్‌ని మిక్స్‌చేసి కొత్త స్టెప్పు ప్రాక్టీసు చేస్తూ బిజీగా వున్నాను నేను. చీమలకీ, దోమలకీ ఆజ్ఞలిచ్చేంత తీరిక నాకెక్కడిదీ? మృతులసంఖ్య పెరుగుదలకు కారణం నేను మాత్రం కాదు" అన్నాడు శంకరుడు, చేతులకున్న బూడిదను దులిపేసుకుంటూ.

"అసలు కిటుకేదో భూలోకంలోనే వున్నట్టుంది" అంటూ దేవేంద్రుడు ఛైర్మన్‌గా ఓ త్రీ మెంబర్ కమిటీని భూలోకానికి పంపించాడు విష్ణువు విషయం తెలుసుకురమ్మని.

భూలోకమంతా పర్యటించింది కమిటీ... అంతటా కాలుష్యమే! అన్నీ కల్తీయే. తినుబండారాలు, సరుకులు... మందులు... సర్వీసెస్సూ... గాలి, నీరు, చివరికి మనుషుల మమతానురాగాలూ, ప్రేమలూ కూడా!

నీతి, రీతి గాలిలో కలిపేసి చేతలలో



కల్తీని నింపేసి రాబోయే తరాలకు సరిపడా ఆస్తిపాస్తుల్ని పోగుచేసి నిలవవేసే పథకంలో భాగంగా మానవుడు చేసే 'కల్తీ' పనులు దేవేంద్రుడి కమిటీని దిగ్భ్రాంతుల్ని చేశాయి. ఇంకా అక్కడే వుంటే తామూ కల్తీ అయిపోయే ప్రమాదముందన్న భయంతో వెంటనే స్వర్గానికి చెక్కేసింది కమిటీ.

నివేదికను త్రిమూర్తులకు సమర్పిస్తూ, "ప్రభూ! జీవుల అకాలమరణానికి కారణం త్రిమూర్తులలో ఎవరూ కాదు, కల్తీ అని విచారణలో తేలింది. కలియుగాన్ని 'కల్తీ' యుగంగా మార్చేసిన ఉద్ధండులు ఆ మానవులు" అన్నాడు దేవేంద్రుడు.

"అయితే భూలోకంలో కల్తీ లేనిదంటూ ఏదీ మిగల్లేదా, మహేంద్రా? " అనడిగాడు జాలిగా.

"నా వేయి కనులతో ఎంతో జాగ్రత్తగా వెతికి చూశాను చతురాననా! మచ్చుక్కూడా ఒక్కటీ కనిపించలేదు" అన్నాడు దేవేంద్రుడు.

"నారాయణ! ప్రజలు కాంచలేనిది పత్రికలు కాంచునంటారు. ముల్లోకాల న్యూస్‌పేపర్ని నేను. సహస్రాక్షుడి దృష్టికందనిది సయితం నాకనుల పడుతుంది" అన్నాడు నారదుడు కలుగచేసుకుంటూ. "భూలోకంలో కల్తీ లేనిది ఇంకా ఒక్కటి మిగిలి వుంది" అన్నాడు.

"ఏమిటది నారదా? " అడిగారు త్రిమూర్తులు ఆత్రుతగా, ఆశగా.

"మోసం...!" జవాబిచ్చాడు నారదుడు. "మానవుడు సాటి మనిషిని చేసే మోసం, దగా, వంచనలలో మాత్రం కల్తీ అసలు లేదు!"

"ఆ...!? " అంటూ సామూహికంగా తెల్లబోయారు త్రిమూర్తులు.

– తిరుమలశ్రీ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011; Tadepalligudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78